# తులసి పూజా విధానము

## (40 రోగాలకు చికిత్స)



రచయిత :

'భిషజ్మణి'

పాటీల్ నారాయణరెడ్డి



ప్రకాశకులు :

సాధన గ్రంథమండలి - తెనాలి

తులసి పూజావిధానము
(40 రోగాలకు చికిత్స)
డా॥ పాటీల్ నారాయణరెడ్డి

ప్రథమ ముద్రణ : 1994



వెల : **50-00**



ముద్రణ :
వాసవి ప్రింటర్స్
గాంధీచౌక్, తెనాలి - 522 201
ఫోన్ : 4299

కవర్ :
సిద్ధు గ్రాఫిక్స్
టి.బి. రోడ్, తెనాలి - 522 201
ఫోన్స్ : 3700 & 3733

ప్రతులకు :
**డా॥ పాటీల్ నారాయణరెడ్డి**
నాగార్జున నిలయం, MIG - 96
హౌసింగ్‌బోర్డు కాలనీ, అనంతపురం - 515 001



శ్రీ అవధూత

దత్త పీఠాధిపతి

జగద్గురు

పరమపూజ్య

శ్రీశ్రీశ్రీ

గణపతి సచ్చిదానంద స్వామీజీ

వారి

దివ్యపాదారవిందములకు

వినమ్రతతో నమస్కరిస్తూ

సమర్పించుకొన్నాను



రచయిత

పాటీల్ నారాయణరెడ్డి

జయగురుదత్త

**Sri Ganapati Sachchidananda**
**Avadhoota Datta Peetha Trust (R)**
Sri Ganapati Sachchidananda Ashrama
Nanjangud Road, Datta Nagar
Mysore - 570 004 ☎ : 0821 - 22662
Dt. 13-2-93

శ్రీ అవధూత దత్తపీఠాధిపతి, జగద్గురు, పరమపూజ్య
శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామీజీవారు అనుగ్రహించిన

# ఆశీస్సు

ఇహలోక ధర్మాలూ పరలోక ధర్మాలూ సమంగా మిళితం కాని ఆచారాలు మనకులేవు - అని మనలో విజ్ఞులకు తెలుసు. అయినా, ఈనాటి మన పిల్లలకు ఈ మాట నమ్మబుద్ధికాదు. వారికి తెలిసిన పరిభాషలోనే మాట్లాడి వారిని నమ్మించవలసిన అవసరం వుంది. మన శాస్త్రాలలోవున్న విషయాలను విజ్ఞానశాస్త్రపరంగా వారికి అందించే పనిని ఈనాటి పండితులు తమ పనిగా పెట్టుకోవాలి. దానితోపాటు ఆ రెండు శాస్త్రాలకుగల సమన్వయాన్నిగూడా వివరించాలి శ్రీ అవధూత దత్తపీఠం ఈ దిశలోనే కృషిచేస్తూవున్నది.

అనంతపురంలోని Dr. పాటీల్ నారాయణరెడ్డి ఈ కృషి చేస్తూవుండటం ఎంతో ముదావహం. ముఖ్యంగా "శ్రీతులసి" అన్న యీ చిన్ని గ్రంథంలో ఆయన ఈ సమన్వయంవైపు చక్కగా చూపు సారించాడు. బాగున్నది.

ఈ కృషి యింకాసాగాలి. అనేకమంది మేధావులద్వారా సాగాలి. పాటీల్ నారాయణరెడ్డి యీ కృషికి ప్రారంభకులలో ఒకడు కావటం అతని అదృష్టం, దత్తకృప. అతని కృషి సఫలమగుగాక.

తరతరాలుగా కేవలం ముసలమ్మల మూఢాచారంగా వస్తూవున్న తులసిపూజ, ఇకనుంచీ దత్తకృపవల్ల ఇంటింటా ఒక వైజ్ఞానిక ప్రయోగంగా విస్తరిల్లుగాక. జయ గురుదత్త.



# IRUM: L: RUPA D V: ST: N: MS

*This book is published with the financial assistance of Tirumala Tirupati Devastanams under their scheme*

"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

# నివేదన

తులసిని గురించి నాకు తెలిసినంతవరకూ మూడు, నాలుగు చిన్న పుస్తకములున్నవి. అవి కేవలము పూజావిధానాన్ని గురించి వివరించినవి. చికిత్సావిధానమును చెప్పినా చాలా తక్కువ. అందుచే తులసిని గురించి ఒక మంచి పుస్తకము తీసుకొనిరావలెను అని నా మనస్సులో పడింది.

ఇటువంటి సమయములో నేను బొమ్మేపర్తికి శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీని దర్శించుటకు పోయియుంటిని. అక్కడ మిత్రులు - శ్రీ సత్యరంగరావుగారు, బాలిరెడ్డిగారు నన్ను స్వామీజీకి పరిచయము గావించిరి. అప్పుడు స్వామీజీ తులసిమాతపై సమగ్రముగా ఒక పుస్తకము తీసుకొనిరా, అని ఆదేశించినారు.

నేను అనుకొన్నది - స్వామీజీ ఆదేశించినది ఒకటే కావడం దైవకృప. వెంటనే ఆపని మొదలుపెట్టి రెండు నెలలలో పూర్తిచేసి, మైసూరుకు తీసుకొని పోయి స్వామీజీ పాదాలకు అర్పించుకొన్నాను. స్వామీజీ సంతోషించి సంపూర్ణ ఆశీస్సుల నిచ్చిరి. ఇంక కావలసిన దేమున్నది. సర్వము సమకూరినది.

విద్వాన్ కాశీభట్ల సుబ్బరామశర్మగారు తమ "శ్రీతులసి విజ్ఞానము" అను గ్రంథమును, విద్వాన్ శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు "శ్రీ తులసి మహిమామృతము" అను గ్రంథమును ఇచ్చి అందలి విషయాలు యథేచ్ఛగా వుపయోగించుకొనుటకు అనుమతిఇచ్చిరి. వారికి నా ప్రత్యేక నమస్కారములు.

చిరంజీవి పి. చంద్రకళ Department of Home Science Sri Satya Sai Institute of Higher Learing, Anantapur ఈమె పరిశోధ నావ్యాసమును, మరియు తైలసాంకేతిక పరిశోధనా సంస్థ గ్రంథాలయము నుంచి గ్రంథములు ఒసంగిన మిత్రులు శ్రీ ఒ.యస్. రామచంద్రయ్యగారికి నా కృతజ్ఞతలు.

తులసి గ్రంథము ముద్రణ జరుగుచున్న విషయము తెలుసుకొని, నా డిస్పెన్సరీకి వచ్చి, నేను అడుగకనే కొంత ఆర్థిక సహాయము గావించిన ఉదారులు :

1. శ్రీ మేడా సుబ్రమణ్యంగారి భార్య శ్రీమతి శాంతమ్మగారు
2. డాక్టర్ వి.యల్. మనోహర్‌గారి భార్య శ్రీమతి కౌసల్యాగారు
3. శ్రీ జి.కె. నాయుడుగారి భార్య శ్రీమతి గిరికుమారిగారు
4. శ్రీ జి.వి. లక్ష్మన్‌గారి భార్య శ్రీమతి విజయశ్రీ
5. శ్రీ ఒ.యస్. రామచంద్రయ్యగారి భార్య శ్రీమతి సులోచనగార్లకు

తులసీమాత సంపూర్ణాయురారోగ్యములనిచ్చి సంరక్షించుగాక.

నా ఈ గ్రంథ ముద్రణ యావత్ బాధ్యతాభారాన్ని వహించిన చిరంజీవి వైద్యశ్రీ పసుపులేటి వెంకటరమణకు ఋణగ్రస్తుడనైనాను. గాన నేను ఇక్కడ ఏమి వ్రాసినా తక్కువే అవుతుంది అడుగకనే విరాళములిచ్చిన దాతలకు, టి.టి.డి. వారికి నా కృతజ్ఞతలు.

ముచ్చటగా ముద్రించి ఇచ్చిన వాసవి ప్రింటర్స్, తెనాలి ముద్రణాధిపతులు శ్రీ 'వాసవి' సాంబశివరావుగారికి, కవరుపేజీ అత్యంత సుందరంగా రూపొందించి ఇచ్చిన సిద్ధు గ్రాఫిక్స్, తెనాలి వారికి కృతజ్ఞతలు.

కష్టపడి చూచినా అచ్చు తప్పులు దొర్లినవి. నేను పండితుడనుగాను నాకు తోచిన బాష ఉపయోగించుట జరిగినదిగాన సహృదయులైన పాఠకులు మన్నించ ప్రార్థన.

- పాటీల్ నారాయణరెడ్డి

నాగార్జున నిలయం
యం.ఐ.జి. 96
హౌసింగ్‌బోర్డు కాలని
అనంతపురము - 515 001

# పాటీల్ నారాయణరెడ్డిగారి జీవిత సంగ్రహము

అనంతపురంజిల్లా, కళ్యాణదుర్గం తాలూకా, బెళుగుప్ప మండలము. రామసాగరమునందు 1-10-1928 వ తేదీ పెద్దరైతు కుటుంబములో శ్రీ వెంకటరెడ్డి శ్రీమతి గౌరమ్మ దంపతులకు ఏకైక సంతానము.

కళ్యాణదుర్గమున ఉన్నత పాఠశాలయందు విద్యను పూర్తిచేసి 13-6-1948న వీరమ్మతో వివాహము జరిగినది. తర్వాతనే 1949 నుంచి 1953 వరకు బళ్లారి యందలి తారానాథ్ ఆయుర్వేద విద్యాపీఠమునందు నాలుగు సంవత్సరములపాటు లక్ష్యలక్షణ సమన్వితముగా ఆయుర్వేదము అభ్యసించి "వైద్యప్రవీణ" పట్టమును పొందిరి. అటుపిమ్మట ఆంధ్రాయుర్వేద పరిషత్‌వారి "వైద్యవిద్వాన్", అఖిలభారత ఆయుర్వేద విద్యాపీఠమువారి "వైద్యాచార్య" పట్టములు పొందిరి.

వీరికి కమలమ్మ, రామచంద్రారెడ్డి - (ఆంధ్రాబ్యాంకు), సంజీవరెడ్డి (వైద్యవిద్వాన్), మైత్రేయి, ప్రభాకర్‌రెడ్డి (B.A. M.S. మెడికల్ ఆఫీసర్), అను అయిదుగురు సంతతి.

14-6-1954 నుంచి రూరల్ మెడికల్ ప్రాక్టీషనరుగా అనంతపురం జిల్లాయందు - పరిగి, బెళుగుప్ప, కుందేరు లందు పనిచేసి 28-2-87న పదవీవిరమణ పొందిరి.

8వ తరగతి చదువుచున్నప్పటినుంచి ఖద్దరు ధరించుట, పుస్తకములు చదువుట అలవాటు, అది వయస్సుతో పెరిగి ఈనాటికి తెలుగు, కన్నడ, హిందీ, ఇంగ్లీషు, సంస్కృత గ్రంథములు - వేదాలునుంచి నవలలవరకూ దాదాపు మూడువేలకుపైగా గ్రంథములు సంపాదించి సొంత గ్రంథాలయమును స్థాపించుకొన్నారు. అనేక తాళపత్ర గ్రంథములు సేకరించి, అందులో కొన్ని శ్రీ రాళ్ళపల్లివారి ద్వారా తిరుపతికి పంపిరి. వీరిదగ్గర పూర్తి భాగవతము, ఆయుర్వేద, జ్యోతిష్య గ్రంథములు మాత్రమే (తాళపత్ర) యుంచుకొన్నారు.

ఆయుర్వేద అభివృద్ధికి, అనంతపురంజిల్లా కూడేరునందు శ్రీ సంగమేశ్వర ఆయుర్వేద గురుకులమును స్థాపించి అనేకమంది విద్యార్థులకు ఆయుర్వేద శిక్షణ ఇచ్చి వైద్యవిద్వాన్ పరీక్షలకు పంపిరి.

వైద్య విద్యార్థులకై 1) స్వస్థవృత్తము 2) ద్రవ్యవిజ్ఞానము 3) రస తంత్రము 4) అగదతంత్రము 5) శల్యవిజ్ఞానము అను పుస్తకములను తర్వాత వైద్యులకేగాక సాధారణప్రజానీకానికి అవసరమగు "శతమానంభవతి" అను పేరున ఔషధములను సేవించక నూరు సంవత్సరములు ఆరోగ్యముగా జీవించుట ఎలా? అను విషయముతోనూ, 'డామరతంత్ర శివాంబు కల్పవిధి' అను సంస్కృత గ్రంథమును సంపాదించి దానిని తెలుగులో అనువదించి ప్రచురించిరి. ఈ పుస్తకము మూడవ ముద్రణ పొందినది.

"ఆచారాలు - శాస్త్రీయత" అను గ్రంథమును వ్రాయదలచి ఆసేతు హిమాచలము వరకూ శ్రీలంకతోపాటు అనేకమార్లు తిరిగి, అనేకమంది మహాత్ములను కలిసి విషయసేకరణచేసి, "ఆచారాలు - శాస్త్రీయత" అను గ్రంథమును ప్రచురించిరి.

14-4-1970 నందు ఆంధ్రాయుర్వేద బోర్డుకు మెంబరుగా ప్రభుత్వ ముచే నామినేట్ చేయబడిరి. (G.O. Ms No. 737 Health 14th April 1970 of 128) 13-4-71వ తేదీన ఆంధ్రాయుర్వేద బోర్డు పరీక్షలకు ఎగ్జామినరుగా నియమింపబడిరి. తర్వాత ఆంధ్రాయుర్వేద పరిషత్ కార్య నిర్వాహకవర్గ సభ్యుడుగాను, "వైద్యవిద్వాన్" పరీక్షలకు ఎగ్జామినర్‌గాను నియమింపబడిరి.

1771లో ఆంధ్రాయుర్వేద పరిషత్ ప్రస్థాన కార్యదర్శిగా ఎన్నుకో బడి, పార్వతీపురం, శ్రీశైలం, అహెూబిలము, తిరుపతి మున్నగు ప్రదేశాలలో మూలికా ప్రస్థానములను నిర్వహించిరి.

ఆంధ్రాయుర్వేద పరిషత్‌వారు వీరి సేవలను గుర్తించి స్వర్ణోత్సవాల సందర్భమున విజయవాడలో సన్మానించిరి. తర్వాత పార్వతీపురం, శ్రీశైలం అనంతపురం, తిరుపతి, పెద్దకడబూరు మున్నగు స్థలములలోకూడా సన్మా నించిరి.

1975వ సం॥ ఇండియన్ మెడికల్ ప్రాక్టీషనర్సు కోపరేటివ్ ఫార్మశీ అండ్ స్టోర్సు (IMPCOPS) మద్రాసుకు రాయలసీమ నియోజకవర్గమునుంచి డైరెక్టరుగా ఎన్నుకోబడిరి. తర్వాత అందు ఎగ్జిక్యూటివ్ మెంబరుగా ఎన్నుకో బడి, దాదాపు 12 సం॥ కొనసాగి తాడేపల్లి లో ఫార్మశీకు బ్రాంచి స్థాపించు

టకు, అనంతపురంనందు సేల్సు డిపో స్థాపనకు కృషిసల్పి సఫలత హొంది నందున మరలా 12-1-88న ఏకగ్రీవముగా డైరెక్టరుగా ఎన్నుకోబడి కొన సాగుతున్నారు.

రాయలసీమ రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్ల సంఘమునకు రాయలసీమ రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనర్ల సంఘమునకు, అధ్యక్షులుగాను, ఆంధ్రప్రదేశ్ మెడికల్ ప్రాక్టీషనర్ల సంఘమునకు ఉపాధ్యక్షులుగాను, ఆంధ్రప్రదేశ్ వైద్య విద్వాన్ సంఘ ఉపాధ్యక్షులుగాను, ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదిక్ కాంగ్రెసు ఎగ్జిక్యూటివ్ మెంబరుగాను, ఆల్ ఇండియా ఆయుర్వేద ఎడ్యుకేషనల్ కమిటి మెంబరుగాను, ఇట్లే అనేక ఆయుర్వేద సంస్థలలో సన్నిహిత సంబంధమును కలిగియున్నారు. రాయలసీమ ఆయుర్వేద డెవలప్‌మెంటు కమిటి కార్యదర్శిగా రాయలసీమలో ఆయుర్వేద కళాశాల స్థాపనకు కృషిసల్పి సఫలత హొందిరి.

వీరి సేవలను గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము 21-5-1980వ తేదీన (G.O. Ms No. 778 H. dt 4-12-79) ఆయుర్వేద సలహాసంఘ సభ్యులుగా నామినేట్ చేసింది. (State Level Advisory Committee).

16-11-80లో రాజమండ్రి దేశీయ వైద్యసంఘమువారు "భిషఙ్మణి" అను బిరుదు ప్రధానము గావించి ఘనంగా సత్కరించినది.

ఆంధ్రప్రభ, శ్రీరామకృష్ణప్రభ, శ్రీశైలప్రభ, సప్తగిరి, ఇండియన్ మెడిసిన్ హౌస్ జర్నల్, ఇండియన్ మెడిసిన్, శ్రీ ధన్వంతరి మొదలగు దిన, వార, పక్ష, పత్రికలలో అనేక వ్యాసములు ప్రచురితమయినవి. ఆల్ ఇండియా రేడియో కడపనుంచి వీరి ప్రసంగోపన్యాసములు ప్రసారమయినవి.

షష్ఠిపూర్తి అయిన ఈ వయస్సులో 22-5-1988వ తేదీన ఆంధ్రా యుర్వేద పరిషత్‌వారు విద్వత్ వైద్యపరిషత్ అధ్యక్షునిగా ఏకగ్రీవముగా ఎన్నుకొని గౌరవించినారు.

ప్రస్తుతము వీరు అనంతపురం నందు ఆయుర్వేద చికిత్సలు సల్పుతూ, గ్రంథ రచన, గ్రంథ పఠనములతో కాలక్షేపము చేయుచున్నారు.

# విషయసూచిక

నాల్గవ అధ్యాయము :

# తులసి నామ మహిమ

తులసి పవిత్రమైన మొక్క. ఆసేతు హిమాచలము వరకు హిందువులు భక్తి భావముతో తులసిని పూజిస్తారు.

"తులాంశ్యతి ఇతి తులసి"- అసమానమైనది. వెలకట్టడానికి అతీతమైనది. తనతో సమానమైనదేదీ లేనిది అని మూలార్థముగా చెప్పవచ్చును.

'తు' అనగా మృత్యువు. 'లసతి' ధిక్కారము చేసినది అనగా మృత్యువును ధిక్కరించునది అని తులసికి అర్థము చెప్పబడియున్నది.

ఇంతటి మహాత్మ్యము కలిగినది తులసి గాన దీనిని గురించి స్కాంద, పద్మ, వాయు, మాఘ, బ్రహ్మవైవర్త, బృహద్ధర్మ, గరుడ ఆదిగాగల అనేక పురాణములు, వేదములుకూడ తులసిని అనేక విధములుగా వర్ణించినవి.

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వ దేవతాః
యదగ్రే సర్వ వేదాశ్చ తులసీం త్వాం నమామ్యహమ్.

(మాఘ పురాణం)

మూలమునందు సమస్త తీర్థములును, మధ్యను సమస్త దేవతలును, కొస యందు సమస్త వేదములును గల తులసిదేవికి నమస్కారములు.

"దేవీ పాదోదకం స్త్రీణామాయు రారోగ్యవర్ధనమ్" ఇటువంటి తులసీదేవి పాదోదకము స్త్రీల సమస్త రోగములను నిర్మూలించి ఆయురారోగ్యములను వృద్ధి చేయును.

శ్లో॥ తులస్యాంసకలా దేవాః వసంతి సతతం య తః।
అతస్తామర్చ యన్లోకే సర్వాన్ దేవాన్ సమర్చయేత్॥

తులసి యందు సర్వదేవతలు సర్వకాలములందును నివశించుదురు. కావున సర్వలోకవాసులు సర్వకాలాలయందును తులసిని పూజింపవలయును.

---

దైవకృప, అదృష్టం నిన్ను వరించినా - గర్వాన్ని మాత్రం నీవు వరించకు

శ్లో॥ "పాపాని యాని రవిసూను పురాకృతాని
బ్రహ్మఘ్న బాల పితృమాతృ వధాది కాని
నశ్యంతి తాని తులసీవన దర్శనేన
గో కోటి దాన సదృశం ఫలమాప్నుతేచ"

తులసీవన దర్శన మాత్రముననే బ్రహ్మహత్య, శిశుహత్య, పితృహత్య, మాతృహత్య మొదలగు ఘోర పాపములు నశించి, కోటి గోవులను దానముచేసిన ఫలము లభించును.

శ్లో॥ తులసీకాననం యత్ర యత్ర పద్మవనానిచ
వసంతి వైష్ణవా యత్ర తత్ర సన్నిహితో హరిః।

తులసి వనమును, పద్మములు గల కొలను, హరి భక్తులుఎచట నుందురో అచట హరి సన్నిధానముండును అని తెలుపబడినది.

ఇటువంటి తులసీదేవిని అనేక విధముల అనేకులు స్తోత్రము గావించినారు.

శ్లో॥ తులసీ శ్రీ సఖి శుభే పుణ్యప్రదే పాపహారిణి।
నమోస్తు నారద నుతే నారాయణి మనః ప్రియే॥

లక్ష్మీ సఖురాలును, శోభనశీలురాలును, పుణ్యప్రదురాలును, పాప హారిణి యును, నారద మహర్షిచే స్తుతింప బడినదియును, శ్రీమన్‌నారాయణుని ప్రియురాలును అగు తులసీదేవికి నమస్కారములు.

శ్లో॥ వృందాం వృందావనీం విశ్వపూజితాం విశ్వపావనీం
పుష్పసారం నందినీంచ తులసీం కృష్ణ జీవనీం॥

శ్లో॥ తులసీ శ్రీమహాలక్ష్మీ ర్విద్యా విద్యా యశస్వినీ।
ధర్మాధర్మననా దేవీ దేవదేవనమః ప్రియా।
లక్ష్మీప్రియ సఖీ దేవీ ద్యౌర్భూమిర చలా చలా॥

బృందా-బృందావని-విశ్వ పూజిత-విశ్వ పావని-పుష్పసార-నందిని-తులసి-కృష్ణ జీవని ఇవి తులసికి సంబంధించిన ఎనిమిది పేర్లు. ఇవి సార్థక నామావళి. గాన తులసిని పూజించి యీ నామాష్టకాన్ని పారాయణం చేసేవాడు అశ్వమేధయాగ ఫలితాన్ని పొందుతున్నాడని పుండరీక కృత తులసీ స్తోత్రమునందు చెప్పబడియున్నది.

# తులసీ జననము - పురాణ గాథలు

తులసి పూర్వజన్మమున మధురానగరిలో ఒక గోపకన్య. శ్రీకృష్ణుని అనురాగ పాత్రురాలు. వీరి ప్రణయ కలాపములకు ఓర్వలేని రాధాదేవి, అమెను భూలోకమున పుట్టెదవుగాక అని శపించినది. దానికి భయపడి గోపిక గోపాలుని శరణు వేడినది. అతడు కరుణించి "భూలోకమున నీవు పుట్టిన తర్వాత కొంతకాలము నన్ను గురించి తపమాచరించిన, నీవు నా అంశమున చేరిపోదువు" అని ఆశ్వాసనమిచ్చి ఆమె భయం పోగొట్టాడు.

ఆమె ఆ శాప ఫలంగా భూలోకమున కార్తీక పూర్ణిమా శుక్రవారంనాడు మాధవీ-ధర్మధ్వజ రాజ దంపతులకు కుమార్తెగా జన్మించినది. (దేవీ భాగవతము 9 స్కం. 17 అ.)

శ్లో॥ నరానార్యశ్చతాం దృష్ట్వా తులనాం దాతు మక్షమాః।
తేననామ్నాచ తులసీం తాం వదంతి పురా విదః॥

దేనితోను సాటిరాని ఆమె అందచందాలను చూచి సంతోషించి ఆమెకు 'తులసి' అని నామకరణం చేసినారు. స్త్రీలు, పురుషులు ఆ బాలికను చూచిన ఆమె అందాన్ని అంచనా వేయలేకపోయేవారని వ్యక్తమగుతుంది.

ఆమె అల్లారుముద్దుగా పెరిగి యుక్తవయస్కురాలైంది. యౌవనదశలో ఎందరాటంకపరచినప్పటికిని పెడచెవినబెట్టి బదరీవనమునకేగి తప మాచరించినది. తపస్సు ఫలించి బ్రహ్మ ప్రత్యక్షమయి వరము వేడుకొనుమనగా శ్రీమాన్ విష్ణు మూర్తియే తనకు భర్తయగునట్లు వరము కోరుకొనెను.

గోపాలుని అంశకల సుధామ గోపాలుడు రాధాదేవిచే శపింపబడి భూలోకమున శంఖచూడుడను రాక్షసుడుగా జన్మించి, బ్రహ్మానుగ్రహం వలన తాను యెవ్వరి చేతనూ చావకూడదనే మహావరాన్ని కోరినాడు. కాని బ్రహ్మ ఒక షరతుపెట్టాడు. శంఖచూడుని భార్యలలో యే ఒకతె అయినా శారీరకంగా గాని, మానసికంగా గాని

---

ఇతరులు ఏంచేస్తే నీకు బాధ కలుగుతుందో నీవు ఇతరులకు అది చెయ్యవద్దు

తన శీలాన్ని కళంక పరచుకుంటే శంఖచూడుని చావు తప్పదని వరమిచ్చినాడు. ఈ సంఘటన తర్వాతనే శంఖచూడుడు తులసిని మోహించి గాంధర్వమున నారదముని ఆదేశముమేరకు వివాహమాడెను.

శంఖచూడుడు తులసితో గార్హస్థ్య ధర్మాన్ని చక్కగా నడుపుకుంటూ సుఖంగా కాలం గడుపుతున్నాడు. అజేయత్వాన్ని సాధించాలనే కోరిక అతనిలో జనించింది. అతని విజృంభణ చాల ఎక్కువయినది. దేవతలు త్రిమూర్తుల శరణువేడిరి. అందు బ్రహ్మ వరప్రదాత అతడే గాన తానేమీ చేయలేనన్నాడు. తర్వాత శివకేశవులు కూడ బలుక్కున్నారు. విష్ణువు శివునికి తన త్రిశూలాన్ని ఇచ్చి శంఖచూడునితో యుద్ధం చేయమన్నాడు. యుద్ధం మహాభయంకరంగా జరుగుతూనే వుంది. శ్రీ మహావిష్ణువు వృద్ధ బ్రాహ్మణ వేషంలో శంఖచూడుణ్ని యాచించి సర్వమంగళ మయమైన కృష్ణ కవచాన్ని గ్రహించి, శంఖచూడునిగా మాయా వేషముతో తులసి ఇంటి కరిగినాడు. ఆమె తన భర్త యుద్ధమున గెలిచి వచ్చినాడని భ్రమించి, అతను కోరిన విధంగా పర్యంకము చేరి మోహించినది. ఆమెకు వ్రత భంగం జరిగిపోయింది, ఇంతలోనే యామె వంచింపబడినట్లు గ్రహించి తటాలున లేచి దూరముగా నిలబడి వికల మనస్కయై "మరుసటి జన్మలో రాయిగా మారిపోదువుగాక" అని తీవ్రంగా శపించి తర్వాత అతనిని విష్ణువుగా గుర్తించి పాదములపైబడి క్షమాపణ వేడుకొన్నది. అంత నారాయణుడు తులసీ "నీవు రెండవ లక్ష్మివై నాతో శాశ్వితముగా నివశించగలవుగాక" అని అనుగ్రహించి, ఈ వర్తమాన కాలములో నీ శరీరము గండకీనదిగా, నీ శిరోజాలు తులసి మొక్కలుగా మారిపోవును. అన్ని పత్రముల పూలకంటె నీ తులసి దేవపూజకు ప్రశస్తమగును. త్రిలోకములందును, వైకుంఠము నందును నీ తులసి సమస్త పుష్పములకంటె శ్రేష్టమైనది కాగలదు. ఈ పవిత్ర తులసీ వృక్షము-గోలోకమున, విరజాతటమున, రాసమండలమున, బృందావనమున, భాండీరవనమున మనోరమ చంపకవనమున, చందన కాననమున, మాధవీ, కేతకి, కుంద, మాలతీ, వనములందు, నితర సమస్త పుణ్యభూములందు నుత్పన్నము కాగలదు. తులసి మొదట రాలిన తులసి యాకులందంతట దేవతలు నివాసము చేయుదురు. ఎవడు తులసీ పత్ర జలమున స్నానము చేయునో వాడు సర్వతీర్థ స్నాన ఫలము, సమస్త యజ్ఞ దీక్షల ఫలము పొందును.

మరియూ ఆ పవిత్ర గండకీ నదిలో నేను సాలిగ్రామ శిలారూపంలో ఉంటాను. అచ్చోట తీక్ష్ణదంత విశిష్ట కీటకము (శలభము) నా లోపల జేరి చక్రముల రచించును. లక్ష్మీనారాయణ, లక్ష్మీజనార్ధన, రఘునాథ, వామన, శ్రీధర, దామోదర, రణరామ, రాజరాజేశ్వరి, వాసుదేవ, ప్రద్యుమ్న, సంకర్షణ, అనిరుద్ధ, అనంత, మధుసూదన, సుదర్శన, గదాధర, హయగ్రీవ, నరసింహ, ప్రభుతుల నామములతో చక్రములు, ఆకృతులు, చిహ్నభేదముల నేను బహునామముడ నయ్యెదను. సాలగ్రామశిల యుండి పూజకు తులసి లేనిచో జన్మ జన్మాంతరముల భార్యా విచ్ఛేదము కలుగును. శంఖముండి తులసి విచ్ఛిన్న మయ్యెనేని ఏడు జన్మములు భార్యావిహీనుడును, రోగియు నగును. తులసి, శంఖము, సాలగ్రామ మొకచోట నుంచిన వారు నాకు ప్రియులగుదురు, అని ఆమెను సమాధానపరచి అభయ ప్రధానం గావించినాడు, అని బ్రహ్మవైవర్త పురాణమున చెప్పబడియున్నది. ఇందే దేవాసుర సముద్ర మథన సమయమున కామధేనువు, ఉచ్చైశ్శ్రవము, ఐరావతము, కౌస్తుభము, కల్పవృక్షము మొదలగు వాటితోపాటు తులసికూడ పుట్టినదనియున్నది.

పద్మపురాణము - ఉత్తర ఖండమునందలి జలంధర - బృంద కథను చూతము :

ఇంద్రుడు శివదర్శనము చేయ మనసు కలిగి శివలోకమునకు బోవ, ఒక భయానక పురుషుడు కానవచ్చెను, ఈశ్వరు డెక్కడకు పోయెనని పలుమార్లు అడిగిననూ సమాధాన మియ్యనందున ఇంద్రుడు కోపించి వజ్రాయుధముతో ఆ భయానక పురుషుని గొట్టెను. అప్పుడు రుద్రతేజము వలన మంట బయలువెడలెను. దానిని చూచి ఇంద్రుడు భయపడి రుద్రుని ప్రార్థించెను. అంత రుద్రుడు శాంతించి యింద్రుని మాడ్చి వేయుటకు ఫాలనేత్రమునుండి వెలువడిన అగ్నిని గంగాసాగరము నందుంచెను. అక్కడ ఆ యగ్ని బాల రూపమును పొంది రోదన మొనరింపసాగెను. వాని రోదన శబ్దమునకు సప్తలోకములు బధిర ప్రాయము లాయెను. అది విని బ్రహ్మ ఆశ్చర్యపడి అచ్చటికేగి, నా బాలునిచూచి, వీడెవడని ప్రశ్నించెను. అంత సముద్రుడు వీడు నా బిడ్డడు. వీనికి జాతకర్మాదులు చేయుడని శిశువును బ్రహ్మ కిచ్చెను. ఆ బాలుడు బ్రహ్మ గడ్డము పట్టుకొని తన చిన్నారి చేతులతో వెంట్రుక లాడింపగా బ్రహ్మకు రెండు కనుల నుండి నీరు వెడలెను, అప్పుడు 'ఏ కారణమున

నా కనులవెంట నీరు ఆ బాలకుని వలన గలిగెనో, ఆ కారణమున నీ పిల్లవాని పేరు జలంధరు'డని నామకరణముచేసి, యిప్పుడే వీడు సర్వ శాస్త్ర వేత్త యగును. రుద్రుడు గాక యే ఇతరములు నితనిని జంపజాలవు అని చెప్పి శుక్రుని బిలిచి యసుర రాజ్యము నకు జలంధరుని రాజుగా నభిషిక్తుని చేయించెను. ఇతడు కాలనేమి కూతురు బృందను వివాహమాడెను. జలంధరుడు ఒకమారు పార్వతీదేవి కడకు శివుని రూపమున బోయి, ఆమెను వంచింపదలచుకొనెను. దీనిని కనిపెట్టిన పార్వతీదేవి, విష్ణుమూర్తితో బృంద యొక్క పాతివ్రత్యమును చెఱుపుమని కోరెను.

జలంధరునకు శివునకు ఒకమారు యుద్ధము జరుగుచుండెను. ఆ సమయమున విష్ణుమూర్తి మాయా జలంధరుని వేషమున బృందను మోసపుచ్చి రతికేళిని దేలెను.

జలంధరునకు బ్రహ్మవరము ప్రకారము తన భార్య పాతివ్రత్యమును పోగొట్టుకున్నందున శివుని చేతిలో మరణమును పొందెను.

అప్పుడు బృంద తను మోసగింపబడినట్లు గ్రహించి, ఇక ఆ శరీరము నొల్లక చితి పేర్చుకొని, విష్ణువును శపించి, అగ్నిలో దుమికి ప్రాణము వదలెను. ఆమె విరహాన్ని భరించలేని విష్ణుమూర్తి బాధను చూచి నివారణోపాయం కొరకు సకల దేవతలు, ధాత్రి, లక్ష్మి, గౌరి అను త్రిశక్తులను ప్రార్థించగా వారు వారి అంశలతో కూడిన మూడు రకముల విత్తనములిచ్చి, విష్ణువున్నచోట - అదే - బృంద అగ్నిలో దుమికి ప్రాణములు కోల్పోయిన స్థలమునందలి బూడిదలో నాటుమని ఆదేశించినారు. ఈ విధముగా గౌరిచే యివ్వబడిన గింజవలన తులసి, లక్ష్మిదేవి యిచ్చిన గింజవలన మాలతి, భూదేవి ఇచ్చిన విత్తులవలన ఉసిరకక మొక్కలు మొలచినవి. ఈ మూడిం టిని స్పృశించిన తర్వాత విష్ణువు మనశ్శాంతిని పొందినాడు" అని స్కాంధ పురాణగాథ.

పాలసముద్ర మథనమున ఉద్భవించిన అమృత కళశము నుంచి రెండు బిందు వుల అమృతము చిలికి బయటపడినది. ఆ ప్రదేశమున తులసి, పారిజాతము అను రెండు మొక్కలు పుట్టినవనియు వాటిని సత్యజిత్తు అను నాతడు నీరుపోసి పెంచినాడని ఒక గాథ మాఘ పురాణం - ఏకాదశీ వ్రతమహాత్మ్యం - క్షీరసాగర మథనమున చెప్పబడియున్నది.

బృహన్నారదీయమున వివరింపబడిన తులసి జనన వృత్తాంతమును చూతము :

ఒకనాడు కైలాసమున జగదంబికను ఆమె చెలికత్తెలు తమకు తులసీ జనన విషయము వివరించమని ప్రార్థించగా-

**దేవ్యువాచ :**

పురా కైలాస శిఖరే బ్రహ్మణః కశ్చిదాసహ।
ధర్మదేవ ఇతి ఖ్యాతః సాధు ర్విష్ణు పరాయణః॥
బృంద నామ తస్యపత్నీ బ్రహణీ ధర్మచారిణీ।
సదాపత్యనుగా సాధ్వీ పతిశ్రేష్ఠా సుఖాన్వితా॥

దేవి చెప్పుచున్నది; పూర్వము కైలాస శిఖరాన ధర్మదేవుడను సత్ బ్రాహ్మణుడు. పతివ్రతయైన, సాధ్వియునగు బృందయను భార్యతో కాలక్షేపము చేయుచుండెను. ఆమె పతి యాజ్ఞానుసారము ఎల్లప్పుడు దేవకార్యములు చేయుచు, పతి పూజ చేయుచు, కలకలలాడు నగు మొగముతో యెల్లర మన్ననలకు పాత్రురాలయ్యెను.

కృష్ణ భక్తి పరాయణుడగు నా ధర్మదేవుడు ఋషి మండలములందు శివ, కృష్ణ నామముల గానము జేయుచు పర్యటనము చేయుచుండెను. ఆ ధర్మాత్ముడు దర్శనీయుడును, ధర్మజ్ఞుడును. స్మితవదనుడును, గాన విద్యావిశారదుడును, సుందర సుమధుర కంఠముతో సర్వదా భగవన్నామమును గానముచే విష్ణు భక్తిని, తన శీలము చేత సమస్త లోకుల చిత్తములను ఆనందింప జేయుచు, లోకపావనుడయి ధర్మదేవుడు తిరుగుచుండెను. ఓ సఖీ! యొక దినమున నా ద్విజుడు బ్రాహ్మణ సభయందు గానము చేయ జేయ మధ్యాహ్న భోజనకాలము దాటిపోయెను. గృహమునందా విప్రునిల్లాలు బృంద - వచ్చిన యతిథులను పూజించినపిమ్మట, దేవపూజ గావించి, మనస్సుననే పతిదేవునికి ప్రణామము గావించుకొని, జలపానము చేసెను.

అటు పిమ్మట ధర్మదేవుడు స్వగృహమునకు వచ్చి, తన భార్య తనకన్న ముందుగా జలపానము చేయుట చూచి, దైవవశమున హఠాత్తుగా 'రాక్షసివి'కమ్మని శాపమిచ్చెను.

తన పెనిమిటి యిచ్చిన శాపవశమున బృంద వెంటనే రాక్షసియై కైలాస శిఖరమున తిరుగదొడగెను. ఆకలిచే నామె మార్గమున వచ్చు మనుష్యులను, జంతువులను భక్షింపసాగెను. పూర్వ సంస్కార బలమున గోవులను, బ్రాహ్మణులను, హరి భక్తుల జోలికి బోవునదికాదు. తక్కిన యితర ప్రాణులను దినుచు కాలము గడుపుచుండెను.

తర్వాత కొంతకాలమునకు కైలాస శిఖరము స్మరణకు వచ్చి యక్కడకు పోవలెనను యిచ్ఛకలిగి, మూడు దినములు ఉపవాసముచేసి యక్కడకు చేరెను. ఆమె ఆకలికి తట్టుకొనలేక, దేనినైనా దినెదనని యాలోచన చేయగా, నక్కడనున్న ప్రాణులన్నీ శైవ స్వభావముకలవే, ఇక బ్రాహ్మణులు నట్టివారే - వీరు నా ఆహారమున కెట్లు పాత్రము కాగలరు. శివలోకమున వృక్షములను శివ మయములే అవియు నేను తినదగినవి కావు అని యీ విధముగా చింతాకులితయైన బృందను జూచి, శివ పర్వతమందుండిన బ్రాహ్మణులు వారిలోవారు 'ఎప్పుడు నెట్టి దోషమెఱుగనిది, గుణవతియునగు బృంద రాక్షస భావము బొందినది. దైవము కంటె బలమైనది మఱొకటి లేదు. స్త్రీలకు లోలుపత్వము ప్రధాన దోషముగా జెప్పబడినది. నిర్దోషయగు బృందయందా దోషమేర్పడినది. ఆహా! దైవమెంత బలీయమైనది? ఔనుగాక ఈ బృందమునుపు చేసియున్న ధర్మబలమున కృష్ణనామమును విని, నామమయ దేహమును దాల్చి మోక్షమును బడయగలదు' అని చెప్పుకొనుచు, సర్వపాపనాశకమగు కృష్ణ నామమును వారు గానముచేయ ప్రారంభించిరి. శాపముచే రాక్షసియైన బృంద నామము వినసాగెను. క్షుధా పీడితయయి బృంద యా కైలాస శిఖరమున నెందెందు జనిన నందందు హరి నామమే వినవచ్చుచుండెను. హరినామ శ్రవణము చేయుచు నా బృంద యేడు దినము లుపవాస మొనరించి, కైలాసమునందే దేహమును విడిచెను.

అనంతరమొక సంవత్సరము కడచినది. ఒకనాడు మహాదేవుడు నాతో వన శోభను జూచుచూ బాగుగ వికసించిన తామరలతో విరాజిల్లు పుష్కరిణి గట్టునకు జేరి. యందు మరణించిన బృందయొక్క రాక్షసి శరీర మత్యంత శోభాయమానముగా నుండుట జూచి, మహేశ్వరుడు 'చూచితివా! పూర్వము విష్ణు భక్తుడగు బ్రాహ్మణుని భార్య పరమ వైష్ణవి, దైవవశమున రాక్షసి యయి, యిచట దేహ త్యాగముచేసి యేం

విధముగా ప్రకాశించుచున్నదో! చూచితివా! దేహమును వదలి యొక సంవత్సరమైనను చెడక యెట్లు శోభగానున్నదో! చూడు. ఓ దేవవందితా! శ్రీ విష్ణు భక్తి మహాత్మ్యము, విష్ణు నామ శ్రవణ ఫలము మనకీశరీరమునందు గానవచ్చుచున్నది కదా!' యని చెప్పెను. నేను మహేశ్వరుని వలన నీ కథను విని, మృతయైన బృంద శరీరమును జూచి యాశ్చర్యపడితిని. అప్పుడు నేను, దేవదేవేశ్వరునితో 'దేవదేవ! యీయమ యవయవములందంతట విష్ణు నామము కానవచ్చు చున్నది. మఱియు నీ బృంద దేహమునందెల్ల ద్వాదశాక్షర మంత్రము కనుపించుచున్నది. అప్పుడు శంభుగణము అంతయు నానందముతో నా నామమును పఠించుచున్నారు. శివగణ మా తేజోమయ మగు శరీరమును దాకగానే అది కోటి కోటి ఖండములైనవి. ఒక్కొక్క ముక్క యందు 'ఓం నమో భగవతే వాసుదేవాయ' యను మహాఫలప్రదమగు మంత్రము ఆ మంత్రముయొక్క ప్రతి యక్షర గర్భమున విష్ణుసహస్రనామములు కానవచ్చు చున్నవి. ఈ విధముగా నీ బృంద శరీరము కోటి కోటిఖండములందు గానవచ్చు చున్నది.' యని యంటిని. తదనంతరము సాక్షాల్లోక శంకరుడగు శంకరుడు ప్రీత మనస్కుడయి యానంద నృత్యము చేయుచున్న యా ప్రమథ గణములనుచూచి, "యీ బృంద ధర్మదేవుని భార్య, వైష్ణవి. శాపవశమున రాక్షసియయ్యెను. బ్రహ్మ హత్య చేయలేదు. ఈ విష్ణు ప్రీతికారిణి వృథాయగుట తగదు. ఈ బృంద భూలోక మున వృక్ష రూపము ధరించి విష్ణువునకు ప్రీతిని కలిగించుగాక! ఓ గణములారా! మీ రందరీ శరీరమును దీసికొనిపోయి భూమియందు నాటిరండు. ఈ బృందయొక్క పత్రములవలన స్వయముగ శ్రీహరి పూజితుడగును. మణులతోను, ముత్యముల తోను యీ విధముగా నర్చింపబడడు. ఈ బృందకు 'తులసి' యను సుపావన నామ మగునుగాత! చచ్చియు కాంతి సంపన్నయయియున్న నీయమ పేరు 'తులసి' యని చెప్పబడగలదు. ఈయమ ప్రతి దళమునందు ద్వాదశాక్షర మంత్రమున్నది. ఉమా మహేశ్వరుల కీ బృంద యధిష్ఠాన దేవత. ఈమెకుపాస్య దైవము నారాయణుడు. ఈమె వైష్ణవీప్రియ" యని శంకరుడు ప్రమథగణములకు జెప్పెను.

ఈ సమయమున ధర్మదేవుడు బృంద వియోగజనిత శోకాతిరేకమున క్షీణ మలినుడయి, బృందా! బృందా! యని రోదనముచేయుచు నక్కడకువచ్చి "ఓ ప్రియా!

నీవెక్కడ? నేను నిర్దయుడను. నిర్దోషిని నిన్ను రాక్షసివి కమ్మని శాపమిచ్చితిని. ఛీ ఛీ, నేనేమి మనుష్యుడను? అని తనను నిందించుకొనుచు నేడ్చుచుండ మహాదేవు డాతని నోదార్చ గొంతవడికి మనస్సు కుదుర్చుకొని శివునికి ప్రణామము గావించెను. అంత బృంద వృత్తాంతము తెలుసుకొన్నవాడయి, ధార్మికుడగు నా బ్రాహ్మణుడు పరమేశ్వరునితో, నారాయణునకై బృంద తులసిచెట్టుగా నయినప్పుడు నాకు ప్రియమగు నా వృక్షమునకు మూలమయ్యేదనని పలుక, శంభుడు 'తథాస్తు' అనెను. అంత ధర్మ దేవుడు తులసికి మూలమయ్యేను.

అనంతరము శివుని యాజ్ఞనుగొని ప్రమథగణము లానందముతో భూమండల మునకు వచ్చి యా దేహమును నుత్తమమగు కాళిందీ (యమున) తటమున నాటిరి. ఏ స్థానమున గోవర్ధన గిరివరము విరాజిల్లుచున్నదో యమున నే దేశమున అర్ధచంద్రా కారముగా బుట్టియున్నదో, శ్రీకృష్ణునకు బరమ ప్రీతి స్థలము, త్రైలోక్యమునకు గోపనీయ స్థలము, యోగుల శిరములందున్న సహస్రార పద్మమువలె వాంఛితమగు స్థలమునగు నాదేశమున బృందను నాటి శివగణములు మరల కైలాసమునకు బోయెను.

అనంతరము దామోదరునకు ప్రియమగు కార్తీకమాసమున అమావాస్య తిథి యందు ప్రాతఃకాలమున తులసి విష్ణువునకు, శివునకు ప్రీతిగా నావిర్భవించెను. తులసి యావిర్భవించిన వెంటనే శివునితో నారాయణదేవుడు భూలోకమునకు వచ్చి తులసిని జూచెను.

మహామేఘ ప్రభాం శ్యామాం స్కంధ పల్లవ శోభితామ్।
దళై రసంఖైః సంపూర్ణాం మహామంత్ర మయీాం స్థిరామ్।
జ్వలంతీ స్వేన మహసా గంధామోదిత దిఙ్మఖామ్॥

మహా మేఘమువలె శ్యామవర్ణము కలిగి, స్కంధ పల్లవములతో శోభిల్లుచు, మహామంత్రమయియు, పత్రయుక్తయు, స్వీయ తేజస్సుచే దేదీప్యమానయై, సుగంధ ముచే దిక్కులెల్ల పరిమళింపజేయుచున్న తులసిని జూచెను. విష్ణువు శివునితో నా తులసిచెట్టును జూచి సంతోషించెను. అప్పుడు మంగళప్రదయగు తులసీదేవిమూర్తిని పరిగ్రహించెను. తులసి నారాయణుని స్తోత్రము మనసార చేయసాగెను.

అనేక ప్రకారములుగా స్తోత్రము చేసిన తులసిని జూచి దేవకీ నందనుడగు హరి -

తులసి శ్రీమతి శ్రేష్ఠే బృందే బృందావనే ప్రియే।
స్థిరీభవ మమ ప్రీత్యైయాదవా చంద్ర తారకమ్॥

ఓ శ్రీమతీ! శ్రేష్ఠా! బృందావనా! ప్రియా! బృందా! చంద్రతారకలున్నంత కాలము నా ప్రీతికై స్థిరముగా నుండుము.

నర సుర సురోగాదుల సర్వదా యభినందింప జేయుదానవు. వందనీయవు. నీ పత్రములకంటె నా పూజ కన్యము లేదు.

ఏకతః సర్వ నైవేద్య నానాపుష్ప విభూషణమ్।
ఏకతః పత్రమేకం తే ద్వాదశాక్షర మంత్రవత్॥

నానా పుష్ప విభూషణ నైవేద్యము లొకటి. ద్వాదశాక్షర మంత్ర విశిష్టమగు నీ పత్ర మొకటి సమానము. వృక్షరూపిణివగు నీకు ప్రదక్షిణము గావించి, దండ వత్ప్రణామము సమర్పించువాడు సప్త దీపములతోడి భూమికి ప్రదక్షిణము చేసినవాడగును. శ్రాద్ధము, తర్పణము, దానము, నైవేద్య దానము-నీ పత్రము లేనిది ఫలము నీయజాలవు. నన్ను నీ పత్రములతో పూజించిన సకల దేవతలు తుష్టి చెందెదరు.

కార్తీకమాసమున నే మానవుడు నాకు నీ పత్రమొకటి సమర్పణము చేయునో వాడు సహస్ర గోదానముల ఫలమును బొందును.

మాఘే మాసిచ తే పత్ర మాలాం యచ్ఛతి యోజనః।
తస్మాదహం ప్రయచ్ఛామి వాజిమేధక్రతో ఫలమ్॥

మాఘమాసమున నీ పత్రములతో గూర్చిన మాలను నాకు సమర్పించు వానికి నేను అశ్వమేధ ఫలము నిచ్చుచున్నాను. వైశాఖమాసమున నీ పత్రములతో శయ్యను

కల్పించి నా కిచ్చువానికి నన్నే యిచ్చుకొనుచున్నాను. ఇంతకు అధికమేమున్నది? వైశాఖమాసమున నీ పత్రముల జలముతో నన్నభిషేకించువానికి సతతము అమృత విధియందు స్థానమిచ్చుచున్నాను.

ఆషాడమాసమున నీ పత్రముల రసముతో వాసితమగు జలము నా కర్పించు వ్యక్తికి నేను మోక్షమిచ్చుచున్నాను. నీ పత్రములు భూతలమున నేతావున పడినను శివుని యాజ్ఞచే వానిని నామస్తకముతో గ్రహించెదను.

త్వత్పత్ర జల సిక్తాన్నం యో భుంక్తేమానవః క్వచిత్।
త దేవామృత మిత్యుక్తః భుక్తం భాగ్యవతా శుభే।
త్వత్పత్ర రసభోజీ చ గంగాజల సమన్వితమ్।
సోఽహమిత్యేవ విజ్ఞేయం సత్యం సత్యంశపేశపే॥

నీ పత్రజలముతో తడిపిన యన్నము నే మానవుడు భుజించునో యదియే అమృతమని చెప్పబడును. అదృష్టవంతుడే దానిని భుజించును. గంగాజలముతో జేర్చిన నీ పత్రరసమును సేవించువాడు నేనేయని విశేషముగా తెలియదగును. నేను నిజముగ శపథముచేసి చెప్పుచున్నాను.

ఓ శోభనా! యే వ్యక్తి నీ పత్రమును దాకి యబద్ధము లాడునో వాడు కోటి కల్పముల కయినను నుగ్రనరకము నుండి విముక్తిని కాంచలేడు.

త్వత్కాష్ఠమాలాం త్వత్కాష్ఠ ఘృష్టే పంకంచయోఽదధాత్।
అహం తస్యానుగః శుద్ధే భవామి సుతవత్ పితుః॥

పవిత్రమైన ఓ తులసీ! నీ కట్టెతో చేసిన మాలను, నీ కట్టెతో తీసిన గంధమును నే వ్యక్తి ధరించునో 'తండ్రి కొడుకువెంట పోవునట్లు' వానివెంట నేను పోయెదను,

ఈ కథను జెప్పి, భూలోకములో పాపనాశినియగు తులసీదేవిని యభిషేకించి, ఇంద్రాది దేవగణములు, ప్రమథగణములతో మహేశ్వరుడునంతర్ధానము చెందిరి. అని మాత వివరించి ముగించెను.

ఏమయిననేమి శ్రీకృష్ణుడు తులసీదేవిని మనసారా ప్రేమించినాడు అనుటకు, ఆనాడు అతను నిర్మించిన బృందావన నగరము యీ నాటికి సాక్షీభూతముగా నిలిచి యున్నది. మనము చూడవచ్చును. ఇటువంటి తులసీదేవి మహాత్మ్యమును గురించి పరిశీలింతము.



# తులసీ మహాత్మ్యము

తులసీ మహాత్మ్యానికి పురాణగాథల్లోని శ్రీకృష్ణ తులాభారము చక్కని నిదర్శనము. సత్యభామాదేవి గర్వమడంచదలచి నారదమహర్షి ఆడిన నాటకమున చిక్కువడి, దిక్కుతోచక అల్లాడు సమయమున, శ్రీమతి రుక్మిణీదేవి మనసారా శ్రీకృష్ణుని ప్రార్థించి కేవలము ఒక్క తులసీదళముతో శ్రీకృష్ణుని తూచి, భగవంతుని దక్కించుకొన్న ఇతిహాసము అందరికీ విదితము.

తులసీదళములతో దండలుకట్టి ప్రతిదినము శ్రీరంగధామునకు సమర్పించిన గోదాదేవి ధన్యత నొందినది.

వనవాస సమయమున శ్రీరాముని పర్ణశాల ప్రాంగణములో మహాసాధ్వి సీతాదేవి, మహాయోగియైన లక్ష్మణుడు తులసి మొక్కలను నాటినట్లు చెప్పబడియున్నది.

శ్రీరాముని వియోగం సంభవించిన తరువాత అశోకవాటికలో సీతాదేవి తులసీదేవిని ధ్యానించి మరలా రాముణ్ణి పొందినదని తెలియుచున్నది.

సీతాన్వేషణ సమయంలో హనుమంతుడు, విభీషణుని మహలు ప్రాంగణములో తులసీ మొక్కలను దర్శించి ఆనందించినట్లు తులసీ రామాయణములో వర్ణింపబడి యున్నది.

పార్వతీదేవికూడ దేవాదిదేవుడైన మహాదేవుని పతిగా పొందగోరి హిమాలయాల్లో తులసి మొక్కలునాటి పెంచి, పోషించి సేవించినది. దేవాంగనలు, కిన్నరులు గూడ అరిష్టపరిహారానికి నందనవనంలో తులసిని సేవించినారు.

ధర్మారణ్యమైన గయలో పితరులు తులసిని సేవించినారు.

---

ఆపదలోయున్న స్త్రీ లందరికీ తులసి ఆర్తత్రాణపరాయణిగా ప్రఖ్యాతిపొందిన విషయము భారతీయులందరికి తెలుసు.

పార్వతీవల్లభుడైన పరమేశ్వరుడు తనకుమారుడైన కార్తికేయునికి తులసి గొప్పతనాన్ని వివరిస్తూ "అన్నిరకముల పత్రపుష్పాలకన్నా తులసి శ్రేష్ఠమైనది. కోరికలన్నిటిని నెరవేరుస్తుంది. శుభాన్ని భోగమోక్షాలను అనుగ్రహిస్తుంది. పూజలో ఎన్నిరకాల పూలున్నా చందనాదులున్నా తులసి ఒక్కటి లేకుంటే భగవంతునికి సంతోషమే మాత్రం కలుగదు. ప్రతినిత్యం తులసీదళములతో భగవంతుని పూజించిన దాన, జప, హోమవ్రతాదుల ఫలం లభించినట్లే. తులసి పూజవల్ల సుఖంకలుగుతుంది. యశస్సు కలుగుతుంది. సంపదలు లభించును. అనుకూలవతియైన భార్య లభించును. గుణవంతులైన సంతానము కలుగుతారు. విజ్ఞానము ఏర్పడుతుంది. వేదవేదాంగములు, శాస్త్రపురాణాలు, తంత్ర సంహితలు మొదలగునవి అన్నీకరతలామలకము లవుతాయి. తులసి సమీపంలో సామ గానం చేయటంవల్ల మంత్రజపాదులవల్ల, అనంతమైన ఫలితము దొరుకుతుంది. భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసులు తులసికి దూరంగానే ఉంటాయి. బ్రహ్మహత్యాది పాపాలు నశించిపోతాయి. తులసి సమీపములో దురాలోచనకు తావుండదు. ప్రశాంతి కలుగుతుంది. జన్మరాహిత్య మేర్పడుతుంది.... అని చెప్పినారు.

"శ్రీ మహాభాగవతము"న చెప్పబడిన తులసీ మాహాత్మ్యమును సంక్షేపముగా చూతము.

ఉమామహేశ్వరుడు నారదమహర్షికి తెలిపిన విషయము :-

శ్రీ మహాదేవ ఉవా :

1. తులస్యాఃశ్రుణు మహాత్మ్యం సంక్షేపేణ మహామతే।
యచ్ఛృత్వా సర్వపాపేభ్యోనరో ముక్తిమవాప్నుయాత్॥

2. తులసీ ద్రుమ రూపస్తు భగవాన్ పురుషోత్తమః।
సర్వలోక పరిత్రాతా విశ్వాత్మా విశ్వపాలకః॥

మహాదేవుడు చెప్పుచున్నాడు :- ఓ మహామతీ! సంక్షేపముగా తులసీ మహాత్మ్యమును వినుము. దానిని వినిన మానవుడు సర్వపాపములనుండి విముక్తుడగును భగవానుడు, పురుషోత్తముడు, విశ్వాత్మ, విశ్వపాలకుడు, సర్వలోక పరిత్రాతయగు శ్రీహరియే తులసీ వృక్షరూపమును ధరించెను.

3. దర్శనాత్ స్పర్శనా న్నామ కీర్తనాద్ధారణా దపి।
ప్రదానాత్ పాప సంహర్త్రీ నరాణాం తులసి సదా॥

4. ప్రాతరుత్థాయ సుస్నాతోయః పశ్యేత్ తులసీద్రు మం।
స సర్వ తీర్థ సంద్రృష్టి ఫల మాప్నోత్య సంశయమ్॥

5. దృష్ట్వా గదాధరం దేవం క్షేత్రే శ్రీ పురుషోత్తమే।
యత్పుణ్యం సమవాప్నోతి తులసీ దర్శనాచ్చతత్॥

దర్శనము, స్పర్శనము, నామకీర్తనము, ధారణము, శ్రీహరి పదము లందర్పణము చేసినచో, తులసి మానవుల పాపములను సర్వదానశింపజేయును.

ప్రాతః కాలమున లేచి చక్కగా స్నానముచేసి తులసి చెట్టును చూచినచో నిశ్చయముగా సర్వతీర్థముల దర్శించిన ఫలము మానవులకు గలుగును.

శ్రీ పురుషోత్తమ క్షేత్రమున గదాధరుని జగన్నాథ దేవుని దర్శనము చేసిన వెంత పుణ్యము కలుగునో, తులసీ వృక్ష దర్శనమున అంతఫలము లభించును.

6. దినం తచ్చ శుభం ప్రోక్తం తులసీ యత్ర దృశ్యతే।
నతత్ర జాయతే తస్య విపత్తిః కుత్ర చిన్మనే॥

7. అపి జన్మాంతరే కృతం పాపమత్యంత గర్హితమ్।
వినశ్యతి ముని శ్రేష్ఠ తులసీ వృక్ష దర్శనాత్॥

8. అశు చిర్వా శుచిర్వాపి యః స్పృశేత్ తులసీదలమ్।
సర్వపాప వినిర్ముక్త స్తత్‌క్షణాత్ శుద్ధతా మియాత్।
ప్రయాతి చ పదం విష్ణో రంతే దేవ సుదుర్లభమ్॥

9. తులసీ స్పర్శనం స్నానం తులసీ స్పర్శనం తపః।
తులసీ స్పర్శనం ముక్తిః తులసీ స్పర్శనం వ్రతమ్॥

10. ప్రదక్షిణీకృతా యేన తులసీ ముని సత్తమ।
కృత ప్రదక్షిణస్తేన విష్ణుః సాక్షాన్న సంశయః॥

ఏ దినమున తులసీ దర్శనమగునో, ఆ దినమే శుభమని చెప్పబడినది. జన్మాంతరమున జేసిన యతి గర్హితములగు పాపములు తులసీ వృక్ష దర్శనమున నశించును.

శుచిగాగాని యశుచిగాగాని యే వ్యక్తి తులసీదళమును స్పర్శించునో వాని సర్వ పాపములు నశించి తక్షణము శుద్ధుడగును. అంతమున మిగుల దుర్లభమగు విష్ణు ధామమునకు బోవును.

తులసిని తాకుటే స్నానము, తులసిని స్పర్శించుటే తపము, తులసీ స్పర్శనమే ముక్తి. తులసీ స్పర్శనమే వ్రతము. ఓ మునిసత్తమా! ఎవడు తులసికి ప్రదక్షిణము గావించునో వాడు స్వయముగా విష్ణువునకే ప్రదక్షిణ మొనరించిన వాడగును. ఈ విషయమున నేమియుసంశయము లేదు.

తులసి సత్త్వగుణముయొక్క సాక్షాన్మూర్తి. తులసి పత్రములందు, కట్టె యందు, గంధమునందు, కడకు తులసి మొదలు (బుడము) నందలి మట్టియందు సత్త్వగుణము నిశ్చలముగా యున్నది. తులసి సేవయందలి మనస్సు సత్త్వగుణమున నిమజ్జితమగును. తులసీ గంధము నాసికాపుటములగుండ లోపల ప్రవేశించి లోపల తమస్సును నశింపజేయును. తులసి చెట్టుపైనుండి వచ్చు పరిమళముతోడి గాలి వెలుపలి తమస్సును బోగొట్టును.

11. తులసీ ప్రణమేద్యస్తు భక్త్యా మానవ సత్తమః।
సయాతి విష్ణోః సాయుజ్యం న పునః ప్రపతేత్ క్షితౌ॥

ఏ మానవశ్రేష్ఠుడు భక్తితో తులసికి ప్రణామము చేయునో, వాడు విష్ణు సాయుజ్యమును బొందును. వాడు మరల భూమిమీద జన్మమెత్తడు.

12. తులసీ కాననం యత్ర, తత్ర సాక్షాజనార్ధనః।
లక్ష్మీ సరస్వతీ యుక్తా, మోదతే మునిసత్తమ॥

13. యత్ర విష్ణుర్జగన్నాధః, సర్వదేవమయః ప్రభుః।
తత్రాహం సహ రుద్రాణ్యా, సావిత్ర్యాచ ప్రజాపతి॥

14. తస్మాత్తత్పరమం స్థానం దేవానా మపి దుర్లభమ్।
యోగచ్ఛేత్ సవ్రజేద్విష్ణో, ర్వైకుంఠ నగరంమునే॥

15. స్నాత్వాప్రమార్జయేద్యస్తు, తత్క్షేత్రం పాపనాశనమ్।
సోఽపి పాపవినిర్ముక్తః, స్వర్గలోక మవాప్నుయాత్॥

ఓ మునిసత్తమా! ఎచట తులసీ కాననముండునో అచట సాక్షాత్ జనార్ధనుడు, లక్ష్మీ, సరస్వతులతోగూడి యానంద విహారము సలుపుచుండును. ఏ తావున సర్వ దేవమయుడు, ప్రభువు, జగన్నాథుడు, విష్ణువు వేంచేసియుండునో యా తావున రుద్రాణితో నేను, సావిత్రితో బ్రహ్మ నివసించెదము. ఆ స్థానము దేవగణములకు నూ దుర్లభము. ఓ మునీ! యా స్థలమున కెవరు పోయెదరో వారు వైకుంఠమునకు బోయెదరు. స్నానముచేసి ఏ వ్యక్తి పాపనాశనమగు నా క్షేత్రమును లెస్సగా చిమ్మి పరిశుభ్రము చేయునో, వాడును స్వర్గమును బొందును.

16. యఃకుర్వా త్తులసీమూల, మృదా తిలక మత్తమమ్।
కపోలే కంఠదేశేచ, కర్ణయోః కవచద్వయే॥

17. బ్రహ్మరంధ్రే హృదిపృష్ఠే, పార్శ్వయోర్నాభి దేశకే।
సపుణ్యాత్మా మునిశ్రేష్ఠ, విజ్ఞేయో వైష్ణవోత్తమః॥

18. తులసీ పుష్ప బృందేన, పూజయేత్ యో జనార్దనమ్।
సోఽప్యుక్తో వైష్ణవ శ్రేష్ఠః, సర్వ పాప వివర్జితః॥

19. వైశాఖే కార్తికే మాఘే, ప్రాత స్స్నాత్వా విధానతః
యోదదాతి సురేశాయ, విష్ణవే పరమాత్మనే॥

ఏ వ్యక్తి తులసి మొదటనున్న మన్నుతో కపోలము, కంఠప్రదేశము, చెవులు పదద్వయము, బ్రహ్మరంధ్రము, హృదయము, పృష్ఠము, పార్శ్వము, నాభి యీ తావుల నుత్తమమగు తిలకము ధరించునో, పుణ్యాత్ముడగు నా వ్యక్తియే వైష్ణవోత్తముడని తెలిసికొనుము. ఎవడు తులసీ పుష్ప సమూహముతో జనార్ధనుని పూజించునో వాడును సర్వపాప వివర్జితుడగు వైష్ణవ శ్రేష్ఠుడని చెప్పబడును. వైశాఖము కార్తీకము, మాఘము అను నీ మాసములలో యథావిధిగా ప్రాతఃకాలమున స్నానము చేసి, దేవేశ్వరుడు, పరమాత్మయునగు విష్ణునకు తులసీ పత్రము లర్పించు వారనంత పుణ్యమును బడయుదురు.

20. గవా మయుత దానస్య వాజపేయ శతస్యచ।
యత్ఫలం తత్సమాప్నోతి, కార్తికే పూజయన్ హరిమ్॥

21. తులసీ పత్రకైస్తద్వ, త్తులసీ పుష్ప కైరపి।
తులసీ కాననే యస్తు, జగన్నాథం సమర్చయేత్।
మహాక్షేత్ర కృతాయశ్చ, పూజాయాః ఫలమాప్నుయాత్॥

పదివేల యావులను దానముచేసిన నే ఫలము కలుగునో, నూఱు వాజపేయ యజ్ఞములవలన నే ఫలము కలుగునో, కార్తీకమాసమున తులసీ వనములో హరిని బూజించిన నా ఫలము కలుగును. తులసీ పత్రములతో, నట్లులే తులసీ పుష్పములతో తులసీ కాననమున జనార్దనుని బూజించినయెడల మహాక్షేత్రములందు జేసిన పూజా ఫలము లభించును.

22. తులసీ రహితం నైవ, కర్మకుర్యా ద్విచక్షణః।
కుర్వన్న కర్మణ స్తస్య సమ్యక్ఫల మవాప్నుయాత్।
తులసీ రహితా సంధ్యా కాలాతీతేవ నిష్ఫలా॥

విచక్షణులగు వ్యక్తులు తులసి లేని కర్మముచేయరు. చేసినచో, నా కర్మము ఫలమీయజాలదు. తులసీ రహితమగు సంధ్య, కాలాతీతమైనప్పుడు చేసిన దానివలె నిష్ఫలము.

23. తులసీబృంద మధ్యేతు నిర్మాయ హరి మందిరమ్।
తృణేనేష్టక బృందైర్వా తత్రయః స్థాపయేద్ధరిమ్॥

24. నియతం సేవనాసక్తః సహరేః సామ్యతామి యాత్।
యస్తు తులసీవృక్షం విష్ణురూపం విభావ్యచ।
త్రి ధైవం ప్రణమేన్మర్త్యః స తస్య సమతాం వ్రజేత్॥

25. నమస్తే దేవదేవేశ సురాసుర జగద్గురో।
త్రాహిమాం ఘోర సంసారాన్నమస్తేఽస్తు సదామమ॥

26. యస్తు శ్రీ తులసీం మర్త్యః ప్రణమేత్తారిణీధియా।
త్రిధా ప్రదక్షిణీకృత్వా సప్తధారా మహామతే॥
మంత్రేణానేన సద్భక్త్యా సతరే ద్ఘోర సంసారాత్॥

తులసీ బృందము నడుమ హరిమందిరము గడ్డితోగాని యిటుకలతోగాని నిర్మించి, యందు శ్రీహరిని స్థాపించి, నియతముగా హరి సేవపారాయణుడగు మానవుడు హరి సామ్యమును బొందును, ఏ నరుడు తులసీ వృక్షమును విష్ణు రూపముగా భావించి, త్రికరణము (మనోవాక్కాయము) లతో ప్రణామ మొనరించిన హరి సముడగును. ఓ దేవదేవ! సురాసుర జగద్గురో! నీకు ప్రణామము. నన్ను ఘోర సంసారమునుండి రక్షింపుము. నేను నీకు నమస్కారము చేయుచున్నాను. ఏ మానవుడు తులసి తారిణి యను జ్ఞానము కలిగి, మూడు లేక యేడుసార్లు భక్తితో నీ మంత్రము చదువుచు ప్రదక్షిణము చేయునో, వాడు ఘోర సంసారమునుండి యుత్తీర్ణుడగును.

27. త్రైలోక్య నిస్తార పరాయణే శివే యథైవ గంగా సరితాం వరా స్వయమ్।
తథైవ లోకత్రయ పావనార్థం ద్రుమేషు సాక్షాత్తులసీ స్వరూపిణీ॥

28. త్వం బ్రహ్మ విష్ణు ప్రముఖైరురోత్తమైః పురార్చితా విశ్వపవిత్ర హేతవే।
జాతాధరణ్యాం జగదేక వంద్యే నమామి భక్త్యా తులసీ ప్రసీద॥

ముల్లోకముల దరింపజేయు పరాకాష్ఠగల శుభ స్వరూపా! ముజ్జగముల పవిత్రముచేయు గంగ సకల నదులలో ప్రధానమైనట్లు, మూడులోకముల పావనము చేయుటకు సకల వృక్షములలో సాక్షాత్తులసీ స్వరూపిణివి నీవు. బ్రహ్మ విష్ణు ప్రముఖ దేవశ్రేష్ఠులచే పూర్వమర్పింపబడితివి. జగత్తులో నీవే వందనీయవు. విశ్వము పవిత్రము చేయుటకు నీవు భూమిలోనుండి యుద్భవించితివి. నీకు భక్తితో ప్రణామము గావించెద. నీవు ప్రసన్నవుకమ్ము.

29. ఏవం యేప్రణమస్త్యేనాం ప్రత్యహం మునిసత్తమ।
తస్య సర్వార్థదా దేవి యత్ర కుత్రాపి తిష్ఠతి॥

30. తులసీ సర్వ దేవానాం పరమప్రీతి వర్ధనీ।
సర్వదేవాధి సంస్థానం యత్రాస్తే తులసీవనమ్॥

31. పితరోఽపి పరంప్రీత్యా వసంతే తులసీవనే।
అవశ్యం తులసీదేవా, పితృదేవార్చనాదిషు॥

32 అదత్త్వా మనుజైః సమ్యక్ నకర్మ ఫలమాత్యతే।
విష్ణోస్త్రైలోక్య నాధస్య పిత్రాణాంచ విశేషతః॥

33. సర్వేషా మేవ దేవానాం దేవీనాంచ మహామతే।
పరమప్రీతిదా జ్ఞేయా తులసీ లోకముక్తిదా॥

34. తస్మాద్ధి తులసీదేయా దైవేప్త్రొత్యేచ కర్మణి।
యత్రాస్తి తులసీవృక్షస్తత్ర భాగీరథీ స్వయమ్।
తీర్థైః సమస్తైః సహితా వసతిం కురుతే సదా॥

35. తస్మాత్తత్ర మునిశ్రేష్ఠ దేహం సంత్యజతాం నృణామ్।
గంగాయాం మరణే యాదృక్ఫలం స్యాత్తాదృగేవహి॥

ఓ మునిశ్రేష్ఠా! ఈ ప్రకారముగా నెవరు తులసికి ప్రణామము చేయుదురో వారెచ్చటనుండినను సరే, వారికి తులసి సర్వార్థము లిచ్చుచుండును. ఏ తావున తులసీ కాననముండునో ఆ తావున సమస్త దేవతలుందురు. దేవ పితృదేవతల నర్పించు

కాలమున నవశ్యము తులసి సమర్పింపవలెను. తులసి నర్పింపనిచో మానవులు పూర్తిగ కర్మఫలమును బడయజాలరు. త్రైలోక్యనాథుడగు విష్ణునకు-విశేషించి పితృదేవతలకు, సమస్త దేవదేవీగణములకు - లోకముక్తిదాయిని తులసి పరమప్రీతి దాయిని యని తెలియుము. అందువలననే దేవ పితృకార్యము లవశ్యము తులసీదాన యోగ్యములైనవి.

ఎచ్చోట తులసీ వృక్షముండునో నా స్థలమున సమస్త తీర్థములతో స్వయముగ భాగీరథి నిత్యము నివాసము చేయుచుండును. ఆ కారణమున మునిశ్రేష్ఠా! యా స్థానమున దేహము విడిచిన - గంగాతీరమున మరణించిన ఫలమునకు సమాన ఫలము గలుగును.

36. ధాత్రి వృక్షశ్చ చేత్తత్ర వర్తతే బహు భాగ్యతః।
తదధికతరం జ్ఞేయం స్థలం తద్ బహు పుణ్యదమ్॥

37. తత్ర దేహభృతాం దేహ పరిత్యాగా న్మహామునే।
అజ్ఞానతోఽపిముక్తిః స్యాత్ సత్యం సత్యం నసంశయః॥

38. ఏతయోః సన్నిధౌ యత్ర బిల్వవృక్షోఽపి విద్యతే।
తత్ స్థానం హి మహాతీర్థం సాక్షాద్వారాణసీసమమ్।

39. తత్ర సంపూజయే చ్ఛంభోర్దేవ్యా విష్ణోశ్చ భావతః।
బహు పుణ్యప్రదం జ్ఞేయం మహాపాతక నాశనమ్।
తత్రైకం బిల్వపత్రం యో మహేశాయ నివేదయేత్॥

40. తథా విష్ణుం సు సంపూజ్య తులస్యామల కీదళైః।
ప్రయాతి విష్ణు సాయుజ్యం సత్యమేవ మహామతే॥

41. నా పునర్జన్మబాప్నోతి తత్క్షేత్రస్య ప్రభావతః।
ఇత్యుక్తంతే మునిశ్రేష్ఠ మహాత్మ్యంచ సమాసతః।
య ఇదంశ్రుణు యాన్నిత్యం సోఽపి స్వర్గ మవాప్నుయాత్॥

అత్యంత సౌభాగ్యవశమున నా తావుననే గనుక ఉసిరిక చెట్టుండెనా, ఆ పుణ్య ప్రదమగు స్థాన మధికతరమగునని తెలియవలెను. ఆ స్థలమున దేహులు, అజ్ఞానముచే శరీరము విడిచినను ముక్తి కలుగును. యిది సత్యము, సత్యము, యేమీ సంశయము లేదు. ఈ రెండు వృక్షములున్నచోట మారేడుండెనా, యది వారణాసి (కాశి) వలె మహాతీర్థము. ఆ ప్రదేశమునజేసిన శంభు. దేవీ. విష్ణుపూజలు మహాపాతక నాశక ములు, బహు పుణ్యప్రదములని తెలియుము. ఆ స్థలమున నే వ్యక్తి ఒక బిల్వ దళ మును మహేశ్వరునకు నివేదన చేసినను, అదేవిధమున తులసి, ఆమలకీ (ఉసిరిక) పత్రముతో విష్ణువును పూజించినను ఓ మహామతి! సత్యముగా నా వ్యక్తి విష్ణు సాయు జ్యమును బొందును. ఆ క్షేత్ర ప్రభావమున పునర్జన్మము కలుగదు. ఓ మునిశ్రేష్ఠా! సంక్షేపముగా తులసీ మహాత్మ్యమును చెప్పితిని. ఏ వ్యక్తి యీ మహాత్మ్యమును శ్రవణము చేయునో, వాడును స్వర్గమును బడయును.

## మత్స్యసూక్త షోడశ పటలము నుంచి :

1. సర్వేభ్యః పత్ర పుష్పేభ్యో వరిష్ఠా తులసీప్రియే।
   సర్వకామప్రదా శుద్ధా వైష్ణవీ విష్ణువల్లభా॥
2. భుక్తి ముక్తిప్రదాదేవీ సర్వలోక హితాపరా।
   యా మాశ్రిత్యగతాః స్వర్గమక్షయం పరమేశ్వరి॥

శివుడు శంకరికి తులసిని గురించి తెలియజెప్పుచూ - సమస్త పత్ర పుష్పము లలో తులసి శ్రేష్ఠమైనది. సర్వకామముల నిచ్చునది. శుద్ధమైనది. వైష్ణవి - విష్ణు ప్రియ, భోగమోక్షదాయిని, సర్వలోక హితకరి. ఓ పరమేశ్వరీ! యనేకులు తులసి యాశ్రమమున శాశ్వత సుఖస్థానమగు స్వర్గమును బ్రాపించిరి.

3. హితార్థం సర్వలోకానాం పృథివ్యాం రోపితా పురా।
   యథా విష్ణుప్రియా లక్ష్మీర్యధాత్వం హరవల్లభా॥
4. తథేయం తులసీదేవి చతుర్థీనోప పద్యతే।
   యథా గంగా పవిత్రాహి సర్వలోక విమోక్షదా॥

5. సమంజరీదళైర్యేవ తులస్యా విష్ణు రర్చితః।
తస్య పుణ్యఫలం దేవి కథితుం నైవశక్యతే॥

సమస్తలోక హితమునకై పూర్వకాలమున భూమిమీద నిది నాటబడినది. ఏ విధముగా లక్ష్మి విష్ణుప్రియయో, నీవు హరప్రియవో అదేవిధమున తులసీదేవి - నాల్గవది మరేదియులేదు. ఏ ప్రకారము సమస్తలోక ముక్తిదాయిని పవిత్రగంగయో ఆ ప్రకారమే యిది సకల పాపుల పాపముల హరించును. మంజరీ సహిత తులసీ పత్రములతో నే వ్యక్తి విష్ణువును పూజించునో వాని పుణ్యఫలము వచింపదరముకాదు.

6. త్రిషు లోకేషు విఖ్యాతా సర్వపాప ప్రణాశినీ।
సర్వ కామ ప్రదాదేవి సర్వమంగళకారిణీ॥

7. సంసారసాగరే ఘోరే తులసీ నౌ స్వరూపిణీ।
దేవానాం శివదుర్గా యాః పరం తుష్టి ప్రదాయినీ।
కల్మషా ఘాతురాణాంచ సేయ మేకా మహౌషధిః॥

ముల్లోకముల విఖ్యాతిచెందినది. సమస్త పాపములను నశింపజేయునది. సర్వ కామముల నొసగునది. సకల మంగళముల జేయునది. భయంకరమగు సంసార సాగరమునకు నౌకవంటిది. దేవగణములకు శివపార్వతులకు పరమ సంతోషము నిచ్చునది. పాప, రోగపీడితులకిది ముఖ్యమగు మహౌషధి.

అచట మరీచ - రామసంవాదమను పురాతనమగు నితిహాస ముదాహరింపబడి యున్నది - దానిని వినుము.

పూర్వకాలమున రఘుకులపతి శ్రీరామచంద్రమూర్తి ప్రతిదినము యథాకాలమున మరీచిమునిని పూజించుచుండెను. అచిరకాలమున నా మునిశ్రేష్ఠుడు సంతుష్టుడై, పరాత్పరయు దివ్యయునగు మాలను శ్రీరామున కొసగెను. శ్రీరామచంద్రుని మస్తకమున తులసీవనమున బుట్టిన మంజరీ పుంజములతోకూడిన, చతుర్వేదమయమగు దివ్య మాల నర్పించెను- భగవానుడు మంజరీ పత్రములతో గూడిన యా మాలను తీసుకొని చూచి కోపించి మునిపుంగవునితో నిట్లనియెను.

అహో కిమవలేపోఽయం బ్రాహ్మణస్య మహాత్మనః।
వనస్పతేః పత్రజాతం కథం దత్తం మమో పరి॥

ఆశీర్వాద ద్విజాతీనాం గ్రాహ్యమతిమతామితి।
అతోఽహం మునిశార్దూల అవలేపం వహామితే॥

అహో! యేమి గర్వము! మహాత్ముడగు బ్రాహ్మణునకు యేటియవజ్ఞ! ఒక చెట్టు ఆకులు నా తలమీద నెట్లు వేసెను? మునిశార్దూలా! మతిమంతులగు వారికి బ్రాహ్మణుల యాశీర్వాదములు గ్రాహ్యములని యీ గర్వమునకు నే నోర్చితిని.

రాముని యీ వాక్యములను విని తులసీదేవి రోషముతో శాపమిచ్చెను,

యస్మాన్మదావలేపేన శిరసో మాం విముక్తవాన్।
తస్మాద్రాజేంద్ర వైదేహ్యా వియోగస్తే భవిష్యతి॥

ఓ రాజేంద్రా! మద గర్వమున మస్తకమునుండి నను తీసిపాఱవేసితివి. కావున నీకు వైదేహితో వియోగము కలుగు గాత!

శాపమిచ్చిన తులసీదేవిని, సక్రోధ నయనుడగు సీతావల్లభు శ్రీరామచంద్ర మూర్తిని, మహామతి మరీచి యిట్లని చెప్పదొడగెను.

సుప్రసీద మహారాజ వ్రజామి శరణం తవ।
కథయామి పురావృత్తం విచిత్రం ముని భాషితమ్॥

ఏషాహి తులసీమాలా మయాదత్తా సురేశ్వర।
తస్యా విచిత్ర మాహాత్మ్యం మత్తస్సర్వం నిశామయ॥

మహారాజా! సుప్రసన్నుడవుకమ్ము. నేను నిన్ను శరణు చొచ్చుచున్నాను. విచిత్రముని చెప్పిన పూర్వ వృత్తాంతము చెప్పుచున్నాను వినుము. ఓ దేవేశ్వరా! యీ తులసీమాలను నేను నీకిచ్చుచున్నాను. దీనియద్భుతమగు మాహాత్మ్యమును వినుము.

ఇయం హి బ్రహ్మరూపేణ మహాలక్ష్మీ ప్రతిష్ఠితా।
బ్రహ్మీయం పరమాశక్తిః బ్రహ్మణో రోమ సంభవా॥

ఋగ్యజుస్సామ వేదాద్యాః శాఖాచరణ సమ్మితాః।
యథా గంగా యథా గీతా గాయత్రీచ యథామతా।
పద్మయోనేః సముద్భూతా తథేయం లోకపావనీ।
యత్రైషా తిష్ఠతే సమ్యక్ తత్ర లక్ష్మీః ప్రతిష్ఠితా।
ఇమాంవినా తథా లక్ష్మి ర్వినాశాయో పజాయతే।
ఏవంసృష్టా జగన్మాతా తులసీ బ్రహ్మణా స్వయమ్।
లోకానాం పావనార్థాయ పృథివ్యా మవతారితా।
ఏనా మారాధ్య దేవేశో మహాదేవో జగత్పతిః।
అసురం ఘోర నామాన మజయద్రణసంకులే॥

ఈ తులసీ వృక్షరూపమున మహాలక్ష్మి వెలసినది. బ్రహ్మరోమ సంభూత యగు నిది శ్రేష్ఠమగు బ్రాహ్మీశక్తి. ఋక్కు, యజుస్సు, సామము మున్నగు వేదములు శాఖాచరణ సమ్మితములు. ఎట్లు గంగ, గీత, యెట్లు గాయత్రి, పద్మయోని బ్రహ్మ యెట్టు లుత్పన్నమైరో, అట్టులే లోకపావని తులసియు వానినుండి పుట్టినది. ఎచట నీ తులసి యుండునో యచట లక్ష్మి ప్రతిష్ఠితమై యుండును. తులసి లేని లక్ష్మి వినాశమునకు మూలమగును. ఈ విధముగా స్వయముగా బ్రహ్మ తులసిని సృజించి లోకములు పవిత్రములగుట కీ పృథివి యందవతరింపజేసెను. ఈ తులసి నారాధనచేసి జగత్పతి దేవేశ్వరుడు మహాదేవుడు - ఘోరుడను నసురుని యుద్ధమున జయించెను.

ఏవమేషా మహాదేవి తులసీ విశ్వరూపిణీ।
తమ ప్యారాధయ స్త్వేనాం విజయం ప్రాప్స్యసిధ్రువమ్॥
ఏత చ్ఛ్రుత్వాతు వచనం మహర్షేర్మధుసూదనః।
జయాయ శిరసామాలాం ప్రణిపత్యచ సాదరమ్।

జగ్రాహా విటప స్తస్యాః పూజయామాస రాఘవః।
తత స్తస్యాః ప్రభా వేన భగవాన్ రఘునందనః।
యాతు ధానం మహావీర్యం జితవాన్ రావణంరణే॥

ఈ విశ్వరూపిణియగు తులసీ మహాదేవి యిట్టిది. నీవును నీమె నారాధింపుము నిజముగా విజయము కలుగును. మధుసూదనుడు మహర్షి వాక్యములను విని జయము కొఱకు తలతో సాదరమున మాలకు ప్రణామ మొనరించి, సర్వ కామప్రదమగు నా వృక్షమును గ్రహించెను. తదనంతర మా ధర్మవృక్షమును దీసికొని తన ఇంటికి బోయెను. రామచంద్రమూర్తి యధావిధి తులసీ వృక్షమును నాటి పూజించెను. భగవానుడగు రఘునందనుడు దాని ప్రభావమున మహాబలవంతుడగు రావణుని రణ మున జయించి, జానకీమాతను పొందెను.

(పేజీ 15 నుంచి 27 వరకు శ్రీ దాస శేషుగారి శ్రీ తులసీ మహిమామృతము నుంచి యథావిధిగా గ్రహింపబడినది)

స్కాంద పురాణంలోని వైశాఖ ఖండములో ఒక కథ యున్నది. ఒకప్పుడు కాశ్మీర దేశంలో హరిమేధుడు, సుమేధుడు అని ఇద్దరు బ్రాహ్మణ శ్రేష్ఠులుండేవారు. వారు ఒకమారు తీర్థయాత్రలు చేస్తూ దుర్గమారణ్యంగుండా ప్రయాణిస్తున్నారు. వారికి అక్కడ తులసీతోట కనిపించింది. దానిని చూచిన సుమేధుడు భక్తితో ఆ తోటకు ప్రదక్షిణంచేసి సాగిలపడి నమస్కారం గావించినాడు.

దీనిని గమనించిన మిత్రుడు హరిమేధుడు "ఎందరో దేవతలు, ఎన్నో తీర్థాలు యుండగా యీ తులసీ వనానికి ఎందుకు అంత భక్తితో ప్రణామం గావించినారు?" అని అడిగినాడు.

అంత సుమేధుడు ఇలా చెప్పసాగినాడు. ప్రాచీన కాలంలో దేవ దానవులు క్షీరసాగరమును మధించినారు. అప్పుడు కల్పవృక్షము, లక్ష్మి, చంద్రుడు, ఐరావతము, ధన్వంతరి మొదలగునవి ఉద్భవించిన తర్వాత జరామరణాలను లేకుండా చేయు అమృతకలశం ఆవిర్భవించింది. దాన్ని శ్రీమహావిష్ణువు పరిగ్రహిస్తూ సంతోషించి నాడు. అప్పుడు అతని కన్నులనుండి ఆనందాశ్రువులు కొన్ని ఆ అమృతముపై పడి

నవి. వెంటనే వాటినుండి తులసి మొలచింది. వెంటనే బ్రహ్మాది దేవతలు లక్ష్మిని. తులసిని శ్రీహరి సేవకు సమర్పించినారు విష్ణుమూర్తి చాల సంతసించినాడు. అప్పటి నుంచి తులసి విష్ణుమూర్తికి మిక్కిలి ప్రీతిపాత్రురాలైంది. హరిప్రియ అయింది. అందుకే నేను ఆమె పాదాలకు (తులసీ తోటకు) ప్రణామం గావించినాను అని చెప్పి ముగించినాడు.

వెంటనే వారు కూర్చొని సంభాషించుచున్న ఆ వటవృక్షమునుంచి ఫెళఫెళ శబ్దముతో తేజసంపన్నులైన ఇద్దరు పురుషులు ప్రత్యక్షమైనారు. వారిని చూచి బ్రాహ్మణ మిత్రులిద్దరూ భయపడి, గడగడ వణకుచు ఎవరు మీరు? దేవతలవలె నున్నారు అని అడిగినారు. అందులకు వారు ఆ బ్రాహ్మణులకు నమస్కరించి. స్వామీ మీరు మాకు ప్రాణదాతలు. నాపేరు ఆ పితుడు. నేను దేవలోకనివాసిని. నేను తపోనిమగ్నుడయి యుండే లోమశ మహామునికి చేసిన అపచారమునకై ఈ మఱ్ఱి చెట్టుపై బ్రహ్మరాక్షసుడనై యున్నాను. మీరు విష్ణు నామాన్ని, తులసీ మహిమను గూర్చి ఇంతవరకూ చెప్పినది విన్నంతట నా శాప విముక్తుడనైనాను. ఇదియంతయూ మీ అనుగ్రహమని విన్నవించినాడు. అంత రెండవ ఆతనుకూడ తన కథను వివరిస్తూ నేను గురువాజ్ఞ నుల్లంఘించినందున బ్రహ్మరాక్షసుడనై యీ మఱ్ఱిచెట్టును ఆశ్రయించినాను. ఈనాడు మీచే నారాయణ నామాన్ని, విశ్వపూజితమైన తులసీ మహాత్మ్యన్ని విని ముక్తుడైనాను. ఆదర్శ బ్రాహ్మణులయిన మీ ఇరువురి తీర్థ యాత్రాఫలిత మిక్కడనే లభించింది" అని విన్నవించెను. తర్వాత ఆ తేజోమూర్తులు ఆ భూసురులకు ప్రణామ మాచరించి దేవలోకమున కరిగిరి. అంత బ్రాహ్మణులిద్దరు ముక్తి ననుగ్రహించిన విష్ణుప్రియ తులసీ మహిమను స్మరిస్తూ తీర్థయాత్రలకయి ముందుకు సాగినారు అని చెప్పబడినది.

మాఘ మాహాత్మ్యమునందు - తులసి మొక్కలను నాటి పెంచడమువల్ల యమ యాతన లుండవని, తులసి యందు తీర్థాలన్నీ యున్నవని, తులసి వాసన దోషా లన్నిటిని తొలగిస్తుందని, భగవంతుని తులసితో పూజించే ఫలితము బంగారు పుష్పాలతో పూజించినా రాదని, బ్రహ్మ, ఇంద్రుడు ఆదిగాగల దేవతలందరుకూడా తులసితో విష్ణువును పూజిస్తారని తెలుపబడియున్నది.

గంగను తులసిని నిరంతరము స్మరించుటవల్ల పాపపరిహారమేగాక దుస్స్వప్న దుర్నిమిత్త ఫలితములు తొలగుచున్నవి. ఎటువంటి కష్టములను పొందక సుఖపడు చున్నాడు. తులసీవన దర్శనముతోనే బ్రహ్మహత్యాది పాపములన్నియూ తొలగుటయే గాక అనంత గోదాన, భూదాన ఫలితమబ్బుచున్నది అని తెలియుచున్నది.

తులసిలోనే సత్వగుణ మెక్కువ. ఇందువల్ల భక్తులు తులసి పూసలమాల మెడలో వేసుకుంటారు. దీనిచే దుష్టసంకల్పాలు దూరమవుతాయి, ఆలయాల్లో తులసి దళంవేసి తీర్థమిస్తుంటారు. దీనివల్ల క్రోధం శాంతిస్తుంది. ఆవేశం ఆవేదన అంత రిస్తాయి. పవిత్రభావ మేర్పడుతుంది. సత్వగుణాన్ని ఇనుమడింపచేస్తుంది. తులసి మాల మెడలో వేసుకొని చేసినకర్మ అంతా అక్షయమవుతుంది అని ఈ క్రింది శ్లోకము

**యఃకుర్యా త్తులసీ కాష్ఠే అక్షమాలాం సురూపిణీమ్।**
**కంఠ మాలాంచ యత్నేన కృతంత స్యాక్షయం భవేత్॥** వివరిస్తుంది.

తులసిని పెంచినవారు, పోషించినవారు, చివరకు తులసికి నమస్కరించినవారు కూడా ధర్మ అర్థ కామ మోక్ష ఫలములను పొందగలరు. వారి పాపములన్నియూ పోవుననియు చెప్పబడియున్నది.

తులసి బృందావనమునకు ప్రదక్షిణ మాచరించిన భూప్రదక్షిణ పుణ్యం కలుగునని, సర్వజనులూ తులసిని పూజించవచ్చునని అగస్త్య సంహితలో చెప్పబడి యున్నది.

గృహవాస్తు దర్పణము అను గ్రంథమున తులసిని గురించి పేర్కొనబడి యున్నది. ఇంటి తలవాకిలినుంచి చూచిన పెరడులోయున్న తులసిమొక్క కనిపించా లనియు, అట్టి ఇల్లు సమస్త దేవతలకు నిలయమనియు, ఇంటికి తులసి బృందావనముండి తీరవలయుననియు చెప్పబడియున్నది.

కార్తీకమాసములో తులసి పుష్పించి, తద్వారా సుగంధమును మరింత వ్యాపింపజేయును. ఈ మాసములోనే తులసి జన్మించినదని పురాణములు ఘోషించు

చున్నవి. గాన ఈ మాసములో తులసిపూజ, అనుష్ఠానము ప్రదక్షిణ మున్నగు ధార్మిక వ్రతాలు అధికముగా ఆచరింతురు. మరియు క్షీరాబ్ధి ద్వాదశినాడు, కృష్ణాష్టమి రోజునకూడ హైందవ స్త్రీలు భక్తితో తులసిని ఆరాధించడం చూస్తూయుంటాము.

తులసిమొక్కకు ప్రదక్షణము గావించినందువలన మనము తులసి వలయములో పరిభ్రమించిన వారమగుదుము. దీనివలన శారీరక, మానసిక, బౌద్ధిక చైతన్యము ఏర్పడును. దీనికి కారణము తులసిగంధ పరమాణువులను మనము పీల్చుట, తులసి మృత్తిక తిలకముగా; వేరు గంధముగా, కట్టె జపమాలకు పూసలుగా, ఆకులు పూజకు గాను, విత్తులు విషాది దోషములకు శాంతికరముగా గుర్తించి యుండినందుననే దీనిని 'విష్ణువల్లభ' అని కొనియాడిరి.

తులసికి పర్యుషితాది దోషములులేవు. శ్రౌత స్మార్త కర్మల సమస్తమున కిది లేనిది జరుగదు. శ్రాద్ధకర్మలోకూడ ఇది దేవార్ఘ్య పాత్రములను పావనము చేయుట కుండి తీరవలెను. వేయేల విశ్వుడు, విశ్వాత్ముడు, విశ్వమయుడు అయిన యీ విశ్వముయొక్క సుఖమునకు తులసికి మించినదిలేదు.

తులసి గంధపూరితమైన వాయువు వీచిన దశదిశలు పవిత్రములై పోవును. పృథ్వి, జల, వాయు, ఆకాశములను శుద్ధిచేయు శక్తి తులసి పరిమళమునకు మాత్రమే యున్నది అన్న తప్పుకాదు.

తులసి ప్రభావమునుగూర్చి ఒక్క పద్మపురాణమునందే రెండువేలకు పైగా తులసి విషయస్తవాదికములున్నవన్న తులసిని గురించి ఏమని ఎంతని వివరించగలము.

"తులసీగీత" యందు తులసీదేవి మాహాత్మ్యమును గురించి వివరించిన దానిని చూతము :

శ్రీ భగవానుడగు గోవిందుడు సత్యభామ కిట్లు చెప్పెను.

శ్రీ భగవానువాచ.

1. ప్రాగ్దత్వార్ఘ్యం తతోభ్యర్చ్య గంధ పుష్పాక్షతాదిభిః।
స్తుత్వా భగవతీం తాంచ ప్రణమే దండవద్భువి॥

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు. సత్యభామా! నీవు తులసీదేవికి ప్రథమమున నర్ఘ్యమిచ్చి. గంధపుష్పాక్షతాదులతో పూజించి స్తోత్రమొనర్చి. తులసీ భగవతికి ప్రణామమొనరింపుము.

2. శ్రీ యః శియే శ్రీయా వాసే నిత్యం శ్రీధర సత్కృతే।
భక్త్యాదత్తం మయాదేవి అర్ఘ్యం గృహ్ణ నమోస్తుతే॥

3. నిర్మితా త్వం పురాదేవైరర్చితా త్వం సురాసురైః।
తులసీ హరమే పాపం పూజాం గృహ్ణ నమోస్తుతే॥

4. మహాప్రసాద జనని ఆది - వ్యాధి వినాశిని।
సర్వ సౌభాగ్యదాదేవి తులసి త్వాం నమోస్తుతే॥

ఓ దేవీ! నీవు శ్రీలక్ష్మికి శ్రీరూపిణివి - నిత్యము శ్రీధరునిచే బూజింపబడు దానవు. భక్తితో నేను నీకు అర్ఘ్యమిచ్చుచున్నాను. గ్రహింపుము - నేను నీకు నమస్కరించెదను.

ఓ తులసీ! పూర్వము దేవగణము నిన్ను నిర్మించినారు. సురాసురులచే నీవు పూజింపబడుచున్నావు. నా పాపమును శమింపజేయుము - నా పూజను గ్రహింపుము. నీకు ప్రణామము.

ఓ దేవీ! తులసీ! నీవు ప్రసన్నతకు జననివి. అధి వ్యాధుల నశింప జేయుదువు. సమస్త సౌభాగ్యదాయినివి - నీకు నమస్కారము.

5. యాదృష్ట్వా నిఖిలాఘ శమనీ స్పృష్ట్వా వపుః పావనీ
రోగాణా మభివందితా నిరసనీ సిక్తాంకత్రాసినీ,
ప్రత్యాసత్తి విరోధినీ భగవతః కృష్ణస్య సంరోపితా.
న్యస్తా తచ్చరణే విముక్తి ఫలదా తస్యై తులస్యై నమః॥

దర్శించిన సమస్త పాపముల బోగొట్టును. తాకినచో శరీరమును పవిత్ర మొనరించును. అభివందనము చేసినయెడల రోగమును దూరమొనరించును. నీరు

పోషిన - యమభయముండదు. నాటినయెడల శ్రీకృష్ణునితో గలియునట్లు చేయును. శ్రీకృష్ణుని శ్రీ చరణము లందర్పించినచో విముక్తి నొసగును. అట్టి తులసికి ప్రణామము.

6. భగవత్యా తులస్యాస్తు మహాత్మ్యామృత సాగరే।
లోభాత్ కుర్దితు మిచ్ఛామి క్షుద్ర స్తత్ క్షమ్యతాం త్వయా॥

క్షుద్రుడను నేను - భగవతి తులసియొక్క మహిమామృత సాగర మందాశచే గ్రీడింప గోరుచున్నాను. ఓ తులసీ! నా యీ యపరాధమును క్షమింపుము.

7. శ్రవణా ద్వాదశీ యోగే సాలగ్రామ శిలార్చనే।
యత్ఫలం సంగమే ప్రోక్తం తులసీ పూజనేన తత్॥

శ్రవణ నక్షత్రముతో గూడిన ద్వాదశినాడు సాలగ్రామ శిలార్చన చేసినయెడల నే ఫలము కలదో, గంగాసాగర సంగమమున స్నానము చేసిన నే ఫలము కలదో, తులసీ పూజవలన నా ఫలము కలదు.

8. ధాత్రీ ఫలేన యత్పుణ్యం, జయం త్యాం సముపోషణే।
యత్ఫలం లభతే మర్త్యాస్తులసీ పూజనేన తత్॥

ఉసిరిక పండ్లతో హరిని బూజించుటచే నే ఫలము కలదో, జయంతితోగూడి జన్మాష్టమి నాడుపవాసము చేసిన నే ఫలము కలదో, తులసి పూజవలన నా ఫలము కలదు.

9. యత్ఫలం ప్రయాగ స్నానే, కాశ్యాం ప్రాణ విమోక్షణే।
యత్ఫలం విహితం దేవై స్తులసీ పూజనేన తత్॥

ప్రయాగలో స్నానముచేసిన నే ఫలము కలదో, కాశిలో మరణించిన దేవతలే ఫలమును విధించిరో, ఆ ఫలము తులసీ పూజవలననే కలుగును.

10. చతుర్ణామపి వర్ణానాం ఆశ్రమాణాం విశేషతః।
స్త్రీణాంచ పురుషాణాంచ పూజితేష్టం దదాతిచ॥

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములవారు, బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, యతి ఆశ్రమములవారు, స్త్రీలు, పురుషులు తులసిని బూజించిన యిష్ట ఫలముల నొసగును.

11. తులసీ రోపితాసిక్తాదృష్టా స్పృష్టాచ పావయేత్।
ఆరాధితా ప్రయత్నేన సర్వకామ ఫలప్రదా॥

నాటినను, నీరు పోసినను, చూచినను, తాకినను తులసి పావనుల జేయును, శ్రద్ధతో నారాధించిన కోరిన ఫలములనెల్ల నిచ్చును.

12. ప్రదక్షిణం భ్రమిత్వాయే నమస్కుర్వంతి నిత్యశః।
నతేషాం దురితం కించి దక్షీణ మవశిష్యతే॥

నిత్యము ప్రదక్షిణముచేసి నమస్కారము సమర్పించినవారికి గొంచమేని పాపము మిగిలియుండదు. అనగా పాపమంతయు నశించిపోవును.

13. పూజ్యమానాచ తులసీ యస్యవేశ్మని తిష్ఠతి।
తస్య సర్వాని శ్రేయాంసి వర్ధంతేఽహరహః సదా॥

ఎవని గృహమున తులసి పూజింపబడుచుండునో, వానికి సమస్త శ్రేయస్సులు ప్రత్యహము సర్వదా వృద్ధి పొందుచుండును.

14. పక్షే పక్షేచ ద్వాదశ్యాం సంప్రాప్తేతు హరేర్దినే।
బ్రహ్మాద యోఽపి కుర్వంతి తులసీవన పూజనమ్॥

ప్రతిపక్షమున ద్వాదశీ తిథియందు, హరివాసరమున బ్రహ్మాది దేవతలును తులసీవనమును బూజింతురు.

15. అనన్య మనసా నిత్యం తులసీం స్తౌతి యోజనః।
పితృదేవ మనుష్యాణాం ప్రియో భవతి సర్వదా॥

అనన్యమగు మనస్సుతో నిత్యము తులసిని స్తోత్రము చేయువాడు పితరులకు, దేవతలకు, మనష్యులకు సర్వదా ప్రియుడగును.

16. రతిం బధ్నామి నాన్యత్ర తులసీ కాననం వినా।
సత్యం బ్రవీమి తేసత్యే కలికాలే మమ ప్రియే॥

ప్రియా! సత్యభామా! నీకు నిజము చెప్పుచున్నాను. కలికాలమున తులసీ కాననము కంటె వేఱొకచోట నేను ప్రీతిగలవాడనుకాను.

17. హిత్వా తీర్థ సహస్రాణి సర్వానపి శిలోచ్చయాన్।
తులసీ కాననే నిత్యం కలౌతిష్ఠామి భామిని॥

భామినీ! వేల తీర్థములను, పుణ్య పర్వతములను వదలి కలియుగమున తులసీ కాననమున నిత్యనివాసము చేయుదును

18. నధాత్రీ సఫలా యత్రన విష్ణు స్తులసీవనమ్।
తత్ శ్మశాన సమం స్థానం సంతి యత్ర నవైష్ణవాః॥

ఎచట ఫలవిశిష్టమగు నుసిరికలేదో, యెచ్చట విష్ణువు - తులసీ వనము లేవో, యెచట హరిభక్తులు లేరో యది శ్మశానమే.

19. తులసీగంధ మాదాయ యత్ర గచ్ఛతి మారు తః।
దిశోదశ చపూతాః స్యుర్భూత గ్రామాశ్చతుర్దశః॥

తులసీ గంధము (వాసన)తో గూడి వాయువెచట వీచునో యచట దశదిశలు, చతుర్దశ భూత సమూహములు పవిత్రములగును.

20. తులసీవన సంభూతా ఛాయా పతతి యత్రవై।
తత్ర శ్రాద్ధం ప్రదాతవ్యం పితౄణాం తృప్తిహేతవే॥

తులసి చెట్లమీదనుండి వచ్చు నీడయెచట పడునో, పితృదేవతల తృప్తి కొఱకు శ్రాద్ధమచ్చోట బెట్టవలెను.

21. తులసీ పూజితా నిత్యం సేవితా రోపితా శుభా।
తులసీ స్థాపితాయై స్తుతే వసంతి మమాలయే॥

ఎవరు నిత్యము శుభము లొసగు తులసిని బూజింతురో, సేవింతురో, నాటెదరో, స్థాపనము చేయించెదరో వారు నాలోకమున వాసము చేయుదురు.

22. సర్వపాపహరం సర్వ కామదం తులసీవనమ్।
నపశ్యతి యమం సత్యే తులసీవన రోపణాత్॥

తులసీవనము సర్వపాపములను బోగొట్టును. సర్వకామముల నొసంగును. తులసీవనము వేసినవారు యముని చూడరు.

23. తులస్య లంకృతా యేవై తులసీవన పూజకాః।
తులసీ స్నాపకాయేచతే త్యాజ్యా యమకింకరైః॥

ఎవరు తులసి నలంకరించెదరో, యెవరు తులసీ వనమును పూజించెదరో, యెవరు స్నానము చేయించెదరో వారు యమకింకరులచే విడువబడుదురు.

24. దర్శనం నర్మదాయాంతు గంగాస్నానం కలౌయుగే।
తులసీదళ సంస్పర్శః సమమేత త్త్రయం స్మృతమ్॥

నర్మదా దర్శనము, గంగాస్నానము, తులసీదళ స్పర్శనము కలియుగము నందీ మూడు సమానముగా పుణ్యము నిచ్చునవని చెప్పబడినది.

25. దారిద్ర్య దుఃఖ రోగార్తి పాపాని సుబహూన్యపి।
హరతే తులసీ క్షేత్రం రోగానివహరీతకీ॥

కరక్కాయ రోగముల నన్నిటిని నెట్లు పోగొట్టునో, యట్లే దారిద్ర్యమును, దుఃఖమును, రోగమును, శోకమును బహుప్రకారములైన పాపములను తులసీ క్షేత్రము హరించును.

26. తులసీ కాననేయ స్తుముహూర్త మపి విశ్రమేత్।
జన్మ కోటి కృతాత్పాపాత్ ముచ్యతే నాత్ర సంశయః॥

ఎవడు ముహూర్తకాలమయినను తులసీకాననమునందు విశ్రమించెనేని, వాడు కోటిజన్మములందు జేసిన పాపములనుండి విముక్తుడగును. ఇందుకు సందియములేదు.

27. నిత్యం తులసీ కారణ్యే తిష్ఠామి స్పృహయాయుతః।
అపిమేక్షత పత్రైకం కశ్చిద్ ధన్యేఽర్పయేదితి॥

ఏ భాగ్యశాలియైన వ్యక్తియయినను నాకొక చిగిరిన తులసి యాకొకటియైన అర్పింపకుండునా యనెడి అభిలాషతో నిత్యము తులసీ వనమున సస్పృహుడనై వసించుచున్నాను.

28. తులసీనామ యో బ్రూయాత్ త్రికాలం వదనేనరః।
వివర్ణవదనో భూత్వా తల్లిపిం మార్జయేద్యమః॥

ఏ వ్యక్తి త్రికాలములందు 'తులసీ' అను శ్రీ నామము నుచ్చరించునో, వెల వెలబోవు మొగముతో యమధర్మరాజు ఆ వ్యక్తి చేసిన కర్మము లన్నింటిని, తన లెక్కపుస్తకములో తుడిచివేయును.

29. శుక్లపక్షేయదా దేవి తృతీయా బుధ సంయుతా।
శ్రవణాయాచ సంయుక్తా తులసీ పుణ్యదా తథా॥

శుక్లపక్షమున బుధవారముతోగాని, శ్రవణ నక్షత్రముతోగాని, కలిసిన తదియ నాడు తులసి యధిక పుణ్యఫలము నిచ్చును.

**అగస్త్య సంహితయందు** సుతీక్ష్ణునకు అగస్త్యులవారికి జరిగిన సంవాద మున తులసి మహిమ వర్ణింపబడియున్నది.

1. శృణు వక్ష్యామి మాహాత్మ్యం శ్రీ తులస్యాః ప్రయత్నతః।
పూర్వముగ్రం తపః కృత్వావరం వవ్రేమనస్వినీ॥

పూర్వకాలమున శ్రీ తులసి కఠోర తపము గావించి వరము పొందెను. ఆ కారణమున సర్వలోక పావనియగు శ్రీ తులసి విష్ణువునకు అత్యంత ప్రియురాలుగా యున్నది, ఆ విధముగా సమస్త పుష్ప పత్రములలో ప్రియతమమైనదయ్యెను.

ఏ వ్యక్తి ప్రత్యహము తులసీ పత్రములతో విష్ణువు నర్చించునో, వాడు పునరావృత్తి రహిత శాశ్విత బ్రహ్మలోకమున వసించును. పద్మము పుష్పములలో శ్రేష్ఠమని చెప్పబడియున్నది. కాని పద్మము కంటెను తులసి లక్షకోట్ల మడుగులు ఫలము నొసగును, విష్ణు మంత్రోచ్చారణ పూర్వకముగా విష్ణు మస్తకమున తులసి నర్పించిన ననంత ఫలప్రదము.

2. సాలగ్రామ శిలాయాశ్చ గంగాయాశ్చ తపోధన।
తులాస్యాశ్చైవ మాహాత్మ్యం నేష్టైర్వక్తుంహి విశ్వసృక్॥

3. భవభంజనమే తత్తే సర్వాభీష్టం ప్రయచ్ఛతి।
నాతః పరతరం కించిత్ పావనం విద్యతే భువి॥

ఓ తపోధనుడా! సాలగ్రామశిల యొక్కయు, గంగయొక్కయు, తులసి యొక్కయు మహాత్మ్యము వర్ణింప బ్రహ్మయును సమర్థుడుకాడు. భవభయ హారిణి యగు తులసి నీ సర్వాభీష్టముల నొసగును. తులసి కంటె పవిత్రమైనది జగత్తున మతేదియులేదు.

4. సంఘృష్య తులసీ కాష్ఠం యో దద్యాద్రామ మూర్ధని।
కర్పూరాగరు కస్తూరీ చందనం చన తత్సమమ్॥

5. తులసీ విపినస్యాపి సమస్తాత్ పావనం స్థలమ్।
క్రోశమాత్రం భవత్యేవ గాంగేయస్యేవ పాథసః॥

6. తులస్యా రోపితా సిక్తాదృష్టాస్పృష్టాచ పావయేత్।
ఆరాధితా ప్రయత్నేన సర్వ కామ ఫలప్రదా॥

తులసి కఱ్ఱతో దీసిన గంధ మేవ్యక్తి శ్రీరామచంద్ర ప్రభువు మస్తకమున నుంచునో, కర్పూరము, చందనము నొసగినను దానికి సాటిరావు. తులసివనము నలుగడల ఒక క్రోసుదూరము వరకు గల స్థలము గంగాజలమువలె పవిత్రమైనది. తులసిని నాటినను, చెట్టుకు నీరు పోసినను, చూచినను, తాకినను పవిత్రముచేయును. శ్రద్ధతో నారాధించినచో సర్వ కామముల సిద్ధింపజేయును.

7. అనన్య దర్శనాత్ ప్రాతర్యేపశ్యంతి తపోధన।
అహోరాత్ర కృతం పాపం తత్క్షణాత్ ప్రదహంతితే॥

8. తులసీ సన్నిధౌ ప్రాణాన్ యేత్యజంతి మునీశ్వర।
నతేషాం నరక క్లేశం ప్రయాంతి పరమం పదమ్॥

ఎవరు ప్రొద్దున లేవగానే మఱియెవరిని చూడక తులసిని దర్శించెదరో వారికి రాత్రి పగలు చేసినపాపము క్షయించును. మునీస్వరా! తులసి సన్నిధిలో ప్రాణములు విడిచిన వారికి నరకయాతనలు లేవు. వారు పరమపదమున కేగెదరు.

9. విధేయ మవిధేయం వాన్యాన మప్యధవాధికం।
తులసీదళ మాదాయ రామం ధ్యాత్వా సమర్పయేత్॥

విధివంతముగాగాని. అవిధిగాగాని. లొచ్చుగాగాని. హెచ్చుగాగాని తులసిదళము లను గొని శ్రీరామ ప్రభువును ధ్యానించి సమర్పింపవలయును.

10. కృతం సఫలతామేతి తులసీ సన్నిధౌ మునే।
తదేవ పుణ్యకాలేషు సహస్ర గుణితం భవేత్॥

ఓ మునివరా! తులసీ సన్నిధిలో నెవడేది అనుష్ఠించినను వది సఫలమగును. పుణ్యకాలమున పుణ్యము చేసెనా యది వేయిమడుగులగును.

## స్కాందపురాణము - నాగరఖండము నుంచి :

వాల్మీకి :-

1. తులసీ రోపితాయేన గృహస్థేన మహాఫలా।
గృహే తస్యన దారిద్ర్యం జాయతే నాత్ర సంశయః॥

ఏ గృహస్థుని గృహమున తులసి పెంచబడునో ఆ గృహమున దారిద్ర్య ముండదు. ఇందు సందేహములేదు.

2. తులస్యా దర్శనాదేవ పాపరాశిర్న వర్తతే।
శ్రీయేఽమృత కణోత్పన్నా తులసీ హరివల్లభా॥

3. పిబంత్యా రుచిరం పానం ప్రాణినాం పాపహారిణీ।
యస్యాయూపేవసే ల్లక్ష్మీః స్కంధే సాగర సంభవా॥

4. పత్రేషు నితతంశ్రీశ్చ శాఖాసు కమలా స్వయమ్।
ఇందిరా పుష్పగా నిత్యం ఫలే క్షీరాబ్ధి సంభవా॥

తులసిని దర్శించినమాత్రనే పాపరాశి నశించును. తులసి శ్రీ వృద్ధి కారణము. తులసి యమృతపుబొట్టువలన బుట్టినది. ఇందువలన హరివల్లభ యయినది. తులసి మొదట శుద్ధోదకముచే నభిషేకించిన ప్రాణుల పాపమును హరించును. ఆ తులసి రూపమున - లక్ష్మి, స్కంధమున - సాగరసంభవ, పత్రముల - సతతశ్రీ, శాఖల యందు - స్వయము కమల, పుష్పముల - నిత్యముగ నిందిర, ఫలములందు - క్షీరాబ్ధిసంభవ.

5. తులసీ శుష్క కాష్ఠేషు యా రూపా విశ్వరూపిణీ।
మజ్జాయాం పద్మవాసా చత్వ వాసు చ హరిప్రియా॥

ఎండిన కట్టెయందు విశ్వరూపిణియు, మజ్జయందు పద్మవాసయు, తాటయందు హరిప్రియయు వాసము చేయును.

సర్వకామముల నిచ్చునదియు, అనిష్టముల బోగొట్టునదియునగు శ్రీ తులసి నెవ్వడు ప్రత్యహము నీటిచే సేచనము చేయునో వాడు యమాలయమునకు బోడు. చాతుర్మాసమున విశేషించి వందన మాచరించిన విముక్తి నొసగును. వారి వేల వేల పాపములు విరిగిపోవును. ముఖ్యముగా పాలతో తులసిని నభిషేకించిన ఈ మాసముల నధిక ఫలప్రదములు.

(సంక్షిప్తము చేయబడినది. చర్వితచర్వ్య మగునను భయముతో)

యత్రైవ తులసీ వృక్ష స్తిష్ఠతి ద్విజ సత్తమ।
తత్రైవ త్రిదశాః సర్వే బ్రహ్మ విష్ణు శివాదయః॥ పద్మపురాణం-

ఓ ద్విజసత్తమా! యే తావున తులసీ వృక్షముండునో ఆ తావున బ్రహ్మ, విష్ణువు, శివుడు మున్నగు దేవతాగణములు వాసము చేయును. తులసిపత్రము నడుమ కేశవుడు, అగ్రమున బ్రహ్మ, పత్రముయొక్క కాడన శివుడు సర్వదా వశించి యుందురు. లక్ష్మి, సరస్వతి, గాయత్రి, శచి, యితర దేవపత్నులు తులసీ పుష్పము లందు వాసము చేయుదురు. ఇంద్రుడు, అగ్ని, యముడు, నిఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు శాఖలయందుందురు.

(30 పేజీనుండి 39 పేజీవరకు దాసుశేషులవారి శ్రీతులసీ మహిమామృతమునుంచి)

గ్రీకు చర్చిలయందు తులసిని ఆచారముగా పూజకుపయోగించుట యున్నట్లు తెలియుచున్నది. ప్రతి సంవత్సరము సెయింట్ బాసిల్‌గారి జన్మదినాన కుటుంబము నకు అనుకోని అదృష్టాలు క్రొత్తసంవత్సరములో కలిసి రావాలని చర్చిలయందు ఇవ్వబడిన తులసిని గృహములలో చల్లుకొనుట యున్నది. ఇక్కడ తులసిని గౌరవిం చుటకు ప్రతీకగా 'తులసిదినము' (Tulasi day) అని ఆచరించుట వాడుకలోయున్నది.

జపాను దేశమున ప్రతి ఇంటియందు తులసి పెంచు ఆచారమున్నదనియు. గృహవైద్యముగా తులసిని యుపయోగింతురనియు తెలియుచున్నది. అలాగే ఆస్ట్రేలియా, చైనా యందుకూడ తులసిని అనేకరకములుగా ఆరోగ్య రక్షణకు వాడుకలోయున్నది.

అస్థిజన్యకిలాసస్య - తనూజన్య చయత్త్వచః
దృశ్యా తస్య బ్రహ్మణా - యక్షశ్వావ మపీన శత్
నరూపకృత్త్వమౌషదే - పావరూప మిదం కృధి।
శ్యామాన రూపకరణి - పృథివ్యామ త్యద్భుతా॥
యిదం శుప్రసాధ్యాయా పునః రూపాణి కల్పయామ్.

అవి ప్రాచీన భారతీయ వైద్య రహస్యాలకు నిధియైన అథర్వణ వేదము తులసీ మహిమను వేనోళ్ళ పొగడినది.

చర్మమందు, మాంసమందు, ఎముకలందు జనించు మహారోగములను, శ్వేత తులసిని ఉపయోగించి నివారించవచ్చును. కృష్ణతులసి ఉపయోగమువల్ల శ్వేతకుష్ఠ - బొల్లిచే వికృతమైన శరీరము (Leucoderma) మరల సహజ శోభను పొందును. అందుచే కృష్ణతులసిని 'అమృతా' అని కీర్తించినారు అని చెప్పుచున్నది.

శ్రీ బ్రహ్మవైవర్త పురాణం - గణపతి ఖండమునుంచి : నారాయణుడు నారదునకు వివరిస్తాడు -

ఒకమారు పరశురాముడు గణపతిని వివిధ నైవేద్యాలతో, దూప దీప గంధా లతో, తులసి మొదలైన పుష్పాలతో, భక్తితో పూజిస్తాడు. యీ విషయం నారదులవారి

కంటబడి, సర్వపుష్పాలలో మాననీయమైనది, ధన్యమైనది, మనోహరమైనది అయిన తులసిని ఎందుకు గణపతికి నివేదించలేదు అని ప్రశ్నిస్తాడు.

అందుకు నారాయణుడు వివరిస్తూ - నాయనా నారదా యీ విషయము చాల నిగూఢమైనది, ఇది బ్రహ్మకల్పంలోని వృత్తాంతము. అయినా చాల మనోహరమైనది. విను "ఒకప్పుడు వికసించిన నవయౌవనంతో తులసి తీర్థయాత్రలు చేస్తూ, గంగా తీరంలో నారాయణ భక్తితో తపస్సుచేస్తూయున్న యౌవనంలోయున్న గణేశుని చూచి - మోహించి అతనిని కొంత అల్లరిపెట్టింది. గాని అతను తపస్సులోనే యున్నాడు. ఆమెకు కామము ఎక్కువయి తపోనిమగ్నుడయిన గణేశుని శిరస్సుమీద కాసిని నీళ్ళు చల్లి చూపుడువేలుతో పొడిచి మాట్లాడించింది. అప్పుడు గణేశునికి ధ్యానం చెదరి స్పృహవచ్చింది. ఎదుట నవ్వుచున్న కామినినిచూచినాడు. బాధపడ్డాడు, గాని కోపగించక శాంతముగా ఆమె వివరాలు అడిగినాడు. ఆమె "నేను ధర్మని కుమారుని పుత్రికను. తపస్వినిని. కాని నా తపస్సు భర్తకొరకే. గాన నీవు అందగాడివి. నా మనస్సుకు నచ్చినవాడవు గాన నాకు భర్తవుకా" అన్నది.

తులసి మాటవిని గణేశుడు తల్లీ నేను వివాహము చేసుకోను. నీవు ఇతరులను వెదకికొనుము అని పలువిధములుగా నచ్చచెప్పినాడు. అందుకు తులసి కోపగించి "గణేశ్వరా నీ భార్య సాధ్వికాకుండాపోతుంది - సంశయంలేదు" అని శపించింది.

అందుకు శివాత్మజుడు ఆమెను "దేవీ నీవు అసురగ్రస్తురాలవు అవుతావు, సంశయంలేదు. ఆ తరువాత గొప్పవారి శాపంవల్ల నీవు మొక్కవై పోతావు" అని శపించాడు,

ఆ శాపం విని తులసి చాలాకాలము రోధిస్తూ గడిపి తర్వాత గణేశుని స్తుతించింది. అంత గణేశుడు ప్రసన్నుడై ఆమెతో "నీవు పుష్పాలలో సారభూతురాలవు అవుతావు. ఒక కళాంశంతో స్వయంగా నారాయణు ప్రియవు అవుతావు, నీవు సర్వదేవతలకూ, విశేషించి శ్రీకృష్ణునికి ఇష్టురాలవు. నరులకు నీ పూజ విముక్తినిస్తుంది. ఎప్పుడూ నేను ఉపయోగించవలసినదానవు" అని తపస్సుకు వెళ్ళాడు. అంత తులసిదేవి హృదయభారంతో వెళ్ళిపోయింది.

తర్వాత ఘోరతపస్సు అనేక సంవత్సరాలు గావించి గణేశుని శాపంవల్ల ఆమె చాలకాలము శంఖచూడుని ప్రియగా ఉన్నది. తర్వాత ఆ నారాయణ ప్రియ ఒక కళాంశంతో మొక్క అయింది. యీ విషయము నేను ధర్ముని నోట విన్నాను" అని ముగించినాడు. దీనితో తులసితో గణేశుని ఎందుకు పూజించకూడదు అనునది విదితమయినది.

(శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారి శ్రీ బ్రహ్మవైవర్తపురాణం - గణపతి ఖండంనుంచి)

తులసీదళంతో మహాదేవుని పూజించినయెడల పితృదేవతలు సంతోషింతురని బృహద్ధర్మ పురాణంలో చెప్పబడియున్నది.

దృష్టా స్పృష్టా తథా ధ్యాతా కార్తికే నమితార్చితా।
రోపితా సేవితా నిత్యం పాపహంతి యుగార్చితామ్॥

కార్తీకమాసంలో రోజూ తులసిని చూచినా, తాకినా, తలచినా, పూజించినా, నాటినా ఒకయుగంలో పోగైన పాపమంతా నిర్మూలన మౌతుంది.

"యత్ ధర్మ కర్మకురుతే మనుజః పృథివ్యామ్
నారాయణప్రియా తమాం తులసీ వినాచ,
తత్సర్వమపి విఫలం భవతి... ...."

మానవుడు నిర్వర్తించవలసిన ఏ ధర్మకార్యములోగాని తులసిని వినియోగింపబడనియెడల ఆ కార్యము విఫలమవుతుంది అని చెప్పబడియున్నది.

తులసిని చేతనుంచుకొని ప్రమాణంచేసిన, ఏ వ్యక్తిగాని తనమాట నిలబెట్టుకొననియెడల శాశ్వతముగ నరకములో పడియుండును.

తులసి కలసిన నీటితో స్నానమాచరించినచో అన్నిపవిత్రమైన తీర్థములలోనూ స్నానమాచరించిన కలుగు సకలపుణ్యములు ప్రాప్తమగును.

కార్తీక మాసములో ఒక్క తులసి పత్రమును దానముచేసిన వేయి గోవులను దానము చేయుటతో సమానం.

మనం దేవాలయంలో పూజలోనూ, ఇంకా పవిత్రమైన సన్నివేశాలలోను తులసిని యుపయోగించడం హిందూ ధర్మములలో ముఖ్యమైనదిగా మనం చూస్తూవుంటాము. ప్రత్యేకించి నైవేద్యం ఇచ్చేటప్పుడు ప్రసాదంపై తులసినివుంచి నివేదన చేస్తాం. అంటే తులసివల్ల ప్రసాదం పవిత్రతత పొందుతుందన్నమాట.

తులసి మొక్కయొక్క విశేష లక్షణములు కొన్ని ఇక్కడ గమనిద్దాము. ఇందులో మొదటిది తులసిమొక్కను తాకుటవలన, తులసిని చేతిలోవుంచుకొని మంత్రజపం చేయుటవలన, తులసీదళములు శిరముపై వుంచుకొని ఉపాసన చేయుట వలనా శారీరక, మానసిక, ఆధ్యాత్మిక పాపములు దహించివేయబడును.

రూపణా త్పాలనాత్సే కాద్దర్శనా త్స్పర్శనాన్నృణామ్।
తులసీ దహ్యతే పాపం వాఙ్మనః కాయ సంచితమ్॥

తులసీ స్థాపనమువలనను, తడుపుటవలనను, తాకుటవలనను, పెంచుట వలనను వాక్కు, మనస్సు శరీరములచేత చేయబడిన పాపములు దహింపబడును.

తులసిమొక్క దర్శనం, శరీరముతో దాని సాంగత్యము చేయుటవలన గంగా నది స్నానమువలె పవిత్రముచేయును.

ముత్తయిదువులు తులసిని కొలువవచ్చును. పోషింపవచ్చును, సేవింపవచ్చును, పూజింపవచ్చును. తులసిమొక్క మూలముననున్న నీరు శిరస్సున జల్లుకొనవచ్చును.

యతులు, పూర్వసువాసినులు తులసిమొక్క మూలముననున్న మృత్తిక (మట్టిని) ముఖమున రాచుకుని స్నానమాచరించుట శ్రేయస్కరము.

యోగోపి చందనాభావే తులసీమూల మృత్తికామ్।
ముముక్షుర్ధారయేన్నిత్య మపరోక్షాత్మ సిద్ధయే॥ (వాసుదేవోపనిషత్తు)

గోపీచందన మభావమైనప్పుడు తులసి మృత్తికతో ముముక్షువు ప్రత్యక్షాత్మ సిద్ధికొఱకు ఊర్ధ్వ పుండ్రముగా ధరింపవలయును.

తులసిని ఉదయకాలమునందే పూజించవలయును. రాత్రికాలమున స్పృశింప రాదు. దళములు కోయరాదు.

"మంత్రశాస్త్రరీత్యా - ఆయుర్వేదశాస్త్రరీత్యా ముఖ్యమైన ఎనిమిది రకాల వృక్షము "అష్టబిల్వములు" లలో తులసి ముఖ్యమైనదిగా చెప్పబడియున్నది.

తులసీ బిల్వ నిర్గుండీ అపామార్గ కపిత్థకాః।
శమీ చామలకం దూర్వా అష్టబిల్వాప్రకీర్తితా॥

తులసి, బిల్వము, వావిలి, ఉత్తరేణి, వెలగ, జమ్మి, ఉసిరిక, గరిక అనునవి ఎనిమిది బిల్వములుగా ప్రసిద్ధినందినవి.

మారేడుదళములు ఎక్కువ ప్రాధాన్యతలోనికి వచ్చిననూ ఈ శ్లోకమున తులసియే ప్రప్రథమమున పేర్కొనబడినది.

ఈ ఎనిమిది దివ్యవృక్షములు, ఆయుర్వేదమున అత్యంత ప్రాధాన్యత కలిగి యున్నవి అని మనము తెలుసుకొనవలయును. అంతేగాక అపామార్గ = ఉత్తరేణి, శమీ = జమ్మి, దూర్వ = గరిక, తులసియున్నూ మంత్రశాస్త్రములో రహస్య ప్రాధాన్యత కలిగివున్నవి. అనగా చేతబడులు, దుష్టప్రయోగాదులు, గాలి సంబంధమైన చెడు గ్రహాలు రాకుండా చేసే మంత్రప్రక్రియలు, యాగ, హోమ కర్మలయందు వీటి ఉపయోగము చాలకలదు." (శుభవార్త - ఏప్రిల్ 89 నుంచి)

**తులసి మొక్కను ఎక్కడ, ఎలా నాటవలెను? ఎక్కడ నాటకూడదు :-**

నదీతీరే శ్మశానేచ ఊషరేమ్లేచ్ఛ సన్నిధౌ।
ఏభువై రోపణం కృత్వాయాతి కర్తాయ మాలయమ్॥

నదీతీరమున, శ్మశానమున, చవిటినేలయందు, మ్లేచ్ఛ సన్నిధిని, తులసి మొక్కలను వేసిన కర్త యమలోకమునకుబోవును. అనగా ఈ స్థలములందు తులసి మొక్కలు నాటరాదు.

ఒక మొక్కను గృహమున కీశాన్యమూలను నాటుట. ముఖ్యము అనగా నాటి తీరవలయును. తులసి కాననమును పవిత్ర స్థానమున మౌనమూని నాటుటవిధి.

గృహస్యేశాన్య పురతః ఖనిత్వా తాల మాత్రకమ్।
పంచగవ్య మయూరాండం క్షిప్త్వా తత్రది నాగమే॥
రోపయిత్వానిశాభాగే సూత్రే నావేష్ట్య సప్తధా।
తన్మూలే ఏండికాం కృత్వా హస్త మాత్ర సువర్తులామ్॥

గృహమున కీశాన్యమూల నొక తాల ప్రమాణమనగా చాపబడిన బొటనవ్రేలి, నడిమివ్రేలి నడిమికొలత త్రవ్వి పంచగవ్యమును (గోమూత్రము, గోమయం, గోక్షీరం, గోదధి, గోఘృతం. వీటిలో ఆవుపాలు ఒకఫలం, ఆవుమూత్రం ఒక ఫలం, ఆవునెయ్యి ఒకఫలం, ఆవుపేడ మూడుతులాలు. ఆవుపెరుగు ప్రసృత పరిమాణం - రెండు ఫలాలు గ్రహించవలెను. మరిన్నీ బంగారపు రంగుగల ఆవు పాలు, తెల్లని ఆవుపేడ, ఎర్రని ఆవుమూత్రము, నీలివర్ణపు ఆవునెయ్యి, నల్లని ఆవు పెరుగు గ్రహించిన సర్వశ్రేష్ఠముగా నుండునని శాస్త్రము తెలుపుచున్నది) మయూ రాండమును (నెమిలి గ్రుడ్డు) జల్లి, పగటివేళ (పున్నమిదినాలు మంచిది) నాటి, రాత్రి వేళ దారముతో నేడుచుట్లుచుట్టి దాని మొదట నొక హస్త ప్రమాణము గుండ్రముగా పాదుచేసి దానిమీద జతుష్కోణ వేదికను నిర్మించవలెను. బుద్ధిమంతుడగువాడు నీరు ధారగాపోసి గంధ పుష్ప ధూప దీప ఘృత పాయస దధ్యన్నాదులతో పూజచేసి, యైశ్వ ర్యకాముడు 'తులస్యైనమః' అను మంత్రముతో నర్ఘ్య ప్రదానమీయవలెను. శంఖ మందలి జలము, దూర్వలు, అక్షతలు, చందనము కుశాగ్రములు పుష్పాదులతో నర్ఘ్య మీయవలెను.

ఇంతటి మాహాత్మ్యముగల తులసి యందలి రకములు - వాటి గుణములను గూర్చి వీలయినంత పరిశీలింతము.



# రెండవ అధ్యాయము

# తులసి రకములు - గుణములు

తులసియందు గ్రామ్య - అరణ్య భేదములచే రెండు విధములు. ఇందలి గ్రామ్యము తిరిగి దీర్ఘ హ్రస్వ భేదముచే రెండువిధములుగా నుండును. అందు దీర్ఘముగానుండు వానిలో కృష్ణతులసి, శుక్లతులసి, గంధతులసియను భేదములు గలవు. వీనిలో కృష్ణతులసి విష్ణుతులసి యనియు - శుక్లతులసి శివతులసి, రామతులసి యనియు గంధతులసి బిల్వగంధతులసి యనియు, విశ్వగంధతులసి యనియు, విశ్వతులసి యనియు వ్యవహరించ బడుచున్నది. ఇందలి రుద్రజట(డ) యని యాంధ్రమున పిలువబడుచున్నది. హ్రస్వముగా నుండువానిలో మరువకము అనునది ప్రధానమైనది. ఇది శ్వేతకృష్ణ భేదముచే రెండువిధములుగా నుండును. ఇదియే పూల యంగళ్లలో మరువమను పేరుతో దొరకునట్టి గంధద్రవ్యము. అరణ్యతులసి వర్వరియను నామముతో వ్యవహరించబడుచున్నది. ఇదియూ దీర్ఘ హ్రస్వ భేదములచే రెండువిధములుగా యుండును. అందలి హ్రస్వవర్వరి కృష్ణశ్వేత భేదములచే తిరిగి రెండు విధములుగా నుండును, ఈ అరణ్యతులసియే భూతులసి లేక భూతతులసియని వ్యవహరింపబడుచున్నది. ఇట్లు తులసి యందనేక భేదములు కనుపించుచున్నవి. కాని మనకు ఇందలి కృష్ణ, శ్వేత తులసులును, రుద్రజడయు, మరువమును, భూతులసియు విశేషముగా లభించును. వీనిలో కృష్ణతులసి, శ్వేతతులసియు ప్రతి గ్రామమందలి దేవాలయము లందును, ఇండ్లయందును పెంచబడుచున్నవి.

శుక్లతులసి యందలి భేదములైన బుబాయి, మ్యూత్రల, బాలంగా, రామ, కర్పూర, వన, శౌంతి అను ఏడు ఉపజాతులను గురించి కొంత పరిశీలింతము.

1. బుబాయి : ఈ రకము తులసిమొక్కలకు సుంగంధయుక్తమైన పెద్దపెద్ద ఆకులుండును. పెద్ద పుష్పగుచ్ఛములుగల దీనిని 'వయయా' అనికూడ అందురు. ముస్లిములు ఎక్కువగా దీనిని వాడుదురు. ధర్మకార్యాలకు, శవాలంకరణకుకూడ దీనిని వాడుదురు. దీని కొమ్మను ఇంటిలో వ్రేలాడగట్టిన ఈగలు, దోమలు మొదలగు కీటకములు చేరవు. దీనికాండము ఎండినకొలది వాసన ఎక్కువగును.

---

విందు మనస్సుతో, ఆర్ద్రభావముతో భక్తుడు పిలిచినచో భగవంతుడు రాకమానడు

2. మూత్రల : అను తులసిఆకులు 'దవనము' ఆకులవలె యుండును. అస్సాము బర్మాలలోని కొన్ని ప్రదేశములలో మాత్రమే ఇది పెరుగును. దీని ఆకులలో ఘాటు తక్కువ. దీని ఆకురసము సర్వ మూత్రదోషాలను హరించును. గనుకనే దీనికి ఈపేరు వచ్చినది.

3. బాలంగా : ఇది మామూలు శుక్ల తులసిమాదిరిగానే యుండును. కాని మొక్క కొంచెము పొట్టి. దీనికి త్రికోణాకారపు విత్తులుండును. ఇవి రక్తశుద్ధిని చేయును. మెక్సికో, కాలిఫోర్నియాలనుండి ఈ మొక్కలు మనకు దిగుమతి అయినవని భావింపబడుచున్నవి.

4. రామతులసి : పెద్ద ఆకులతో అరు అంగుళములవరకు పెరుగుతుంది. దీని వాసన ఘాటుగాయుండును. ఇది క్రిములను నాశనముచేయును. మంచి జీర్ణకారి. భోజనానంతరం రామతులసి నోటవేసి నమలిన అది తాంబూలము చేసినంత పనిచేయును. దీని విత్తనములు సువాసనగా, తెల్లగాఉండును. సమశీతోష్ణ ప్రదేశములలో, పశ్చిమ ఆసియాలోను, మన దేశములోని అన్ని ప్రాంతాలలోను ఈ రామతులసి పెరుగును. చూర్ణము తయారీలో దీని కాండము బాగుగా ఉపయోగపడును

5. కర్పూరతులసి : **Ocimum Kilimandscharicum**

**Camphor Basil**



OCIMUM KILIMANDSCHARICUM

ఇది పేరుకు తగ్గట్టుగా కర్పూరపు వాసనతోనే యుండును. ఇది తూర్పు ఆఫ్రికాలోనిది. ఇటీవల కర్పూరము దీనినుండి తీయుటచేత ఇది ఎక్కువ ప్రాముఖ్యత వహించినది. దీనిని కాశ్మీర్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాలు, మహారాష్ట్ర మైసూరు, తమిళనాడు, కేరళ, పరగణాలలో సాగుచేయుదురు.

దీని ఆకులరసమును చెవినొప్పులు, వాతదోషములు నివారణకు, ఉదరకోశ వ్యాధులకు ఉపయోగింతురు. దీనితో తయారైన కర్పూరమును చర్మరోగముల నివారణకుగాను కొన్ని మందులలో కలుపుటకలదు.

**6. వన తులసి :** అడవులలో పెరుగును. ఇది పెద్దగా ఎదగదు. దీని ఆకులు కత్తులవలె పదునుగా మధురమయిన వాసనతో యుండును. తెల్లని పూలు గుత్తులుగా వెలువడును. విత్తనాలు గులాబిరంగులో మెఱయుచుండును. ఇది జ్వరములను తగ్గించును. బెంగాల్, బీహార్, అస్సాం, మధ్యప్రదేశ్, సింహళములోని కొన్ని ప్రదేశాల్లో విరివిగా పెరుగును.

**7. శొంఠి తులసి :** ఇది చలికాలము ముగియునప్పుడు పుష్పించును. ఆకులు అల్లము, శొంఠి కలగలిపిన వాసన వచ్చుచుండును. దీని ఆకులు ఘాటుగా యుండి క్రిములను నాశనముచేసి వాతావరణమును శుభ్రముచేయును.

తులసియందు రెండవరకమైన కృష్ణతులసి యందలి అన్నిభాగములు నల్లగా ఉండును. మన దేశములో అన్ని వాతావరణములలోను ఇది పెరుగును. ఇది మలేరియా క్రిములను నాశనముచేయును, దీని ఆకులలో నలుపు, ఆకుపచ్చ కలిసిన రంగుగల నూనె అంశముండును. ఆ నూనెను కొన్నిరోజులపాటు అట్లేయుంచిన గడ్డకట్టును. దీనిని శ్వాసకోశపు రోగాలలోను (Asthma etc.), చర్మరోగాలయందు గాయాలకు ఉపయోగింతురు. అందుకే ఎక్కడపడితే అక్కడ కనుపించు ఈ తులసిని బీదలపాలిటి సంజీవనిగా వర్ణింతురు.

తులసియందలి యెనిమిది రకములలో కృష్ణతులసి శ్రేష్ఠమైనదిగా వర్ణింపబడి యున్నది. ఈ వివిధ జాతుల రస, గుణ, వీర్య, విపాకములు ఈ క్రిందివిధముగా వివరింపబడియున్నవి.

## 1. కృష్ణతులసి : Ocimum Sanctum Sacred Basil, Holy Basil

సంస్కృత : అజక, బృంద, మంజరి, వర్ణశ పత్ర పుష్ప, సుదీస తులసి



OCIMOM SANCTUM

హిందీ : తులసి, బృంద, ఫాల తులసి

మహారా : తులశ, తులసి, చజద

తెలుగు : తులసి, బృంద, కృష్ణ తులసి, నల్లతులసి

కన్నడ : విష్ణుతులసి, కరితులసి శ్రీతులసి

గుణ : కృష్ణతులసి వాతమును కఫమును [illegible] కాసను, క్రిములను, వాంతిని, భూత వికారములను పోగొట్టును. ఇందు ఈ క్రింది విధముగా పదార్థములుండును

నూనె భాగము : Oil Content = 0.25 %, Phenols = 45.76%
Aldehydes = 15.25%, Eugenol Methyl ether = 20%
Eugenol = 71% Caruacrol = 3% Other substenes = 6%

## 2. రామతులసి : Ocimum Gratissimum : Shrubby Basil

సంస్కృతం : బర్బరీ, తువరీ, అజగంధికా, తుంగీ, ఖరపుష్పా

తెలుగు : కారుతులసి, వనతులసి

హిందీ మరియు బెంగాలి : వన్ తులసి, రాంతులసి, నిమ్మతులసి

గుజ : ఆవిచ్ఛినావచ్ఛి, రాంతులసి, కన్నడ : కగోరలే, కరీయకగోరలే, నిమ్మతులసి,

మల : కాట్టుత్రిటివ్

గుణ : రూక్షము, శీతము, కటువు, విదాహి, తీక్ష్ణము, దీపనము, లఘువుగా జీర్ణమగును. కఫ, వాత, రక్తవికార, కండూ, క్రిమి, విషములను పోగొట్టును. సుగంధ

ముగా నుండును. ముఖ్యముగా నిమ్మవాసనయుండును. శ్వాసకాసలు, జ్వరము పోవును. పార్శ్వశూలను గుణపరచును.

Oils

| DELHI | | | BANGALORE | |
|---|---|---|---|---|
| 1. Citral | = 66.6% | | 1. Eugenol | = 61.8% |
| 2. Geraniol | = 25.7% | | 2. Ocimene | = 15% |
| 3. Citronellol | = 2.8% | | 3. Alcohol | = 10% |
| 4. Geranyl acetate | = 1.5% | | | |
| 5. Sesquiterpenes | = 2.4% | | | |

ఈ వన తులసి మూడు విధములుగా యుండును. వనములందు, అడవులందు ఇది హెచ్చుగా పెరుగును. ఆకులు చిన్నవిగనుండును.

## 3. లక్ష్మీతులసి : **Ocimum Viride**



OCIMUM VIRIDE
FLOWERING BRANCH

దీని ఆకులు సుంగధయుతముగా యుండును. ఆహార పదార్ధములలో సుగంధముకొరకు వాడుట అలవాటుగాయున్నది (పలావు మొదలగు పదార్ధములు). ఆకులు ఆకుపచ్చగాయుండును. రస, గుణ, వీర్య, విపాకములు దాదాపు కృష్ణతులసికి వలెనే యుండును. ఇది 1.8 మీటరువరకూ పెరుగును. ఇది ఆఫ్రికానుంచి మనదేశమునకు తేబడినది. దీని ఆకులను ఉడికించి ఆమవాతము మొదలగు కీళ్ళనొప్పులకు వేసి కట్టుట కలదు. ఆకులను వెన్నతోనూరి గజ్జి మొదలగు చర్మవ్యాధులలో లేపనముగా వాడిన మంచి గుణముండును. దీని ఆకుల కషాయము జ్వరము, దగ్గులందు బాగుగా పని చేయును. కంటికలకయందు ఆకువలిమి 1 - 2 చుక్కలు రసము కంటియందు వేసిన గుణమగును.

4. అడవితులసి : ఆకులు కొంచెము మోటుగామండును. కారము, రూక్ష గుణము, ఉష్ణవీర్యము, కటువిపాకము, కలిగియుండును. కఫవాతములు, క్రిమిరోగములు, జ్వరము, రక్తదోషములు ముఖ్యముగా విషము - వీనిని హరించును. జఠరదీప్తిని పెంపొందించును.

5. భూతులసి : కారము, లఘు, రూక్షగుణములు, ఉష్ణవీర్యము, కటువిపాకము కలిగియుండును. కఫవాతములు, మరద, విషము, క్రిమిదోషము, రక్తస్రావము వీనిని పోగొట్టును. ఇంటిలోని ఈగలను, దోమలను పారద్రోలును. రుచిని కలిగించును. ఆకలిని ఎక్కువచేయును. స్వరసము 2 తులములు, కషాయము 5 - 6 తులముల వరకు వాడవగును.

## 6. కుక్కతులసి : Hoary Bacil, Ocimum Americanum

సంస్కృత : అజక, గంభీర, కుఠిర   హిందీ : కాలాతులసి, మంతి

తెలుగు : కుక్కతులసి   మళయా : కట్టుతులసి

ఇందు Citral = 60%, Linalool, Methyl heptenone, Geraniol, Citronellol, Methyl Cinnamate, Eugenol etc., are present.




దీనిని పవిత్రముగా చూడకపోయినను గుణమున ఇంచుమించుగా ఇతర తులసిలతో సమానముగానే యుండును. ఇది సాధారణముగా అడవులలో, పొలములలో, రోడ్ల కిరుప్రక్కల కనిపించుచుండును. దీని ఆకులను తేయాకు బదులుగా ఉపయోగించిన 'టీ' వలెనేయుండును. జ్వరములందు చమటవచ్చి చలువలు వచ్చినపుడు అరచేతులకు, అరికాళ్ళకు రుద్దిన మంచిఫలితము లభించును. ఆకును ముద్దగానూరి పూసిన ఉష్ణము కలుగును. చర్మవ్యాధులకు పైపూతగా నుపయోగింతురు.

## 7. మరువకతులసి : **Ocimum Basilicum, Sweet Basil, Common Basil**

సంస్కృత : ముంజరికి, సురస, వార్వర   హిందీ : భుబాయితులసి, గులాల్ తులసి, కాలితులసి, మరువ   మరాఠి : మరువ, సబ్జ   గుజరా : డామ్‌రో, నసిబి, సబ్జ   తెలుగు : భూతులసి   కన్నడ : కామకస్తూరి, సజ్జగిడ



[illegible] [illegible] చేరినది. దీని ఆకులు పొడవుగ నుండును. సుగంధముకలవి. దీనికి [illegible] [illegible] [illegible]లుదేరును. దీని సర్వాంగమును సుగంధయుక్తముగ నుండును. [illegible] [illegible]ము అని అమ్ము చిన్నమొక్కలకు దీనికి చాలా భేదము గలదు. [illegible] [illegible] కామకస్తూరి అను పేరు వాడుకలోయున్నది.

గుణములు : కారము, తిక్తము, లఘు, రూక్షగుణములు, ఉష్ణవీర్యము, కటువిపాకము కలది. రక్తదోషము, జంతువిషము, దురద, కుష్టము, విషమజ్వరము, చర్మరోగములు, శ్వాసకాస, పైత్య, భ్రమ, తాపము, దాహము, హృద్రోగములు వీనిని పోగొట్టును.

8. రుద్రజడతులసి : దీని సర్వాంగములును సుగంధయుతములై యుండును. చేదుగను, కాలముగను యుండును. సెగరోగము, మూత్రకృచ్ఛ్రము, నిక్కాకు కండ్లమంటలు, మూత్రబంధములను పోగొట్టును. మేహశాంతి, వీర్యవృద్ధి, వీర్య స్తంభనముచేయును, కర్ణరోగములు, తలనొప్పి, తేలుకాటుకు, కడుపులోని మంటలను పోగొట్టును. స్త్రీల గర్భాశయ రోగములను హరించి సంతానవతులను చేయును.

తులసియందు అనేకరకములున్ననూ, ముఖ్యముగా విష్ణుతులసి, రామతులసి, తెల్లతులసి అని ఒకరకము. శ్యామతులసి, కృష్ణతులసి, నల్లతులసి అని రెండవరకము ఇవి మాత్రమే ప్రజలందరికి అందుబాటులో పూజార్హముగా ప్రతి ఇంటియందు ఉన్నవి.

కృష్ణతులసియందు ఔషధోపగుణములు కొద్ది ఎక్కువగాయున్నవి. గాన ప్రత్యేకముగా చెప్పినతప్ప తులసి అన్న ప్రతివిషయమున కృష్ణతులసినే అనగా నల్లతులసినే ఉపయోగించుట మంచిది. అడవితులసి పై రెండింటికన్నా ఘాటుగాయుండి మంచి విషహారముగాయున్నది. దీనిని ముఖ్యముగా బొల్లి, విషము, గర్భాశయ రోగాల నివారణిగా ఉపయోగించవలెను.

ఆయుర్వేద గ్రంథములందు తులసిని గురించి చెప్పబడిన విషయములను పరిశీలింతము :

శ్లో॥ తులసీ సురసా గ్రామ్యా సులభా బహుమంజరీ<br>
అపేత రాక్షసీ గౌరీ శూలఘ్నీ దేవదుందుభిః॥<br>
తులసీ కటుకాతిక్తా హృద్యోష్ణా దాహ పిత్తకృత్<br>
దీపనీకుష్ఠ కృచ్ఛ్రాస్ర పార్శ్వ రుక్క ఫవాతజిత్॥<br>
శుక్లా కృష్ణాచ తులసీగుణైస్తుల్యాప్రకీర్తితా (భావప్రకాశము)




**Ocimum gratissimum** L. எலுமிச்சந்துளசி 1 twig; 2 flower; 3 calyx, 4 corolla, split open; 5 & 6 anthers (1-celled); 7 pistil; 8 & 9 ovary, l.s. & t.s. (RHT 25930)

తులసి, సురసా, గ్రామ్యా, సులభా, బహుమంజరీ, అపేత రాక్షసీ, గౌరీ, శూలఘ్ని, దేవదుందుభి. ఇంతేగాక వైష్ణవీ, వృందా, సుగంధా, గంధహారిణీ, అమృతా, పత్రపుష్ప, పవిత్రా, సురవల్లరీ, సుభగా, తీవ్రా. పావనీ, విష్ణువల్లభా, సురేజ్యా, కాయస్థా, సురదుందుభీ, సురభి, బహుపత్రి, హరిప్రియా, భూతఘ్ని, పుణ్యా, సురవల్లీ, విష్ణుపత్ని, పాపఘ్ని, లక్ష్మి, కృష్ణవల్లభా ఇలా అనేక నామములు తులసికి సంస్కృతమున గలవు

పరిచయ పదములు : గ్రామ్యా - గ్రామములయందుండును. బహుమంజరీ - విస్తారమైన జడలుండును. బహుపత్రి - ఆకులు ఎక్కువగాయుండును. పావనీ - పవిత్రమైనది. విష్ణువల్లభా - విష్ణుమూర్తికి ప్రియతమమైనది. శూలఘ్ని - శూలలను పోగొట్టును. సురసా - మంచి రసముకలది. సులభః - పరిమళముగలది. భూతఘ్ని - భూతముల నడంచునది. తులసియున్న ఇంటికి క్షుద్రశక్తులు పనిచేయవని పెద్దలవాక్కు.

తె : తులసి గు : కాలీతులపి, ధోలీతులసి మ : తుళసి పా : రెహాన్

అ : ఉలసీబదరూత్, ఇం : హోలీబేసిల్ Hole Basil, Parple Stalked Basil ల్యా : ఓసియం ఆల్బమ్ Ocimum Album or Ocimam Sanctum అందురు.

Family : Labiataex.

Action : Anti Periodic, Demulcent, Febrifuge. Leafe Juce as a ointment useful for Leprocy Ringworm and other skin diseases also.

గుణము : తులసి కటు తిక్త రసముకలది, హృద్యము, ఉష్ణము, దాహమును, పిత్తమును చేయును. అగ్నిదీపనము, కుష్ఠ, మూత్రకృచ్ఛ్ర, రక్తదోష, పార్శ్వశూల, కఫ, వాతముల బోగొట్టును. తెల్లతులసి, నల్లతులసి మొక్కలు రెండును దాదాపు సమాన గుణముకలవి.

శ్లో॥ తులసీ కటుకాతిక్తా హృద్యోష్ణా దాహ పిత్తజిత్।
దీపనీ కుష్ఠ కృచ్ఛ్రాస్ర పార్శ్వరుక్కఫ వాతజిత్॥
శ్వేతా కృష్ణాచ తులసీ కటుష్ణా చోష్ణాజగుః।
దాహ పిత్తకరీ హృద్యా తువరాహ్యాగ్ని దీపికా॥

తులసి వెన్ను (పూత) కషాయము దీపనకారి.

"As a specefic for diseases of the Kidneos, blodder and Urethra' - Dr. Mure.

"In this symptem if bears a close resemblance to "Chamomilla" its symptoms tally with those of "Cina" in remittent fevers of children, fever during dentition period, diarrhoea and worm effection cough and cold

భూతులసి : వనతులసి

హి-బర్బరీ; ఇం :Ocimum gratissimum or Ocimum Caryophyllatum.

శ్లో॥ బర్బరీ తిత్యం రూక్షం శీతం కటు విదాహిచ।
పిత్తలం కఫ వాతాస్ర దద్రు క్రిమి విషాపహం॥

అగ్నిదీప్తి నిచ్చును, వేడిచేయును. కాని మూలవ్యాధులను (Piles లను) నడంచును. ఆకుకూర కొద్దిగా పైత్యంచేయును. గాని క్రిమిదోషములను పోగొట్టును.

వనతులసి ఆకురసము బూసిన పశువుల పేనుగజ్జి నివారణమగును. దీని మూలముదంచి తీసిన రసము లేపనము చేసిన కుక్కల గజ్జి మటుమాయమగును.

"హిద్మాకాసశ్రమ శ్వాస పార్శ్వరు క్పూతి గంధహా" (బాహాటము)

నల్లతులసి హిద్మ, కాసము, శ్రమ, శ్వాసము, పార్శ్వశూల, దుర్గంధము వీనిని హరింపజేయును.

కృష్ణతులసి రసమును పూటకు 2 నుంచి 3 తులములు, కషాయమును 5 నుంచి 6 తులములవరకు చూర్ణమును ఒక చిన్నమెత్తు వరకూ ఉపయోగించవచ్చును.

హిక్కాకాస విష శ్వాస పార్శ్వ శూల వినాశనః।
పిత్త కృత్ కఫ వాతఘ్న సురసః పూతి గంధనుత్॥ (చరకసంహిత)

ఎక్కిళ్ళు, శ్వాస, కాస, విషదోషము, పార్శ్వ శూలాదులను హరించును. పిత్తమును పెంచును, వాతమును, కఫమును పోగొట్టును.

సామాన్యా తులస్యా గుణాః కటుత్వం, తిక్తత్వం, ఉష్ణత్వం, సురత్వం, (మంచివాసన), శ్లేష్మవాత జంతు భూత, క్రిమి వాంతి నాశిత్వంచ॥

- రాజనిఘంటువు

**G** = GENERATOR : సృష్టికర్త : బ్రహ్మ

**O** = OPERATOR : రక్షణ - పాలనకర్త : విష్ణువు

**D** = DESTROYER : నాశనకర్త : మహేశ్వరుడు

**GOD** = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు



# తులసి సాధారణ ఉపయోగములు

తులసిని ప్రొద్దున పరిగడుపున సేవించుట ఉత్తమము. చిన్నపిల్లలకు 5 నుంచి 7 ఆకులవరకున్నూ, పెద్దలకు 25 నుంచి 100 ఆకులవరకు వాడతగును. ఎండకాలములో తక్కువగాను, చలికాలములో ఎక్కువగను సేవించవలయును. అవసరాన్నిబట్టి రోజూ రెండు - మూడు మార్లుకూడ ఉపయోగించవచ్చును. ఆరోగ్యవంతుడు తన ఆరోగ్యమును నిలుపుకొనుటకు రోజూ ఒక్కమారు తీసుకొనుటచాలును. తులసికి ముఖ్యముగా రెండు మంచి గుణములున్నవి. ఒకటి ఆరోగ్యమును ప్రసాదించును. రెండవది అందమును కలుగజేయును.

చిన్నపిల్లలకు తులసి రసము ఇవ్వవలసి వచ్చిన కొద్దిగా వెచ్చచేసి ఇవ్వవలయును. తులసి విత్తులు వాడదలచిన 2 - 5 గ్రాములవరకు వాడతగును. ఒక్క రోజులో 3 - 4 మార్లు వాడవచ్చును. తేనె కలుపవలసి వచ్చినపుడు ద్రవము చల్లగా ఉంచితీరవలెను. ఎక్కువ వేడి ఉన్నపుడు దానిలోనికిగాని తేనె కలుపకూడదు (వేడి పదార్థములలోనికి పెరుగు కలుపుట కూడదు. అన్నము చల్లబడినతర్వాత పెరుగు వేయవలెను) కుష్ఠు నివారణా వైద్యశాల ఆవరణమునందు తులసి వనమును పెంచి తీరవలెను.

1. ప్రతిదినము పరగడుపున తులసిరసమును మంచినీటితో కలిపి త్రాగుచున్న జ్ఞాపకశక్తి వృద్ధిపొందును. శరీరము దృఢపడును, తేజస్సు పెరుగును, జఠరాగ్ని ఎక్కువగును.

2. [illegible] కాలమున తులసి, నిమ్మపండు, ఉల్లిగడ్డలు, వెల్లుల్లి, మజ్జిగ వీటిని ధారాళముగా ఉపయోగించవలయును.

3. నల్లులు, దోమలు, ఈగలు, [illegible] (కాక్రోచ్) మొదలగువాటిని నిర్మూలించుటకు ఫినాయిల్, టిక్ 20 మొదలగువాటికి తులసిరసమునుకూడా కలిపి స్ప్రే చేసిన మంచి ఫలితముండును.

---

స్త్రీ ఎక్కువైనయెడల దానిని భక్షించువారును ఎక్కువగుదురు

మంచమునకు నల్లులుపడిన అడవితులసి రెమ్మలు మంచమునకు వ్రేలాడ తీసిన నల్లులేగాక దోమలుకూడా పోవును.

4. తులసీదళముల రసమును పుక్కిటపట్టినయెడల నోటిలోని పుండ్లు Stomatitis & Glasitis మరియు పాదరసము, రసకర్పూరము మొదలగువాటిని శుద్ధిచేయకనే వాడుటచే సంభవమగు నోరు పట్టుట అనునదికూడా గుణమగును.

5. అంటువ్యాధులు ప్రబలినపుడు ఇంటిలోని అందరూ ప్రతిదినము తులసిరసమునకు వేపరసము కలుపుకొని ఒక స్పూనువంతున సేవించుచుండిన ఆ వ్యాధి ఆ ఇంటి ఛాయలకు రానేరదు.

6. ఎలెక్ట్రిసిటీతో షాక్ తిని తెలివితప్పి పడిపోయిన వ్యక్తికి తులసిరసముతో తల, ముఖము, అరికాళ్లు, చేతులకు బాగుగా రుద్దిన త్వరగా తేరుకొని లేచికూర్చొనును

7. హృదయరోగముల (Heart Diseases) లో అర్జునత్వక్ ను, తులసిరసముతో నూరి సేవించిన చాలమంచిది.

8. అపరిశుద్ధముగాఉన్న త్రాగునీటికి తులసిదళములు 12 గంటలకాలము వేసియుంచిన శుద్ధమగును. రుచి, వాసనకూడ ఆ నీటికివచ్చి తృప్తిగా త్రాగవచ్చును. మనము ప్రతిదినము త్రాగు నీటిని మట్టిపాత్రలోనే నిలువఉంచుట ఉత్తమోత్తమము.

9. ఆరోగ్యముగా ఉన్నవారు పది తులసిదళములకు అయిదు మిరియాలు, నాలుగు బాదాములు కలిపి మర్దించిన చూర్ణమునకు కొద్దిగా తేనె కలిపి ప్రతిదినము ప్రొద్దున పరిగడుపున ఒకపూట తీసుకొనుచున్న జ్ఞాపకశక్తి వృద్ధిచెందును. ఆరోగ్యము అత్యుత్తమముగా నుండును.

10. ఎండిన తులసిదళములను బాగా దంచి వస్త్రగాళిత చూర్ణముగా తయారించుకొని, ముఖమునకు (పౌడరువలె) రుద్దుకొనుచున్న ముఖమునకు మంచికళ కాంతిని తెచ్చి ముఖముపై మంగు మొదలగు మచ్చలు మాయమగును.

11. మానసిక పెరుగుదలలేని చిన్నపిల్లలకు తులసి స్వరసమును తేనెతో ఇచ్చిన 15 దినములకే ఫలితములు కనబడును.

12. తులసి పంచభాగములను సమభాగములుగా చూర్ణించి చక్కెరతో కలిపి ప్రతి దినము సేవించుచున్న బలహీనతపోయి ఆరోగ్యమును పొందును.

13. 5 గ్రా. తులసిదళములు, 5 గ్రా. బ్రాహ్మీవేళ్ళు, బాగుగా చూర్ణించి ఒక గ్లాసు నీటిలోవేసి కలిపి వడకట్టి రుచికి కొద్దిగా పటికబెల్లము చేర్చి ప్రతిదినము రెండు పూటలు త్రాగించిన జ్ఞాపకశక్తి వృద్ధిచెందును. మానసిక పరిణితి వృద్ధిచెందును. హిస్టీరియా గుణమగును. ఇంకను అనేకలాభములు పొందనగును.

14. తులసి గుండెజబ్బులకు, కడుపులోని పుండ్లకు (Peptic ulcer) రక్తపు వత్తిడికి (B.P), శరీరమందలి నొప్పులకు, తమకశ్వాసను (Asthma) గుణము చేయును.

యెదలో నొప్పి వచ్చినపుడు కొద్దిగా తులసిదళములకు రెండు - మూడు మిరియాలు కలిపి నమలిమింగిననూ, తులసిరసము త్రాగుట, తులసిని బాగుగా మర్ధించిన గుజ్జును యెదకు పూసినను వెంటనే మంచి గుణముండి తీరును.

15. ప్రతిదినము అనేక కార్యక్రమాలచే సంభవించు మానసిక వత్తిడులను తులసి స్వరసము త్రాగుటచేగాని, 10-20 తులసిదళములను నమిలి తినుటచేగాని మంచి గుణమును పొందవచ్చును.

16. తులసిదళములు, ఏలకులు, శొంఠిచూర్ణము, బాదాములపొడి, కలిపి నీటిలో వుడికించి (వడకట్టకూడదు) ఆ కషాయమునకు పాలు, చక్కెర కలిపి 'కాఫీ, టీ' లవలె వేడివేడిగా త్రాగిన ఆరోగ్యమునకు చాలా మంచిది. దీనితో కాఫీ, టీ త్రాగు అలవాటును తొలగించుకొనవచ్చును.

17. తులసివలయములో అవగా ఇంటిలో బృందావనమునకు దగ్గరలో కూర్చొని రోజూ ప్రాణాయామము, ధ్యానము ఏ కొద్దిసేపు చేసిననూ చాలమంచి ఫలిత ముండును. శరీరమునందలి ప్రతి అణువు ఈ గాలిచే పూరింపబడి శుద్ధిచెంది పరిపూర్ణ ఆరోగ్యమును కలిగించితీరును. తులసి మొక్కలలో ఉద్భవించు ఒక ప్రత్యేకమైన వాయువు పరిసరవాతావరణములో అతి సులభముగా కలిసిపోయి

వాతావరణమును పరిశుద్ధముచేయును. తులసియొక్క ఫలితము 200 మీటర్ల వరకు సులభముగా వ్యాపించునని తెలియుచున్నది.

చిన్నకుంపట్లలో తులసి మొక్కలను పెంచి వాటిని మనము ఉపయోగించు ప్రతి గదియందును ఒక్కొక్క కుంపటిని పగలంతయూయుంచి, సాయంత్రము ఆరుబయలులో ఇంటి ఆవరణమునందు చేర్చి రాత్రియంతయూ యుంచి మరలా ప్రాతఃకాలముననే గదులలో యుంచుకొనవలయును. ఇట్లు చేయుటచే అక్కడి వాతావరణము శుద్ధికాబడి అనేక రోగములు రాకుండా నిరోధింపబడును.

18. తులసి శరీరమునకు ఎలాటి దుష్ట పరిణామమును కలిగించదు - సరికదా తులసి శరీరమునందలి ప్రతి అవయవమును, అంతెందుకు ప్రతి అణువును ప్రకృతి సహజముగా ఉత్తేజపరచి వ్యాధులను పోగొట్టి ఆరోగ్యమును ప్రసాదించును.

తులిసి కాయ శుద్ధికరములో నగ్రగణ్యమైనదిగా మహర్షులు ప్రసాదించిన ప్రసాదములలో ఇది ముఖ్యమైనదిగా భావింపబడుచున్నది.

19. తులసి స్థావర తిర్యగ్విషములకు యోగము తెలిసి వాడినచో మంచి విరుగుడు మందు అని తెలియుచున్నది, దీర్ఘ రోగములు అనగా మధుమేహము, శ్వాస కాసలు, వ్రణరోగములు (Ulcers & Cancer) ఇట్టి అనేక రోగములను గుణముచేయవచ్చునని ప్రామాణికముగా వెలువరించినారు. తులసివనమున శవ మెంతకాలముండినను (మంచుగడ్డలో శవం కుళ్ళులేకుండా ఉన్నట్లు) చెడిపోదని పూర్వవైద్యులు, ఆధునిక రసాయన శాస్త్రజ్ఞులు చెప్పినారు. తులసి గాలియు దాని స్పర్శయును, దీర్ఘ జీవితమునకు మూలాధారమని తెలియుచున్నది. సిద్ధ వైద్యులు దీర్ఘరోగులకు శస్త్రవైద్యము జరిగిన రోగుల పరుపులపై తులసీ దళములను చల్లెడివారు. ఇందుచే రోగికి Bed Sores రాకుండానూ గాయములు త్వరగా గుణమగునని తెలియుచున్నది.

20. జలుబు మొదలుకుని కుష్ఠువంటి మహావ్యాధులను, చలిచీమనుంచి పాముకాటు విషమువరకు సైతము నివారించుటకు తులసి ఉపయోగములను 343 వైద్యపర మైన ప్రయోగములు చేసినారు.

ప్రశస్తమైన ద్రాక్షారసం పుల్లని ద్రాక్షపండ్లనుంచి తయారైనదే



తులసి క్యాన్సర్‌ను, బొల్లిని పోగొట్టును అనుదానికి ఈ క్రింది అభిప్రాయమును పరిశీలించుడు.

"Diseases like cancer, heart and kidney ailments chronic bronchitis cardiac asthma and leucoderma, which are considered incurable diseases, can now be cured by the Indian Plant - TULASI. Over three decades of research and treatment of a large number of patients by Dr. Upendrarai, J. Sandesara, a city share - broker turned medical practitioner, has revealed that Tulsi is efficacious in curing a number of diseases tormenting mankind. Dr. Sandesara is a specialist in Tulsi therapy, naturopathy and yogic therapies.

He claims to have achieved remarkable success through Tulsi therapy. The instances he cites are : a 10 years old mentally retarded boy in Ahmedbad showed about 25% cure in his illness after a fortnight's Tulsi therapy, an elderly women (age 60 Years) who was suffering from genital cancer has recovered from her ailment, this was after the modern system of treatment has described her case as hopeless, she was subjected to deep Xray and cobalt roy treatment. Discharged from the hospital she was put through Tulsi therapy. She now walks and eats. A kidney patient was reluctant to go in for dialysis. He preferred Tulsi therapy for a long time has shown signs of recovery. Dr. Sandesara does not have a string of degreess. But he is a Scholar and author of over 35 books on religious including Sikhism. His research in Tulsi therapy has won him recognition from the State Government : He has given a slogan to the nation: "GROW MORE TULSI".

(Indian Express Dt. 18-5-78)

గుణముకావు అని భావింపబడు భయంకర రోగములు_అర్బుదము (Cancer) హృద్రోగము, మూత్రజననాంగ రోగములు, బొల్లి, ఆస్త్మ మొదలగు వానిని తులసితో గుణపరచవచ్చును. మూడు దశాబ్దములకంటె ఎక్కువకాలము, నిరంతర

శాంతుని కోపంచూచి జాగ్రత్తగా మెలగాలి

పరిశోధనచేసి, చికిత్సచేయుచున్న డాక్టరు ఉపేంద్రరాయ్ మరియు జి. సందేసర అను వారు ముందు "షేర్ బ్రోకర్స్"గా నుండి ఇప్పుడు వైద్యులయినారు. మానవులను బాధించుచున్న అనేక రోగములకు తులసి మంచి మందు అను రహస్యమును బట్ట బయలుచేసినారు. డాక్టరు సందేసరగారు తులసి చికిత్స, ప్రకృతి వైద్యము మరియు యోగ చికిత్సయందును మంచి నిష్ణాతులు.

వారు తులసి చికిత్సతో గుణముచేసిన కొన్ని రోగముల వివరము లిట్లున్నవి :

I. అహమ్మదాబాద్‌నందు 10 సం॥ల వయస్సుతో, మనో వికల్పముతో బాధపడు ఒక అబ్బాయికి తులసి చికిత్సతో రెండువారములలో సుమారు 25% భాగము గుణము కనబడినది.

II. సుమారు 60 సం॥ల వయస్సుగల స్త్రీ జననేంద్రియ అర్బుద (**Uterine Cancer**) రోగముతోనున్న ఆమె గుణముపొందినది. ముందు ఆమె చికిత్సాలయమునందు 'డీప్ ఎక్స్‌రే' మరియు 'కోబాల్టు' చికిత్సలు చేయించుకుని, దానితో ప్రయోజనములేక ఈవిడ వ్యాధి నయముకాదు అని ఆ వైద్యులు విడిచిన తర్వాత ఆమెకు చికిత్స మొదలుపెట్టుట జరిగినది. ఇప్పుడు ఆమె నడచుచున్నది. ఆహారము తినుచున్నది.

III. సుమారు 70 సం॥ల వయస్సుగల అతనికి మెడపై కుడిభాగమున ఒక ఉబ్బిన గంతివంటి వాపును అక్టోబరు 77లో కనుగొన్నారు. అతని గొంతు నందు, ముక్కునందుకూడ ఇన్‌ఫెక్షన్ యున్నట్లు డాక్టరు పరీక్షతో తేల్చినారు. 1977 డిశంబరులో దానిని క్యాన్సర్‌గ నిర్ధారించినారు. వీటికి ముందునుంచి అతను మధుమేహరోగి.

వీటితో అతని పరిస్థితి చాల దయనీయమైనదిగా నుండినది. 1980 సం॥ రానికి అతని పరిస్థితి చేయిదాటినది. మెడపై వేసిన అనేకమందులతో బొబ్బలు లేచినవి. వాటినుంచి రక్తము, చీముకారుట. విపరీతమైన నొప్పి, దుర్వాసనతో రోగి భరింప వీలుకానిపరిస్థితి ఏర్పడినది. ఈరోగి తమ్ముడు అహమ్మదాబాద్‌లో

 యాచనచే విష్ణువంతటివాడుకూడా వామనుడయ్యాడు

బాగా పేరున్న M.D., M.R.C.P. క్వాలిఫికేషన్స్ కలిగిన డాక్టరు. అతను చేయవలసిన ప్రయత్నాలు అన్నియుచేసి ఆశవదలుకున్నాడు.

అటువంటి పరిస్థితులలో తులసి చికిత్సను తీసుకొన్నాడు. కొద్ది దినముల లోనే రోగికి గుణము కనబడినది. 21-12-82వ తేదీ రక్తపరీక్ష జరిపి రోగము పూర్తిగా నయమయినదని నిర్ధారించినారు.

అతను ప్రతిదినం 2 - 3 కిలోమీటర్లు నడచుట, దైనందిన కార్యక్రమ ములు సక్రమముగా చేయుచూ ఆరోగ్యముగా యున్నాడు.

IV. మూత్రపిండ రోగముతో బాధపడుచున్న ఒకరోగి అల్లోపతి చికిత్సతో 'డయాలిసిస్' చేయించుకొనుటకు ఇష్టపడక తులసి చికిత్సను ప్రారంభించినాడు. మంచిగుణమే కనబడినది.

V. బొల్లి (శరీరముపై తెల్లని మచ్చలు కనబడుట Leuco-derma) రోగముతో అవస్థపడు 11 సంIIల వయస్సుగల ఒక బొంబాయి అమ్మాయి - చాలాకాలము తులసి చికిత్సను పొందినతర్వాత మంచి గుణము కనిపించినది.

డాక్టరు సందేశంగారికి ఈనాటి డిగ్రీల వరుసలు లేవు. కాని వారు మంచి విద్యావంతులు. 35 కంటే ఎక్కువగా మతము - ధర్మములపైనను, సిక్కు మతమును గురించికూడ పుస్తకములు ప్రకటించినారు. తులసి చికిత్సయందు అతను గావించిన పరిశోధనకుగాను. రాజ్యసర్కారు అతనికి మాన్యతనిచ్చి సత్కరించినది. అతడు దేశమునకు ఇచ్చిన సందేశము "ఎక్కువ తులసి పెంచుడు" అని.

21. జనవరి '93వ తేదీయందు దినపత్రికలలో వచ్చిన విషయము :

తులసి 'ఎయిడ్స్'ను నిరోధించు శక్తి కలదని తెలిపినారు. మానవుని శరీరంలోని రోగనిరోధక శక్తి నశించిపోవటమే ఎయిడ్స్‌కు కారణమనియు, ఆ శక్తి అత్యుత్తమముగాయున్న తులసితో తయారైన టానిక్‌లను ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులకు వాడుతున్నారని తెలియుచున్నది.

22. డాక్టర్ విక్టర్‌రిచిన్ అను ఫ్రెంచి దేశీయుడైన సుప్రసిద్ధ వైద్యుడు తులసి రక్తపోటును (B.P.) గుణపరచుననియు, జీర్ణక్రియను సక్రమపరచుననియు, ఎట్టిటి రక్తకణములను శక్తివంతపరచుననియు, మానసికరోగములందు అత్యుత్తమముగా పనిచేయుననియు, సాధారణ జ్వరములు ముఖ్యముగా మలేరియా జ్వరమునకు ముఖ్యమైన మందు అనియు నిర్ధారించినాడు.

23. తులసి, మారేడు, మామిడి ఈ మూడు బొగ్గుపులుసుగాలిని (కార్బన్‌డై ఆక్సైడ్) వేగముగా పీల్చి ప్రాణవాయువు (ఆక్సిజన్)ను విడిచే విశిష్ట లక్షణమున్నది. అందునూ తులసి ఇరవైనాలుగుగంటలూ ప్రాణవాయువును మాత్రమే విడుచునని తెలియుచున్నది. ఇది ఆధునిక వృక్షశాస్త్రము అంగీకరించిన సత్యము.

24. కలకత్తా నగరమున ఒక యూరోపియన్ చీఫ్ ఇంజనీయరు. ఇతను విద్యుచ్ఛాస్త్రమున గొప్పపండితుడు. ఇతను వైజ్ఞానిక పరిశోధనల ద్వారా (Scientific research) మూలమున తులసిని గురించి చాలా విషయములు సేకరించినాడు. తన ఇంటి ఆవరణములో ఒక తులసీవనాన్నే పెంచుకున్నాడు. అతని ఇంటికి ఒకమారు ఒక హిందువుపోయి దొరగారి బంగళాయందు ఎచ్చట చూచినా తులసిమొక్కలుండుట చూచి ఆశ్చర్యపడి, ఇన్ని తులసి మొక్కలను ఎందుకు పెంచినారు అని దొరను ప్రశ్నించినాడు. దానికి బదులుఇస్తూ, తులసి మొక్కలనుంచి మరియే ఇతర మొక్కలలోను లేనంతటి విద్యుత్తు ఉత్పన్నమవుతుందని తెలియజేయుచూ, ఈ మొక్కఉన్న ప్రాంతములో దాదాపు 200 గజములవరకుగల వాయువు పరిశుద్ధమగుననియు వివరిస్తూ, మనము తిను వస్తువులలో తులసిని యుంచిన అవిచెడిపోవు. తులిసి క్రుళ్లిపట్టకుండా చేయును. దుర్గంధనివారకము. తులసి నీరు కంటిలో వేసిన మంచిదనియు, మలేరియా, ప్లేగు క్షయ, మశూచి క్రిములు దరిచేరలేవని వివరించినాడు.

తులసి రసము దేహమునకు బూసికొనిన దోమకాటువేయదు. పిడుగుచే మూర్ఛపోయిన వానికి తక్షణము తులసీరసముతోశరీరమును మర్దనచేయగలిగిన యెడల తక్షణమే వాని శరీరమునకు విద్యుచ్ఛైతన్య క్రియవలన గలిగిన మైకము తొలగి తెలివి వచ్చునని తెలిపినాడు.

హిస్టీరియా, ఎక్కిళ్లు, దగ్గు, ఆయాసము, జ్వరాలు, పార్శ్వనొప్పులు తులసితో హరించబడతాయని, రక్తదోష, క్రిమిదోష. చర్మవ్యాధులనుంచి తులసి రక్షిస్తుందని, తులసివేరు ముక్క దగ్గర ఉన్న పిడుగు ప్రమాదముండదనియూ, తులసిమాలను ధరించిన మానవశరీరమున విద్యుచ్ఛక్తి స్థిరముగా నుండుననియూ, అందుచే అనేక రోగములుపోయి యారోగ్యము కలుగుననియు వాడు ఇతరులకన్న ఆరోగ్యవంతుడుగా దీర్ఘజీవిగా, ధర్మశీలుడుగా, సత్ప్రభావలంబియుడుగా ఉండుననియు అందుచే తులసివేరును తాను ఎల్లప్పుడు మెడలో ధరిస్తాననియు చూపి తులసిపై అనేక విషయాలు వివరించినాడు. తాను ప్రతి దినం సంపూర్ణ ఆరోగ్యముకొఱకు ఉదయము, సాయంకాలము ఈ తులసి తోటలోనే తిరుగుతూ ఉంటానని వివరించినాడు.



# భోజన పదార్థములలో తులసి ఉపయోగము

మన దేశములో కొన్నిప్రాంతాలలో తులసిని శాకముగా అనగా [illegible], కూరలతో కలిపియున్నా. టీ యందు మసాలాగానూ (మసాలా టీ) ఉపయోగము వాడుకలో యున్నట్లు తెలియుచున్నది.

100 గ్రాముల కృష్ణతులసియందుండు ద్రవ్యములు మరియూ వాటి ప్రమాణములు :

1. టోటల్ యాష్ : 17.48
2. క్యాల్షియం : 4.80
3. మెగ్నీషియం : 4.12
4. సోడియం : 0.69
5. పొటాషియం : 0.82

మరియు అయిరన్, ఫాస్ఫరస్, అస్కార్బిక్ యాసిడ్, కార్బోహైడ్రేట్స్, ప్రొటీన్ మొదలగు అనేక పోషక పదార్థములున్నవని నిరూపింపబడి ఉన్నది.

అత్యంత పవిత్రమైనది, ఉత్తమమైన ఔషధోపయుక్తమైనది మరియు మంచి పోషక పదార్థములు కలిగిన తులసిని సాధారణ ఆహారపదార్థములలో వాడితే [illegible] అను ఆలోచన తలఎత్తవచ్చును. మరియు తులసిని ఆహారపదార్థములతో పాటు ఉపయోగించిన రోగములు రాకుండా అరికట్టునా? అనికూడ ఆలోచించవలసియున్నది. ఈ విషయాలపై జరిగిన ప్రయోగములను గురించి పరిశీలింతము.

చిరంజీవి పి. చంద్రకళగారు 1987వ సం॥లో జరిపిన అనేక ప్రయోగముల ద్వారా తులసి చాలా తక్కువ ఖర్చుతో, అత్యుత్తమమైన పోషకవిలువలను, [illegible] నిరోధక శక్తిని, ఆహారపదార్థములతో కలిపి వండినమా ఒవంగినా అని [illegible] రించి బీద ప్రజానీకానికి కనువిప్పు కలిగించినది. కాని దానికి సరియైన ప్రచారము [illegible] ప్రజాదరణ పొందలేదు.

ఆమె సాధారణముగా మన ప్రాంతములలో తయారుచేయు [illegible] పొడికూరలు లేక తాళింపుకూరలు, ఆకుకూరలతో పొడికూరలు, [illegible]

గోగాకు, కొబ్బెర మొదలగువాటితో చెట్నీలు, మసాల రొట్టె, టొమెటోచారు, పులుసు, టీ మరియు తేలిక పానీయములు - ఇలా అనేక సాధారణ ఆహారపదార్థములను తులసిని కలుపకుండాను - తులసిని 15% మరియూ 30% కలిపి తయారించి, వాటియందు పెరిగిన పోషకవిలువలను, రుచి, వాసన మొదలగువాటిని ప్రయోగముల ద్వారా నిరూపించి వెలువరించినది.

వాటి వివరములుగురించి చూతము :

బంగాళదుంపలు (ఉర్లగడ్డలు), క్యారెట్లు, బీట్‌రూట్ మరియు ముల్లంగి మొదలగు దుంపకూరలతో వేపుడుకూరలు : Curries :

1.

| | | |
|---|---|---|
| కూరగాయలు | : | 100 గ్రాములు |
| ఉల్లిపాయలు | : | 50 గ్రాములు |
| కారముపొడి | : | 1/2 టీ స్పూను |
| నూనె | : | 2 టీ స్పూనులు |
| ఉప్పు | : | రుచికి కావలసినంత |
| ఆవాలు | : | 1/2 టీ స్పూను |
| మసాలపొడి (Curry powder) | : | 1 టీ స్పూను |

## Curry Powder : మసాలపొడి తయారుచేయు విధానము :

ధనియాలు రెండు టేబిల్ స్పూనులు బాగుగా వేయించి, దానికి రెండు వెల్లుల్లి పాయలు, లవంగాలు రెండు, 10 గ్రాములు కొబ్బరికోరు కలిపి వాటికి మరికొన్ని మసాలాదినుసులుకలిపి దంచి పొడిగా తయారుచేసుకొనవలయును. మిక్సీగ్రైండరుకు వేసి తయారించుకొనవచ్చును.

### వేపుడుకూర (Curry) తయారుచేయు విధానము :

కూరగాయలను నీటితో శుభ్రముగా కడుకుకొని, వాటిని వలిచి (Peeled and Cut) అనగా వాటిపై చెక్కుతీసివేసి, చిన్న ముక్కలుగా తరుగుకోవాలి. ఉల్లిపాయలను చిన్న ముక్కలుగా తరిగి నూనెలో దోరగా వేయించవలెను. కూరగాయముక్కలను దీనిలోవేసి 2 - 3 నిమిషాలు వేయించవలెను. తర్వాత మెరపపొడి, మసాలా

పొడి, ఉప్పు దానిపైచల్లి బాగుగా కలియబెట్టి, కొద్దిగా నీరువేసి కూరగాయలు పక్వానికి వచ్చునట్లు ఉడికించి, దించి తిరుగమోతవేసి బాగుగా కలిపివుంచుకోవాలి.

తులసిని కూరలకు కలుపు నిష్పత్తి లేక దామాషాలు :

TABLE No. 1

| యోగము : | కూరగాయలు గ్రాములు : | తులసి గ్రాములు : |
|---|---|---|
| Basic | 100 | – |
| మొదటి దామాష | 85 | 15 |
| రెండవ దామాష | 70 | 30 |

పైన తెలిపిన విధముగానే క్యారెట్, బీట్‌రూట్, ఉర్లగడ్డలు, ముల్లంగిలతో నాలుగు విధములగు కూరలు (Curries) తయారుచేయబడినవి. వీటిని తయారు చేయునపుడు నెంబరు 1 టేబిల్‌నందు చూపబడిన వ్యత్యాసములతో తులసివాడబడినది. అనగా తులసి కలుపక ఒకమారు, కూరగాయలు 85 గ్రా.లకు 15 గ్రా. తులసినిచేర్చి ఒకమారు, కూరగాయలు 70 గ్రా.లకు 30 గ్రా. తులసినికలిపి ఒకమారు తయారించి పరీక్షలు నిర్వహించుట జరిగినది, ఇక్కడ తులసి ఆకులను బాగుగారుబ్బి, కూరకు కలుపుట జరిగినది.

## 2. ఆకుకూరలతో కూరలు :

| | | | |
|---|---|---|---|
| ఆకుకూరలు | : 100 గ్రా. | ఉప్పు | : రుచికి కావలసినంత |
| కందిపప్పు | : 40 గ్రా. | నూనె | : 2 టేబిల్ స్పూనులు |
| ఉల్లిపాయలు | : 50 గ్రా. | మసాలపొడి | : 1 టీ స్పూను |
| టొమెటో | : 50 గ్రా. | ఆవాలు | : 1/8 టీ స్పూను |
| మెరపపొడి | : 1 టీ స్పూను | | |

తయారుచేయు విధానము : తరిగిన ఆకుకూరలను, కంది బేడలను విడివిడిగా కుక్కరున వుడికించి, నూనెలో వేయించిన వుల్లిపాయముక్కలు. టెమెటోముక్కలు కలిపి, దానికి మెరపపొడి, మసాలపొడివేసి బాగుగా కలగలిపి 5 నిమిషాలు వుడికించి దించుకొని తిరుగమోతవేయాలి.

పై విధముగా మూడువిధములైన కూరలను (Curries) తోటకూర, బచ్చలి కూర, మెంతి ఆకుకూరలతో తయారుచేయబడినవి. అందు నెం. 1 పట్టిమేరకు తులసి చేర్చి తయారించి ప్రయోగమున కుంచుట జరిగినది. ఇక్కడ తులసి ఆకులను ఆకు కూరలతో కలిపి వుడికించుట జరిగింది.

**3. పప్పుధాన్యములతో తులసి :**

కందిపప్పు లేక పెసరపప్పు (బేడలు) : 100గ్రా. ఉల్లిపాయలు : 50 గ్రా.
టొమెటొ : 50 గ్రా. పసుపు : 1/8 టీ స్పూను
పచ్చిమెరపకాయలు : 15 గ్రా. ఉప్పు : రుచికి కావలసినంత
నూనె : 2 టేబిల్ స్పూనులు ఆవాలు : 1/4 టీ స్పూను

బేడలు, పచ్చిమెరపకాయలు, టెమెటోలు కలిపి వుడికించుకోవాలి. వుల్లిపాయ ముక్కలను నూనెలో దోరగా వేయించి, పైన వుడికించుకొన్న బేడలలో కలిపి, దానికి వుప్పుచేర్చి, బాగుగా కలిపి తిరుగమోతవేసి తయారుచేయవలెను.

ఇలాగే కందిబేడలు, పెసరబేడలతో విడివిడిగా రెండురకముల కూరను తయారించుచూ యథావిధిగ నెం. 1 పట్టికమేరకు తులసిని బేడలు వుడుకునపుడు కలుపుట జరిగింది.

**4. చట్నీల తయారీలో తులసి :**

వేరుశనగ విత్తులతో చెట్నీ :

వేరుశనగ విత్తులు : 100 గ్రా. ఉల్లిపాయలు : 50 గ్రా.
పచ్చిమెరపకాయలు : 10 గ్రా. ఉప్పు : రుచికి కావలసినంత
చింతపండు : 10 గ్రా. నూనె : 2 టేబిల్ స్పూనులు
తిరుగుమోతకు : ఉద్దు బేడలు 1/2 టీ స్పూను కొత్తిమ్మెర : కొంత 2-3 రెమ్మలు
ఆవాలు 1/2 టీ స్పూను ఎండుమెరపకాయలు 2

తయారించుట : వేరుశనగ విత్తులను వేయించి పొట్టుతీసివేసి, వుప్పు, కొద్ది నీళ్ళలో వేసియుంచుకొన్న చింతపండును కలిపి గ్రైండరులోగాని, రుబ్బురోలునందుగాని వేసి మెత్తగా రుబ్బుకొని, చిన్నముక్కలుగా తరిగిన వుల్లిపాయలు కలిపి తర్వాత తిరుగ మోతయుంచుకోవలెను.

ఇందుకూడ నెం. 1 పట్టికమేరకు తులసిని కలుపుట జరిగినది. ఇక్కడ ఒక స్పూను నూనెతో తులసిదళములు దోరగా అగునట్లు వేపి పైవాటిలో వేసి రుబ్బు కొనుటజరిగినది.

5. శనగబేడల చెట్నీ (పచ్చడి) :

| | | | |
|---|---|---|---|
| వేయించిన సెనగబేడలు | : 100 గ్రా. | ఉల్లిపాయలు | : 50 గ్రా. |
| పచ్చిమిరపకాయలు | : 10 గ్రా. | ఉప్పు | : రుచికి తగినంత |
| చింతపడు | : 10 గ్రా. | నూనె | : 1 టేబుల్ స్పూను |

మరియు తిరుగ మోతకు కావలసినవి.

**తయారుచేయుట :** వేయించిన సెనగ బేడలను, ముక్కలు చేసిన పచ్చిమెరపకాయ లను, చింతపండును కలిపి బాగులా రుబ్బుకొని ఉల్లిపాయముక్కలను కలపి కొద్దిసేపు రుబ్బి తర్వాత తిరుగమోతవేపిన తయారగును.

ఇందునూ నెం. 1 పట్టిక మేరకు తులసిని ఉపయోగించుట జరిగింది. తులసిని నూనెతో వేయించి రుబ్బుటకు ముందుగా కలుపుట జరిగినది.

6. కొబ్బెర చెట్నీ (పచ్చడి) :

| | | | |
|---|---|---|---|
| తాజా పచ్చికొబ్బెర | : 100 గ్రా. | చింతపండు | : 10 గ్రా. |
| పచ్చిమెరపకాయలు | : 10 గ్రా. | నూనె | : ఒక టేబల్ స్పూన్ |
| ఉల్లిపాయలు | : 50 గ్రా. | ఉప్పు | : రుచికి కావలసినంత |

పచ్చికొబ్బెరను బాగుగా తురుముకొని, పచ్చిమిర్చి, ఉప్పు, చింతపండు కలిపి నున్నగా రుబ్బిన తర్వాత ఉల్లిపాయలు కలిపి కొంతసేపు మాత్రము మరలా రుబ్బి తర్వాత తిరుగమోత వేయవలెను. ఇందునూ నెం. 1 పట్టికలోవలె తులసిని కలిపి తయారించుట జరిగినది. తులసిని నూనెతోవేయించి, రుబ్బుటకు ముందుగానే కలుపుట జరిగింది.

7. గోగాకు - పుండాకు - గోంగూర చెట్నీ (పచ్చడి) :

| | | | |
|---|---|---|---|
| గోగాకు | : 100 గ్రా. | నూనె | : 2 టేబల్ స్పూనులు |
| పచ్చిమెరపకాయలు | : 15 గ్రా. | ఉప్పు | : కావలసినంత |
| ఉల్లిపాయలు | : 50 గ్రా. | | |

నూనెతో గోగాకు, పచ్చిమిర్చి, ఉల్లిపాయ ముక్కలు వేయించుకొని కావలసినంత ఉప్పు కలిపి రుబ్బుకొనవలెను. తర్వాత ఇష్టమున్న తిరుగమోత వుంచవచ్చును. నెం. 1 పట్టిక మేరకు తులసిని వేయించి మొదటనే కలిపి రుబ్బుట జరిగినది.

గోగాకును మాత్రమే నూనెలో వేయించి, దానికి మిర్చి, ఉల్లి, ఉప్పు కలిపి రుబ్బుకొని తయారుచేయవచ్చును.

## 8. తులసి మసాలా రొట్టె - చపాతి :

| | | | |
|---|---|---|---|
| జల్లెడించుకున్న పిండి | : 100 గ్రా. | కొత్తిమ్మెర | : 10 గ్రా. |
| ఉల్లిపాయలు | : 50 గ్రా. | పెరుగు | : 2 టేబిల్ స్పూనులు |
| పచ్చిమిరపకాయలు | : 15 గ్రా. | ఉప్పు | : కావలసినంత |
| నూగులు | : 10 గ్రా. | నూనె | : 2 టేబిల్ స్పూనులు |
| అల్లము | : 10 గ్రా. | | |

ఉల్లిపాయలు, కొత్తిమ్మెర, అల్లము, పచ్చిమిర్చి కలిపి మెత్తగా రుబ్బుకొని పిండిలోవేసి, కొద్దిగాకలిపి దీనికి పెరుగు, ఉప్పు, నూగులువేసి నీటినికూడ అవసరము బట్టి కలిపి, పిసికి పిసికి కలిపి, దానిని రెండు ముద్దలుచేసి, రెండు రొట్టెలు లేక చపాతీలు తయారించి పెనముపై నూనెవేసిరెండుపైపులా కాల్చవలయును. రొట్టె తయారుచేయునపుడు ముద్దకు కొంత పిండి అద్దుట, కాల్చునపుడు మంచి రంగు వచ్చుటకు రెండుపైపులా త్రిప్పి త్రిప్పి కాల్చుట మొదలగు విషయాలు అందరకూ తెలిసినవే.

### పట్టిక నెం. 2

### మసాలా రొట్టె తయారీలో తులసి వాడు నిష్పత్తి :

| వ. నెం | మసాలా రొట్టె | మూల పిండి | నిష్పత్తి గ్రా. 1వ రకము పిండి | తులసి | నిష్పత్తి గ్రా. 2వ రకము పిండి | తులసి |
|---|---|---|---|---|---|---|
| 1. | జొన్న | 100 | 85 | 15 | 70 | 30 |
| 2. | గోధుమ | 100 | 85 | 15 | 70 | 30 |
| 3. | గోధుమ + సెనగపిండి | 65 +20 | 65 + 20 | 15 | 55 + 15 | 30 |

పైన తెలిపిన (నెం. 2 పట్టిక) నిష్పత్తిలో తులసిని బాగుగాదంచి ముద్దగాచేసి రొట్టెను తయారించు ముద్దలో కలిపినతర్వాత రొట్టెను తయారించి కాల్చుట జరిగినది.

## 9. టెమెటో సూప్ :

| | | | |
|---|---|---|---|
| టెమెటోలు | : 250 గ్రా. | వెన్న | : 2 టేబిల్ స్పూనులు |
| పాలు | : 200 మి.లీ. | మిరియాల పొడి | : 1 టీ స్పూను |
| ఉల్లిపాయలు | : 100 గ్రా. | ఉప్పు | : కావలసినంత |
| మైదా | : 2 టేబిల్ స్పూనులు | | |

టెమెటోలు చిన్నముక్కలుగా తరిగి 3-5 ని. వరకూ వుడికించాలి. తర్వాత వాటిని బాగుగా చిదిపి జల్లెడలో సోదించుకోవాలి.

### వ్యంజనము లేక అనుపానము :

వెన్నను బాణిగలోవేసి కాచి, ముక్కలుగా తరిగిన ఉల్లిపాయలనువేపి దోరగా వేయించవలెను. దానికి రెండుటేబిల్ స్పూనులు మైదాపిండినివేసి రెండునిమిషాలు కలియబెట్టాలి. అది ముద్దకట్టకుండా కొద్దికొద్దిగా పాలు కలుపుతూ త్వరత్వరగా కలియ పెడుతూ, మంట తగ్గించి కలియపెడుతూవచ్చిన క్రీమువలె తయారగును.

ఈ వ్యంజనమును ఉప్పు, మిరియాల పొడితోబాటు టెమెటో పూరీలకు ఉపయోగించవచ్చును.

### పట్టిక నెం. 3

| సూపు | బేసిక్ సూప్ | ఒకటవ విధానము | | రెండవ విధానము | |
|---|---|---|---|---|---|
| | | సూప్ మి.లీ. | తులసిరసం మి.లీ. | సూప్ మి.లీ. | తులసిరసం మి.లీ. |
| టెమెటో చారు (సూపు) | 200 | 170 | 30 | 140 | 60 |
| వివిధ కూరగాయల సాంబారు (సూపు) | 200 | 170 | 30 | 140 | 60 |

తులసీ రసం తయారించుట :

తులసి ఆకులు : 100 గ్రా. నీరు : 100 మి.లీ.

తులసి ఆకులకు 50 మి.లీ నీరు కలిపి బాగుగా రుబ్బి, పలుచాటి బట్టలో వేసి పిండుకొని, మరలా పిండిన పిప్పికి మిగిలిన 50 మి.లీ నీటినికలిపి బాగుగా రుబ్బుకొని రెండవమారు బట్టలో వేసి పిండుకోవలెను.

మూడవ నెం. పట్టికలోని మేరకు తులసి రసమును టొమెటో సాంబారు - పులుసు - చారు - సూప్ లకు కలుపుకొనవలయును.

10. కూరగాయల మిశ్రమ పులుసు - సాంబారు - సూప్ :

| | | | |
|---|---|---|---|
| క్యారెట్ | : 75 గ్రా. | ఉల్లిపాయలు | : 50 గ్రా. |
| ఉర్లగడ్డలు | : 75 గ్రా. | వెల్లుల్లి | : 4 పాయలు |
| బీట్ రూట్ | : 50 గ్రా. | లవంగాలు | : 3 |
| బీన్సు | : 50 గ్రా. | మిరియాలపొడి | : 1/2 టీ స్పూన్ |
| టొమెటో | : 50 గ్రా. | ఉప్పు | : రుచికి కావలసినంత |

అన్నిరకముల కూరగాయలను శుభ్రముగా నీటితో కడిగి పై చెక్కతీసి, చిన్న ముక్కలుగా తరుగుకోవాలి. వెల్లుల్లిపాయలు మరియు లవంగాలను బాగుగా దంచి, పైన తరిగియుంచుకొన్న కూరగాయల ముక్కలకు కలిపి 300 మి.లీ. నీటిని చేర్చి ఉడికించాలి. బాగుగా ఉడికిన కూరగాయలను మెత్తగా చిదిపి జల్లెడలో సోదించుకోవలెను. దీనికి టొమెటో రసము, మిరియాలపొడి మరియూ ఉప్పును కలపవలయును.

వెనుక తెలిపిన విధముగా తయారించిన తులసి రసమును యీ పులుసుతో పట్టిక నెం. 3 నందు తెలిపినవిధముగా కలుపవలయును.

తేలిక పానీయములు : Soft Drinks :

తులసి రసమును (తయారించుటకు) 100 గ్రా. తులసి ఆకు, 100 మి.లీ. నీటిని కలిపి తయారించుట పైన ఈవరకే తెలుపబడినది.

చక్కెర పానీయము :

200 గ్రా. చక్కెరను 50 మి.లీ. నీటితోకలిపి, మందాగ్నితో దాదాపు 15 నిమిషాలు వుడికించిన పలచాటి పానీయము (Syrup) తయారగును.

## 11. తులసి పానీయము తయారించుట :

తులసి రసం : 20 మి.లీ. + చక్కెర పాకం : 30 మి.లీ. + నీరు : 150 మి.లీ. = తేలిక తులసి పానీయము 200 మి.లీ. తయారగును.

అయిదు రకములైన సువాసనల తులసి పానీయములు తయారించుట :

i. ఏ విధమైన సువాసనలు కలుపక కేవలము తులసీ పానీయము.

ii. 200 మి.లీ. తులసి రసమునకు ఒక టీ స్పూను శొంఠిపొడి.

iii. 200 మి.లీ. తులసి రసమునకు ఒక టీ స్పూను మిరియాలు మరియు శొంఠి పొడులు.

iv. 200 మి.లీ. తులసి రసమునకు 30 మి.లీ. నారంజ, బత్తాయి రసములలో ఏదో ఒకటి.

v. 200 మి.లీ. తులసి రసమునకు 30 మి.లీ. కల్తీసి టెమెటో రసము.

టెమెటో రసమును (Juice) తయారుచేయు విధానము వెనుక తెలిపిన టెమెటో సూప్‌ను తయారించు విధముగానే అని తెలియవలెను.

## 12. "టీ" :

రెండువిధములైన 'టీ' లు తయారుచేయబడినవి. తులసి ఆకులతోపాటు ఒక రకము టీ, రెండవరకము 'టీ' కి తులసి టీ మసాలా కలిపి తయారించుట జరిగినది.

తులసి 'టీ' :

టీ పొడరు : 2 టీ స్పూనులు పాలు : 1 కప్పు

నీరు : 2 కప్పులు చక్కెర : కావలసినంత

ఎండిన తులసి ఆకుల పొడరు : 1 టీ స్పూను

టీ పొడిని, తులసి పొడిని, మరుగుచున్న నీటిలోవేసి వడపోసుకొని డికాక్షను తయారించుకొని, దానికి మరిగిన పాలు చక్కెర కలుపుకోవాలి. టీ తయారయింది.

## 13. టీ మసాలతో టీ : మసాల టీ తయారీ :

టీ పొడి : 2 టీ స్పూనులు
నీరు : 2 కప్పులు
పాలు : 1 కప్పు
చక్కెర : రుచికి కావలసినంత
టీ మసాలా : 1 టీ స్పూను

**టీ మసాలా తయారించుట :**

రెండు టీస్పూనుల తులసి ఆకులపొడి (ఎండిన ఆకులు)కి+1/2 టీ స్పూను శొంఠిపొడి+1/2 టీస్పూను మిరియాలపొడి, ఒక యాలక కలపాలి.

టీ మసాల మరియు టీ పౌడరును మరుగుచున్న నీటిలో కలిపి వడపోసుకొని డికాక్షన్ తయారించుకొని, దీనికి రుచికి కావలసినంత చక్కెర, మరిగిన పాలు కలుపుకొన్న మసాలా తేనీరు తయారగును.

## 14. హాయినికూర్చు తులసి పానీయము :

తులసి ఆకులు : 6
నీరు : 1 కప్పు
పుదిన ఆకులు : 6
నిమ్మరసము : రుచికి కావలసినంత
తేనె : రుచికి కావలసినంత

తయారుచేయు విధము : తులసి మరియు పుదిన ఆకులను ఒక కప్పు నీటిలో వేసి వుడికించాలి. తర్వాత వడబోసుకొని, దానికి నిమ్మరసము, తేనె కావలసినంత కలుపుకొని సేవించ తగును. కొద్దిగా చల్లబడిన తర్వాతనే నిమ్మరసం, తేనెకలపాలి.

ఇలా తయారుకాబడిన ఈ ఆహారపదార్థములను గురించి అనేక విధములుగా శాస్త్రీయ పద్ధతులలో పరీక్షలుజరిపి, తులసిని 15 నిష్పత్తి వంతున కలిపిన దాదాపు అన్ని పదార్థములు రుచి, వాసన మొదలగు సమస్త విధములా బాగున్నదని నిరూపణ గావింపబడినవి. ఈ శాస్త్రీయ పరిశోధనల వివరణ ఇస్తూపోయిన అదే ఒక గ్రంథ మగును. గాన ముఖ్యముగా తులసినిచేర్చి తయారుచేసిన పదార్థములకు క్వాలిటీయం

ఐరన్, మరియు విటమిన్ 'పి' అను మూడు, కొన్ని సందర్భాలతో మూడింతలు పెరిగినట్లు విదితమైన కొన్ని పట్టికలను మాత్రమిందు పొందుపర్చినాను.

తులసిరసము నందలి పోషక పదార్థములు :

| తేలిక పానీయములు | క్యాల్షియం మి.గ్రా. | ఐరన్ మి.గ్రా. | విటమిన్ 'పి' మి.గ్రా. |
|---|---|---|---|
| 1. తులసి పానీయము | 58 | 12 | 33 |
| 2 తులసిరసమునకు మిరియాలపొడి+ శొంఠిపొడి | 58 | 12 | 38 |
| 3. తులసి రసము + అల్లము | 58 | 12 | 38 |
| 4. తులసి రసము + బత్తాయిరసము | 75 | 12 | 43 |
| 5. తులసిరసము + టొమెటోరసం | 73 | 12 | 56 |

Juice : రసము




FIG : 1 CALCIUM CONTENT OF THE RECIPES




FIG 2 IRON CONTENT OF THE RECIPES




FIG : 3 VITAMIN C CONTENT OF THE RECIPES

అసలు పుట్టుకయేలేని పరమాత్ముడు నానావిధాలుగా పుట్టుచున్నాడు



## పదార్థములలో తులసిని చేర్చుటచే జనించిన పోషక విలువలు :

| పదార్థములు | క్యాల్షియం మి.గ్రా. మూలం | క్యాల్షియం తులసి 15% | క్యాల్షియం తులసి 30% | ఐరన్ మి.గ్రా. మూలం | ఐరన్ తులసి 15% | ఐరన్ తులసి 30% | విటమిన్ 'సి' మి.గ్రా. మూలం | విటమిన్ 'సి' తులసి 15% | విటమిన్ 'సి' తులసి 30% |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కాబేజీకూర | 100 | 142 | 184 | 4 | 14 | 26 | 4 | 37 | 70 |
| బీట్‌రూట్ కూర | 39 | 90 | 141 | 2 | 13 | 25 | 11 | 43 | 75 |
| ఉర్లగడ్డకూర | 30 | 82 | 135 | 1 | 13 | 25 | 18 | 49 | 80 |
| ముల్లంగికూర | 55 | 104 | 152 | 1 | 13 | 25 | 18 | 49 | 80 |
| తోటకూర | 470 | 465 | 459 | 29 | 37 | 45 | 102 | 120 | 139 |
| బచ్చలికూర | 146 | 189 | 232 | 14 | 24 | 34 | 31 | 60 | 89 |
| మెంతికూర | 468 | 462 | 458 | 20 | 29 | 38 | 55 | 80 | 106 |
| కందిబేడలు | 61 | 82 | 104 | 3 | 9 | 14 | 16 | 32 | 49 |
| పెసలబేడలు | 64 | 83 | 104 | 9 | 20 | 15 | 16 | 32 | 98 |
| వేరుశనగ చెట్నీ | 43 | 57 | 70 | 2 | 5 | 9 | 4 | 15 | 26 |
| కొబ్బెర చెట్నీ | 17 | 34 | 52 | 1 | 5 | 9 | 4 | 16 | 27 |
| గోగాకు చెట్నీ | 71 | 80 | 89 | 2 | 6 | 10 | 7 | 17 | 27 |
| వేపిన సెనగబేడల చెట్నీ | 33 | 48 | 63 | 4 | 7 | 11 | 4 | 7 | 11 |
| జొన్న మసాలారొట్టె | 258 | 308 | 359 | 10 | 21 | 32 | 26 | 39 | 92 |
| గోధుమ మసాలారొట్టె | 281 | 328 | 375 | 16 | 26 | 36 | 26 | 59 | 92 |
| గోధుమ + సెనగపిండి మసాల రొట్టె | 320 | 359 | 405 | 16 | 26 | 36 | 26 | 59 | 92 |
| టెమెటో సూప్ | 310 | 375 | 404 | 2 | 19 | 37 | 36 | 81 | 126 |
| కూరగాయల సూప్ | 74 | 144 | 214 | 2 | 20 | 37 | 32 | 77 | 123 |

దీనితో తులసి కేవలము పూజార్హమూగానో, వైద్యకీయమూగానో మాత్రమే వాడు మొక్క కాదు, భోజనపదార్థములలో కూడ తప్పక చేరవలసిన దానిగా నిర్ధారణ గావింపబడినది.

11) విద్యను దాచుకోవద్దు. అది పదిమందికి పంచు, అది మరింత రాణిస్తుంది

# మాన పరిభాష

## కాళింగమానము :

8 ఆవా లొక యవ
2 యవ లొక రక్తి
2 రక్తు లొక వల్లం
4 వల్లా లొక మాషం
4 మాషా లొక శాణం
2 శాణా లొక కర్షం
2 కర్షా లొక శుక్తి
2 శుక్తి లొక పలం
2 పలా లొక ప్రసృతి
2 ప్రసృతి లొక కుడవం
2 కుడవా లొక మానిక
2 మానిక లొక ప్రస్థం
4 ప్రస్థా లొక ఆఢకం
4 ఆఢకా లొక ద్రోణం (1024 తుల కొలతకు 25 1/2 పౌనులు)
2 ద్రోణా లొక శూర్పం (2048 తులములు)
2 శూర్పా లొక ఖారిక
100 పలా లొక తులము
20 తుల లొక భారం

## వ్రీహ్యాదిమానం :

4 వ్రీహులు ఒక గుంజ
5 గుంజ లొక పణం
8 పణా లొక ధరణం
2 ధరణా లొక కర్షం
4 కర్షా లొక పలం
100 పలా లొక తుల
20 తులా లొక భారం

## మాగధమానము :

| | |
|---|---|
| 30 పరమాణువులు | 1 త్రసరేణువు లేక వంశీ |
| 6 వంశీలు | 1 మరీచి |
| 6 మరీచులు | 1 రాజిక |
| 3 రాజికలు | 1 ఆవగింజ |
| 8 ఆవగింజలు | 1 యవ (1/2 గ్రైను) |
| 4 యవగింజలు | 1 గురిగింజ (2 గ్రైనులు) |
| 6 గురిగింజలు | 1 మాషము (1/16 తులము) |

---

నాయకుడు కావాలని ఎందుకు తహతహలాడుతావు? సేవకుడవమేందుకు పరితపించు

| | |
|---|---|
| 4 మాషములు | 1 శాణము (1/4 తులము) |
| 2 శాణములు | 1 కోలము (1/2 తులము) |
| 2 కోలములు | 1 కర్షము (1 తులము) |
| 2 కర్షములు | 1 అర్థఫలము (శుక్తి : 2 తులములు) |
| 2 అర్థఫలములు | 1 ఫలము (4 తులములు) |
| 2 పలములు | 1 ప్రసృతి (8 తులములు) |
| 2 ప్రసృతులు | 1 కుడవము - అంజలి (16 తులాలు) |
| 2 కుడవములు | 1 శరావము (32 తులములు) |
| 2 శరావములు | 1 ప్రస్థము (64 తులములు) |
| 4 ప్రస్థములు | 1 ఆడకము (256 తులములు) |
| 4 ఆడకములు | 1 ద్రోణము (1024 తుల. కొలతకు 25 1/2 పౌండ్లు) |
| 2 ద్రోణములు | 1 శూర్పము (2048 తులములు) |
| 2 శూర్పములు | 1 ద్రోణి (4096 తులములు) |
| 4 ద్రోణీలు | 1 ఖారీ |

### ప్రమాణములు :

| | | |
|---|---|---|
| 1 ద్రోణము | కి.గ్రా. 11.567 | పౌ. 25 1/2 |
| 2 ప్రస్తము | గ్రా. 746.483 | తు. 64 |
| 1 తులము | 11.664 | |
| 1/2 తులము | 5.832 | |

### కొలతలు :

| | | |
|---|---|---|
| 1 ద్రోణము | లీ. 11.475 | పౌ. 25 1/2 |
| 1 ప్రస్తము | మి.లీ. 730 | |
| 1 కుడవము | 183 | |
| 1 పలము | 46 | |

2 1/2 తులములు 1 ఔన్సు అనియు 16 ఔన్సులు 1 పౌను అనియు లెక్కించు కొనవలెను.

కొలతమానము :

| | |
|---|---|
| 60 మినిమ్‌లు | 1 డ్రాము |
| 8 డ్రాములు | 1 ఔన్సు |
| 16 ఔన్సులు | 1 పౌను |

ఆంగ్లేయమాన పరిభాష :

| | |
|---|---|
| 20 ఔన్సులు | 1 పైంటు |
| 8 పైంటులు | 1 గాలను |

మినిమ్ అనగా ఒక బిందువు. 1 టీ స్పూన్ అనగా ఒక డ్రాము

ఒక టేబిల్ స్పూన్ అనగా 4 డ్రాములు లేక 1/2 ఔన్సు

180 గ్రైనులు 1 తులము 437 1/2 గ్రైనులు 1 ఔన్సు

ఆంగ్లేయమానపరిభాష - తూనిక మానము

| | | | |
|---|---|---|---|
| 60 గ్రైనులు | 1 డ్రాము | 16 ఔన్సులు | 1 పౌను |
| 8 డ్రాములు | 1 ఔన్సు | 112 పౌనులు | 1 హండ్రెడ్ వెయిట్ |

## ప రి భా ష

స్వరసము : నీరు కలుపక తీసిన రసము

పంచ అంగములు : ఏదయినా ఒక వృక్షము లేక మొక్క తాలూకు అయిదు అంగములు, అవి : పట్ట, ఆకులు, పువ్వు, పండు, వేళ్ళు

తులసికి : ఆకులు, వేరు, పువ్వు (వెన్నులు), విత్తులు, చిన్నరెమ్మలుగా తెలియవలెను.

ఇక తులసిని ఏఏ వ్యాధులకు ఎలా యుపయోగించాలి అనుదానిని గురించి వివరింతును.

శ్లో॥ "పత్రాణాం తులసీపత్రం దారురూపేషు చందనమ్।
వృక్షాణాం కల్పవృక్షోయస్తం నమామి జగత్పితమ్॥"

MAN అంటే

M : అంటే మాయను జయించి

A : అంటే ఆత్మను దర్శించి

N : అంటే నిర్వాణమును అందుకొనేవాడు అని అర్థము

## మూడవ అధ్యాయము

# వ్యాధులు - నివారణపద్ధతులు

### అజీర్ణము

1) 20 గ్రాముల అల్లపురసము అంతే తులసిరసము కలిపి తేనెను కొద్దిగా చేర్చి తీసుకొనుచున్న జీర్ణశక్తి వృద్ధిచెందును.

2) తులసి పంచాగములను ఎండించి, మరీచములను కలిపి చూర్ణముగా తయారు చేసుకొని, వేడి నీటితో సేవించుచుండిన ఆకలిని వృద్ధిచేయును. ఇతరములైన జీర్ణకోశపు వ్యాధులుకూడ పోవును.

3) 20 గ్రాముల తులసిరసమునకు 2 1/2 గ్రాముల పిప్పలీమూలచూర్ణమును కలిపి సేవించిన జీర్ణశక్తి ఎక్కువగును.

4) తులసిరసము, మునగ ఆకురసమును కలిపి 25 గ్రాముల రసమును తయారించు కొని, కొద్దిగా సైంధవలవణమును చేర్చి సేవించిన జీర్ణశక్తి పెంపొందును. మలబద్ధకమును వదలగొట్టును.

5) ఒక టీ స్పూను తులసి, అంతే అల్లపురసము, దీనికి 1/2 స్పూను నిమ్మపండు రసము, 1/2 స్పూను పాత తేనె కలిపి (నీరు వేయకూడదు) భోజనానికి 15 నిమిషముల ముందుగా పుచ్చుకొనుచువచ్చిన మంచి జీర్ణశక్తి లభించును.

6) తులసిరసము ఒక టీ స్పూను కొద్దిగా పసుపునీళ్ళు (పచ్చి పసుపు రసము మంచిది) కలిపి త్రాగిన జీర్ణశక్తిని పెంపొందించును.

7) 10 గ్రాముల తులసిరసమునకు, 10 గ్రా. శుంఠిచూర్ణము, 20 గ్రా. పటిక బెల్లమును చేర్చి బాగుగా మర్ధనము గావించి కందిగింజ పరిమాణపు మాత్రలుగా తయారించి నీడను ఎండించి సీసాలో భద్రపరచుకొనవలెను.

వీటిని ముప్పూటలూ వేడినీటితో సేవించిన అరుచిని పారద్రోలి జీర్ణక్రియను వృద్ధిచేయును.

8) తులసి పంచాంగములను ఎండించి చూర్ణము గావించుకొని, దానికి మెరియాల చూర్ణమును కలిపి సేవించుతూ వచ్చిన మందాగ్ని నశించి మంచి ఆకలిని పుట్టించి అరుచిని పోగొట్టును. దీనికి తేనె కలపవచ్చును.

9) తులసీదళములకు ఉప్పును చేర్చి సేవించిన గుణకారిగాయుండును.

10) తులసిరసము శుంఠిచూర్ణము, పాతబెల్లము కలిపి మర్థించి మాత్రలు తయారించుకొని, రోగినిబట్టి వాడిన, అజీర్ణం, మందాగ్ని గుణమగును.

## అతిసారము : Diarrhoea

1) తులసి, పుదిన, ఏలకులు, కలిపి సేవించిన అతిసార భేదులు గుణమగును.

2) తులసి ఆకులచూర్ణము 2 మాషలు, వేయించిన జీలకర్ర 4 మాషలు, మారేడు గుజ్జు 2 మాషలు, బిడాలవణము (నలుపు) 1 మాషము, యీఅన్నింటిని కొద్దిగా పెరుగుతో కలిపి సేవించిన భేదులు త్వరగా తగ్గును.

3) తులసి పంచాంగములు, జాజికాయ కలిపి సేవించిన భేదులు నిలిచిపోయి, జీర్ణ శక్తిని వృద్ధిపరచును.

4) తులసిదళములు, మరీచములు, వాము, వెల్లుల్లి, సైంధవ లవణము, మంచి కర్పూరము వీటిని సమభాగములుగా గ్రహించి చూర్ణముచేసి, సెనగగింజ పరిమాణపు మాత్రలుగా తయారించి, రోజూ మూడుమార్లు మజ్జిగతో సేవించిన అతిసారము, రక్తాతిసారము నిలిచిపోవును.

5) తులసి పంచాంగముల కషాయమునకు 3 గ్రా. జాజికాయ చూర్ణమును కలిపి సేవించుచున్న అజీర్ణభేదులు నిలిచిపోయి. జీర్ణశక్తిని పెంపొందించును.

6) తులసిదళములలో కొద్దిగా కర్పూరముచేర్చి నూరి కుంకుడుగింజ పరిమాణమంత మాత్రలు తయారుచేసి, పూటకు ఒకటిచొప్పున రోజూ మూడుపూటలు వాడిన కలరాభేదులు నిలిచిపోవును.

7) వనతులసి విత్తులను చూర్ణించి సేవించిన అతిసారము పోవును.

8) తులసీదళము, పట్ట, లేక కాండములనుగాని చూర్ణించి వాడిననూ తులసీదళముల కషాయముచేసి వడకట్టి ఆవునేయితో కలిపి ఖండచక్కెర చేర్చి సేవించిన ఆమాతిసారము పోవును.

9) వనతులసిదళములను కషాయముగాకాచి నేతితో గోళించిన-నేతితో వేయించిన వచ ఆకుల చూర్ణమును, రుచికి ఖండచక్కెర చేర్చుకొని సేవించిన ఆమాతిసారములు నిలిచిపోవును.

## అర్శోరోగము : మూలవ్యాధి : Piles

1) తులసి చూర్ణము 10 గ్రా. వంతున ప్రతిదినం ప్రొద్దునా, సాయంత్రంవాడిన మూలవ్యాధి నెమ్మదించును.

2) తులసివేరు. వేపగింజలలోని పప్పు యీ రెండు సమభాగములుగా 1/2 మాష ప్రమాణముగా కలిపి మజ్జిగతో సేవించిన చాలమంచిది.

3) తులసిదళములు 10 గ్రా. చూర్ణమును ప్రొద్దునా సాయంత్రం మజ్జిగతో సేవించుచూ, మొలలకు తులసిరసమును అంటించుట, తులసిని బాగానూరిన గంధమును మొలలపై వుంచి కౌపీనము ధరించిన మంచిగుణకారిగా నుండును.

4) అంతర తామర (నీళ్ళమీదనే తేలియాడుచుండును) తులసి ఈ రెండింటిని నాన వేసిన పెసరబేడలలోవేసి, పచ్చిమెరప, కొత్తిమ్మెర మొదలుగునవి వేసి, నేతితో వుడికించి వడలుగా తయారించుకొని ఎక్కువగా తిన్న మొలలుపోవును.

5) చేదుపుచ్చ (ఇంద్రాణి) కాయలు 10-15 వరకూ సంపాధించి, వాటిని చిన్న ముక్కలుగా తరిగి బచ్చలిలో బండపైగాని లేక పెడెల్పాటి మూతగల ప్రాతలో గాని వేసి, దానిపై మొలలున్న వ్యక్తి తొక్కుచూయుండిన దాదాపు ఒక గంట లోపల అతని నోటిలో చేదురుచి కనబడును. తర్వాత కొంతసేపు విశ్రాంతి

తీసుకొన్న దుర్వాసనతో మంచి భేది ఒకమారుఅగును. అప్పటినుంచి మొలల బాధ యుండదు.

6) మొలలు ఎక్కువగా బాధించుచున్నచో వేడిగాయున్న పాలలోనికి ఒక టీ స్పూను నెయ్యివేసి బాగాకలిపి వేడివేడిగాత్రాగిన 15 నిమిషములలో బాధనెమ్మదించును.

మొలలున్న వ్యక్తి తప్పక భోజనానంతరము ఒకగ్లాసు మజ్జిగ త్రాగుచుండుట చాలామంచిది. ప్రతిదినము పరిగడుపున నిద్రలేచిన వెంటనే ఒంటికి పోయకనే కుండలో నిల్వయున్న నీరు ఒకగ్లాసు త్రాగవలెను. మలబద్ధకము లేకుండా చూచు కొనవలెను.

7) తులసి విత్తులను నీటిలో ప్రొద్దున నానవేసి, సాయంత్రము సేవించవలెను. అలాగే రాత్రి నానవేసి ప్రొద్దున సేవించిన మూలవ్యాధి గుణమగును.

8) తులసిదళములను ప్రతిదినం తినుటచేగాని, తులసిరసమును ప్రతిదినం త్రాగుటచే గాని మూలవ్యాధి బాధలు బాగుగా తగ్గును.

9) గాడిదకడపలకు బాగానూరిన గంధమును మొలలకు అంటించుతూవచ్చిన మొలలు వూడి పడిపోవును.

10) బృహతీ వాశ్యగన్ధా చ పిప్పల్యః సురసా ఘృతమ్
వాకుడు విత్తులు, పెన్నేరుగడ్డ, పిప్పళ్ళు, తులసి వీనివి మెత్తగానూరి నేతితో కలిపి దూపమువేసిన అర్శస్సు నెమ్మదించును.

## ఉబ్బసము : తమకశ్వాస : Asthma

1) కృష్ణతులసి సమూలముగా పైననూ లేక ముదురు కొమ్మలు. రెమ్మలు తీసుకొని ముక్కలు ముక్కలుగా చితగకొట్టి వెన్నులు, కాడలు, ఆకులు వేరువేరుగా వేయించిన తర్వాత కరక్కాయలు, సన్నదుంప రాష్ట్రము, లావుదుంప రాష్ట్రము సీమకరక్కాయలు, నల్లజీలకర్ర, కురంజివాము, కురాసానివాము, మంచివాము

మోదుగమాడలు, ఆకుపత్రి, తాళీసపత్రి, సునాముఖి, వాయువిడంగములు, మిరియాలు, పిప్పళ్ళు వీటిలో మిరియాలు, పిప్పళ్ళు సగము తగ్గించవలెను. నల్ల జీలకర్ర, దుంపరాష్ట్రం, కరక్కాయలు యీ మూడును ఎక్కువగాయుండవలెను. ఈ వస్తువులన్నియూ వేరువేరుగా దోరగా వేయించవలయును. అన్నివస్తువులను నలుగగొట్టవలెను. రెండు మానికలు నీళ్ళుపోసి, వీటిని బాగుగా ఎనిమిదోవంతు అనగా సోలెడు నీళ్ళకు కషాయము మిగులునట్లు కాచవలెను.

ఈ కషాయమును రోజూ ఉదయము రెండున్నర తులములు (ఒక ఔన్సు లేక 30 మి.లీ.) సాయంకాలము ఒక ఔన్సు వంతున పుచ్చుకొనుచుండవలయును. పసిబిడ్డలకు తక్కువ మోతాదుతో వాడవలెను. పెద్దలకు - పిల్లలకు యున్న ఉబ్బసము వ్యాధి ఒకమండలము అనగా 40 రోజులు వాడిన మంచి ఫలిత ముండును. ఇచ్ఛాపథ్యము.

2) నక్షాద్రాః కఫ కాసఘ్నాః సురసస్యాసితస్యచ॥
కఫజ కాసయందు శుక్లతులసీ పత్ర స్వరసమునందు తేనె గలిపి సేవించిన శమించును. (చ-చి-అ 22)

3) తులసి పువ్వుల (వెన్నులను)ను అల్లపురసముతో మర్దించి శనగగింజ పరిమాణము మాత్రలను తయారుచేయవలయును. పూట కొక మాత్రచొప్పున మూడు పూటలూ మంచినీళ్ళతో సేవించిన దగ్గులు తగ్గిపోవును.

4) తులసి పంచాంగములు, అడ్డసరపు (వాసక) ఆకులు, సైంధవలవణము, సమాంశములుగా కలిపినూరి ఒక రత్తి తూకపు మాత్రలు తయారుచేసి నీడను ఎండించి భద్రపరచుకొనవలెను. దినమునకు మూడుమార్లు పూటకు ఒక్కమాత్ర వంతున తేనెతో సేవించిన ఉబ్బసము గుణమగును.

5) తులసి ఆకురసమునకు శొంఠి, తేనె, నీరుల్లి రసములను కలిపి సేవించిన శ్లేష్మమును హరించి, శ్వాసకాసలను పోగొట్టును.

6) తులసి, వాసక ఆకురసము సమభాగములు, పూటకు అరతులం వంతున రోజూ రెండు పూటలు తేనెతో సేవించిన అన్నిరకముల దగ్గులు హరించిపోవును.

7) తులసిదళములు, ములక, శొంఠి, గంటుభారంగి, తిప్పతీగ, వీటిని సమభాగము లుగా గ్రహించి, నీటినిచేర్చి, నూరి కషాయముగా తయారించి దీనికి పిప్పలీ చూర్ణమును చేర్చి సేవించిన శ్వాసకాసలు గుణమగును.

## ఉదర వ్యాధులు

1) తులసి విత్తుల చూర్ణము పావుతులము, పటికబెల్లపు చూర్ణము అరతులం కలిపి ఒకమోతాదుగా రోజూ రెండుపూటలు తింటూ యుండినయెడల కడుపునొప్పులు, ఉబ్బరములు హరించిపోవును.

2) తులసి స్వరసము ఒకస్పూను, అంతేపరిమాణము అల్లపురసముతో కలిపి పొంగు కషాయముగా తయారించి సేవించిన కడుపునొప్పి వెంటనే శమించును.

3) ప్రతిదినమూ 20 తులసి ఆకులు నమిలి మింగుచున్న కడుపునొప్పిపోవును.

4) తులసి ఆకులను నీడను ఎండించి చూర్ణము చేసుకొని భద్రపరచుకొనవలెను. ప్రతిదినం ప్రాతఃకాలమున పావుతులం చూర్ణమును పావుశేరు పచ్చి ఆవుపాలతో కలిపిపుచ్చుకొనుచున్న కడుపులోని మంటలు హరించును.

5) తులసి, వేపపట్ట, మిరియాలు, పిప్పళ్ళు సమభాగములుగా గ్రహించి చూర్ణించి నిల్వచేసుకొనవలెను. 5గ్రా. చూర్ణమును నీటితో ప్రాతఃకాలమున సేవించిన ఆమ్లపిత్తము నయమగును.

6) తులసి ఆకులు ఒకతులం, తుమ్మాకు తులం ,ఉశిరికఆకు తులం, తులసీదళములు రెండు తులములు, వీటిని బాగుగా ఎండించి, యవక్షారం ఒకతులం, సర్జక్షారం తులం, సైంధవలవణం తులం, సౌవర్చలవణం తులం, బిడాలవణం తులం. సముద్రలవణం తులం, కాచలవణం తులం, పిప్పళ్ళు తులమున్నర, మిరియాలు తులమున్నర, తుంగముస్తలు తులమున్నర, వీటినికలిపి చూర్ణించి వస్త్రగాళితము గావించి భద్రపరచవలెను.

పూటకు అరతులం వంతున మంచినీళ్ళ అనుపానముతో రోజు రెండుపూటలా సేవించుచుండిన ఉబ్బరములు, శూలలు, గర్భవాతముపోయి, జీర్ణశక్తి బాగుగా వృద్ధిపొందును. ఇంతేగాక అన్నిరకములైన ఉదరవ్యాధులు నెమ్మదించును.

7) తులసిఆకుల రసంతో శొంఠి చూర్ణమునుచేర్చి ఉపయోగించిన కడుపునొప్పులు తగ్గును.

8) తులసి ఆకులు రెండున్నర తులములు, అర్ధశేరు నీళ్ళలోవేసి, పావుశేరు మిగులు నట్లు మరగకాచి, పూటకు అయిదు తులముల చొప్పున ఇచ్చుచుండిన చిన్నపిల్లల ఉదరవ్యాధులన్నియూ హరించిపోవును.

9) పార్శ్వశూలయందు తులసిరసము, అల్లపురసమునకు పుష్కరమూల చూర్ణముచేర్చి వేడిచేసి లేపనము చేయవలెను.

10) తులసి విత్తులు సోనాముఖి కలిపి కషాయము కాచి సేవించిన కడుపు ఉబ్బరము వెంటనే తగ్గును. ఒకటి, రెండు భేదులు కావచ్చును.

## ఉ న్మా ద ము

1) తులసి దళములను ప్రతిదినం మూడుపూటలా నమిలి తినుట, మరియు తులసి రసమును శరీరాధ్యంతము రుద్దుటచే కఫజ, వాతజ ఉన్మాదములు నాశనమగును.

2) తులసి ఆకులు, దేవదారు ఆకులు, సమాంశములుగా గ్రహించి నూరి లేపించిన అరికాలు - అరచెయ్యి మంటలు చల్లారును.

## కడుపులోని బల్లలు హరించుటకు

1) చిన్నపిల్లలలో యకృత్ (Liver) సంబంధమైన రోగములకు తదితర అజీర్ణ రోగములకు, తులసి ఆకుల తేలిక కషాయము (Not Strong) నిచ్చిన వానిని పోగొట్టి, పొట్టకు బలమును, దీపనశక్తిని కలిగించును.

2) తులసిఆకు రసమును పూటకు తులం చొప్పున రోజూ రెండుపూటలా త్రాగు చుండినయెడల, చిన్నపిల్లల కడుపు పెద్దదిగాయుండి కాళ్ళు, చేతులు సన్నబడి ఈసురోమని యున్న పిల్లలు ఆరోగ్యవంతులగుదురు.

3) తులసి ఆకుల రసమునకు అల్లపురసము కలిపి తేనెతో వాడిన బల్లలు హరించి పోవును. కనీసం ఒకనెలనుంచి మండలము (40 రోజులు) వరకు వాడవలెను. మంచి ఫలితముండితీరును.

మన్నుతిను అలవాటున్న పిల్లలకు ఈ వ్యాధివచ్చు అవకాశము ఎక్కువగాన పిల్లలు మన్నుతినకుండా చూచుకొనవలెను.

## కంటి రోగములు

1) కృష్ణతులసి రసమును రాత్రివేళలో రెండుచుక్కలు చొప్పున మూడు రాత్రులు కన్నులలోవేసిన రేచీకటి తగ్గును.

2) పోధకి అనగా కంటిరెప్పలలో చిన్నపొక్కులవలె లేచును. దానికి తులసిరసమూ వెల్లుల్లిరసము కలిపి కంటిరెప్పలకు రుద్దిన పోధకి పోవును.

3) తులసిరసము తేనె కలిపి కంటి చుక్కలుగా సకల కంటిరోగము లందును వాడ తగును.

4) తులసి ఆకులు 10గ్రా., 50గ్రా. నీటిలోవేసి అర్ధభాగము లేక మూడవవంతు మిగులునట్లు కాచి, ఇందులోనికి తగు పాళ్ళలో చక్కెర, పాలు కలిపి కాఫీవలె త్రాగుచూ ప్రవాళము, చుంచెలుకపెంటిక, తేనెతో నూరి కాటుకవలె ఉపయోగించిన రేచీకటి గుణమగును.

5) తులసి రసములో మోదుగగింజ భావనచేసి, తర్వాత అందులోనే నూరి కాటుకవలె వాడిన కంటిపొరలు హరించును.

6) తులసి దళములను ఆవు వెన్నతో చిన్న సెగమీద వెచ్చచేసి, కంటిపైవుంచి కట్టుకట్టిన, కంటిరెప్పలమీద లేచు మొటిమలు, వాపులు, కండ్లు మెరమెరలాడుట, నీరుకారుట, ఎరుపు, కండ్లు అంటుకొనుట మొదలగు అనేక కంటిరోగములు పోవును.

## కుష్ఠము

1) రామతులసి రసమును దీర్ఘకాలము సేవించుతూ యుండిన కుష్ఠరోగమున గుణమగపడును.

2) గజకర్ణ కుష్టమున తులసిరసము ఆవునెయ్యి (దొరికిన పాతది) సున్నమునుచేర్చి లేపనముచేసిన మంచి ఫలితముండును.

3) తులసిని నిమ్మరసముతో మర్ధించి లేపనముచేసిన దద్రుదువ్యాధి గుణపడును.

4) తులసి రసము, ఆవునెయ్యి, సున్నపురాయి వీటిని కంచుపాత్రలోవేసి మర్ధించి తయారుచేసిన లేపనమును (Ointment) లేపించిన దద్దులు పోవును.

5) తులసిదళములు, ఎఱ్ఱమన్నుతో మర్ధించి లేపించిన దురద - దద్దులు శమించును.

6) కృష్ణతులసి చూర్ణమున నిమ్మరసముచేర్చి మర్ధించి లేపనము చేసిన త్వచా రోగములు శాంతించును.

7) తులసి రసము, సైంధవలవణము కలిపి మర్ధించి లేపించిన శీతపిత్తము (Urtecaria) గుణమగును.

8) 500 గ్రా. తులసి ఆకులకు కొద్దిగానీరువేసి బాగుగా రుబ్బి రసమును తీయాలి. ఈ రసమునకు సరిసమానముగా నువ్వులనూనెను కలిపి మందాగ్నితో తైలపాకముగా వండి, వడగట్టి గాజుసీసాలో భద్రపరచు కొనవలయును. అన్నివిధములైన చర్మవ్యాధులకు ఈ నూనెను లేపించవచ్చును.

తులసివేళ్ళు, శొంఠి, సమభాగములుగా కలిపి చూర్ణించుకొని తేనెతో రెండు పూటలా సేవించుచూ, పైతైలమును ప్రతిదినమూ రెండుపూటలా లేపించుచున్న ఘోరమైన కుష్ఠ కూడ గుణమగును. ఈ చికిత్సను విడువకుండా ఒక సంవత్సరము కొనసాగించవలయును.

## క్రిమి రోగము (Worms)

చిన్న పిల్లలు ముఖ్యముగా బెల్లము, చక్కెర, చాకలెట్లు మొదలగు తీపి పదార్ధములు ఎక్కువగా తినువారికి క్రిమివ్యాధి వచ్చును. కొందరు పిల్లలు మన్ను

తినుచుందురు. అటువంటివారికి, సాకుడు కుక్కలనుంచి ఇంతేగాక కొన్ని ఆకుకూరలు మొదలగువాటిద్వారాకూడా వచ్చును. లెట్రిన్‌కు పోయివచ్చిన తర్వాత చేతిని సరిగ్గా శుభ్రము చేసుకొనక (సోపుతో చేయి కడుగుకోవాలి) పోవుటకూడా ఒక ముఖ్య కారణముగా తెలుసుకొనవలెను.

క్రిమిరోగమున్న పిల్లలు ముఖ్యముగా నిద్రలో పండ్లు (Teeth) కొరుకుచుందురు. ముక్కుకొనన తీటయుండి గోకుకొనుచుందురు. కొద్దిదూరము నడచిన పిక్కలలో నొప్పి అని నడవక ఎత్తుకొనమని మొండికేతురు. పిల్లలు చాల నిరుత్సాహముతో నుందురు. కొందరికి Fits కూడా రావచ్చును.

1) కేవలము తాజా తులసిరసము ప్రతిదినం రెండుపూటలా సేవింపచేసిన క్రిములు పడిపోవును. దీనికి అల్లపురసము చేర్చి వేడిచేసి సేవించిన గుణవత్తరముగా నుండును.

2) తులసిదళములు, వాయువిడంగములు కలిపి నూరి సేవించిన అన్ని విధములైన క్రిములు చచ్చి బేధిలో పడిపోవును.

3) తులసి రసమును కొద్దిగా వేడిచేసి మిరియాల చూర్ణమును కలిపి సేవించిన కడుపులోని క్రిములుపోవును.

4) తులసి ఆకులు 10, వేపాకులు 10, మిరియాలు 4-5 గింజలు, చిటికెడు పసుపు, చిటికెడు క్రిమిముద్గర రసముకలిపి నూరి ప్రతిదినం ప్రాతఃకాలమున పరిగడుపున 40 రోజులు (ఒక మండలము) సేవించిన అన్నివిధములైన క్రిములు నశించి పోవును. అమీబియాసిస్ రోగులు తప్పక వాటి గుణమును పొందవచ్చును. నా అనుభవము.

5) తులసి రసమును ముక్కురంధ్రములకు పేసిన తలలోని పేలు-పేనులు పోవును.

## గర్భ నిరోధానికి

1) స్త్రీ బహిష్ఠు ఆయిన దినమునుంచి మూడురోజులవరకు ప్రతిరోజూ ప్రాతఃకాలమందు తులసి ఆకుల కషాయము ఒక టీ కప్పు త్రాగుచుండినయెడల ఆ స్త్రీకి యెన్నటికీ సంతానము కలుగదు.

2) 1970వ సం॥లో డాక్టరు భట్ట మరియు శాంతకుమారిగార్లు జరిపిన అనేక ప్రయోగముల మూలకముగా తులసి యందలి (Benzene Extract) బెంజయిన్ ఎక్స్ట్రాక్టు అనునది అంత్యంత సంతాన నిరోధకశక్తిని కలిగించునని 80% వరకూ ఈ శక్తి కలదని తెలియుచున్నది. దీనికి తోడుగా Petroleum ethor Extract 60% కూడా యున్నది.

## చలిజ్వరము (మలేరియా జ్వరము)

మలేరియా జ్వరము ఇండియాలో అనేక ప్రాంతాలలో సర్వసాధారణముగా వచ్చుచున్నది. దీనికి ఇతర వైద్యులు 'క్వనైన్' మందుగా వాడుట జరుగుచున్నది. దీనిచే జ్వరము తగ్గును. కాని తలనొప్పి, చెవులలో హోరుమనుశబ్దము, తలతిరుగుట చెవుడు - మొదలుకొని హృదయ సంబంధ వ్యాధులవరకూ కాంప్లికేషన్సుగా అగపడుచున్నవి. తులసి ఈ జ్వరమందు అత్యుత్తమమైన సేవచేయుచున్నది.

1) 7 మిరియాలు, 7 తులసి ఆకులు కలిపి నమిలి మ్రింగుచున్న మలేరియా జ్వరము మూడురోజులలో హరించును.

2) మానిపసుపు, పిప్పళ్ళు, వెల్లుల్లి, జీలకర్ర, శొంఠి, తులసి, నారింజ పిందెలు, వావిలివేళ్ళు, ఆకుపత్రి వీటిని సమభాగములుగాకలిపి చూర్ణించి పూటకు అరతులం వంతున ఇచ్చుచుండిన చలిజ్వరములు గుణమగును.

3) తులసి ఆకులు 60 గ్రా. కొద్దిగా మందార పుష్పదళములు, అలాగే కొద్దిగా దత్తూర పుష్పదళములు, మిరియాలు 10 గ్రా. కొద్దిగా వీరువేసి బాగుగా మర్ధించి, బఠాణీగింజ పరిమాణముతో మాత్రలు తయారించి చలిజ్వరము వచ్చుటకు ఒక గంట ముందుగా రెండు మాత్రలు తిన్న జ్వరము రాకుండానేపోవును. అలాగే దినముమార్చి దినము వచ్చు మలేరియా (Intermetent fevers) జ్వరము లందును మంచిగుణకారియై యుండును.

4) మలేరియా జ్వరము మొండిగా ప్రతిసంవత్సరము సీజనల్‌గా వస్తూనేయున్న - తులసి దళములు, మిరియాలు, నీటిలోవేసి ఉడికించిన కషాయమునకు (డికాక్షన్)

కొద్దిగా బెల్లము, నిమ్మరసము కలిపి వేడిగాయున్నపుడే కాఫీవలె త్రాగి, రగ్గుకప్పు కొని పరుండవలెను. ఇలా మూడుగంటలకు ఒకమారు వంతున చేయుచున్న మంచి ఫలితముండును.

5) తులసి ఆకులు, వేపచిగుళ్ళు, మిరియాలు కలిపి తినవచ్చును

6) 10 గ్రా. తులసిదళ రసము, ఒక గ్రాము మిరియాలపొడిని కలిపి కొద్దిగా తేనెతో సేవింపవచ్చును.

7) తులసివేళ్ళ కషాయము త్రాపిన బాగుగ చమటపట్టి చలిజ్వరము వెంటనే తగ్గును.

8) 10 గ్రా. తులసి రసము, 5 గ్రా. అల్లపురసము కలిపి వాడిన చలిజ్వరమున మంచి ఫలితముండును.

9) కృష్ణతులసి మొక్క వేళ్ళు సేకరించి ముద్దగా దంచి, రెండు తులముల ముద్దను అర్ధశేరు నీళ్ళలో వేసి పావుసేరు మిగులునట్లు మరగకాచి, వడగట్టి, పూటకు 1/2 పావు కషాయము వంతున రోజు రెండుపూటలు సేవించిన చలిజ్వరములు నిశ్చయముగా పోవును.

10) కుప్పింటాకును చేతితో నలిపి బొడ్డుపైవేసి కట్టి, తరువాత చేతిలో అరతులం తులసిఆకు రసం, అణా ఎత్తు నువ్వులమానె వేసి కలిపి చలిజ్వరము వచ్చినవారి చేత నాకించాలి. ఈ విధముగా చలిజ్వరము వచ్చేముందు నాలుగైదు రోజులు చేయుచుండిన చలిజ్వరము పోవును.

11) మలేరియాజ్వరము ఒకవ్యక్తిని ప్రతిసంవత్సరము బాధించుచున్నయెడల, తులసి పుదిన, అల్లము వీటి రసము ఒక్కొక్కటి 5గ్రా. వంతున కలిపి త్రాగుచున్న మంచి గుణకారిగా యుండును.

12) తులసిదళములు 5, మిరియాలు 7 కలిపి ప్రతిదినమూ ప్రాతఃకాలమందు నమలి తినుచుండిన కొన్నిదినములలో చలిజ్వరము నిశ్చయముగా నిలిచిపోవును.

13) పొంగించిన పటికను కల్వమునవేసి తిప్పతీగె కషాయముతో మెత్తగ మర్దించి రేగుగింజ పరిమాణపు మాత్రలు తయారుచేయవలయును. తరువాత సొప్పు

గింజలు 1/4 తులము, తులసిదళములు 15, మిరియాలు 8 కచ్చాపచ్చాగా నలుగగొట్టి 1/4 శేరు నీళ్ళలోవేసి కషాయముకాచి, అందు కొంచెము పాలు, పటిక బెల్లము కలిపి - టీ. కాఫీలవలె తయారుచేసి, పైన చెప్పిన (పటిక) మాత్రను ఒకటి మ్రింగి యీ తులసీదళముల కాఫీని త్రాగవలయును. ఇట్లు ప్రతిదినము మూడు పూటలా సేవించుచుండిన యెడల మలేరియా జ్వరము (అందులోని రకములు) రోజు విడిచి రోజు వచ్చు వరుస చలిజ్వరములు, ఇతరములైన జ్వరములు, 4 - 5 రోజులలో నిస్సందేహముగా హరించిపోయి శరీరము తేలికపడును.

14) అప్పుడే కోసిన తులసి ఆకులు 5, మిరియములు 4, కలిపి పరిగడుపున వారమునకు రెండుమార్లు తినుట నియమముగా యుంచుకున్న మలేరియా జ్వరము అసలు దరిచేరదు. చిన్నపిల్లలకు తక్కువ మోతాదులో దీనినే వాడతగును.

15) కృష్ణతులసి ఆకు 5 తులములు, మిరియాలు ఒక తులం, యీ రెండూ కలిపి మర్ధించి బఠాణిగింజంత మాత్రలు తయారుచేసి, పూట కొక్కటి వంతున ఇచ్చి వేడినీళ్ళు త్రాగించవలయును, చలిజ్వరమునందు పూటకు రెండుమాత్రలు వాడవలయును, దీనివలన సాధారణ జ్వరములు, మలేరియా జ్వరములు తప్పక గుణపడును.

16) తులసి ఆకులు 10, మిరియములు 4, జిల్లేడు పువ్వులు 2-3, ఒక వెల్లుల్లిపాయ, వంతున చేర్చి నూరి మాత్రచేసి, జ్వరమువచ్చి విడిచినతర్వాత వాడుతూవచ్చిన చలిజ్వరములు, మన్యపు జ్వరములు అరికట్టబడును.

17) తులసి ఆకులు 100 గ్రా., జాజికాయ 10 గ్రా., మిరియములు 10 గ్రా., చిన్నమిరియాలు 10గ్రా. వీటిని బాగుగా చూర్ణించి కొద్దిగా వేపబంక నీళ్ళు కలిపి నూరి, బఠాణిగింజ పరిమాణముతో మాత్రలు తయారించి నీడను ఎండించి సీసాలోనిల్వ చేసుకొని, సాధారణ జ్వరములందును, చలిజ్వరములందును మూడుగంటలకు ఒకమాత్ర వంతున రోజుకు 3-4 మార్లు వరకు వాడతగును.

18) సీడను ఎండించిన తులసి ఆకులను అగ్నితో కాల్చి భస్మముచేసి 15 గ్రా. తీసు కొని, దానికి ఒక గ్రాము ఏలకులు, ఒక గ్రాము దాల్చినచెక్క, ఒక గ్రాము లవంగాలు, ఒక గ్రాము అతిమధురము కలిపిదంచి చూర్ణము చేసుకొనవలయును యీ మిశ్రమాన్ని 100 గ్రా. ఉడుకుచున్న నీటిలోవేసి రెండు నిమిషముల తర్వాత పొయ్యిమీదనుంచి దించి వడకట్టి పాలు, చక్కెర కలుపుకొని త్రాగ వలయును. సర్వ జ్వరములకు మంచిది. ముఖ్యముగా చలిజ్వరములందు వాడ తగును. 3-4 రోజులలోనే జ్వరము విడిచి, లోగికి ఆకలిపుట్టి, శక్తిని పుంజు కొనును.

19) తులసిదళములు 10, మిరియాలు 10, వేలవేము ఒక తులము. పుదిన అరతులం ధనియాలు ఒక తులం వీటిని 20 తులముల జలముతోచేర్చి 5 తు. మిగులునట్లు కషాయము కాచి, ఒక తులం శర్కర చేర్చి సేవించిన చలిజ్వరములు గుణమగును.

20. కృష్ణ తులసిదళములు, నల్లమిరియాల చూర్ణము, దత్తూరుమొక్క వేరు యొక్క తొగటు, అలాగే జిల్లేడు వేళ్ళమీది పొట్టు వీటిని కొద్దిగా నీరువేసి మర్ధించి మాత్రలు తయారుచేయవలెను. కందిగింజ పరిమాణమున్నచాలును. మలేరియా జ్వరము వచ్చును అను సూచన కనబడినవెంటనే 2-3 మాత్రలు వేసుకొని నీరు త్రావిన మంచి ఫలితముండును.

శంఖమున పోసిననే తీర్థము, అన్న - ఒక్కమాట - ఇంపీరియల్ మలేరియా కాన్ఫ్రెన్స్‌వారు తులసి మలేరియా జ్వరమున అత్యద్భుతముగా పనిచేయునని స్థిర పరచినారు.

## చర్మవ్యాధులు

1) తులసి, వేప, పసుపు, నిమ్మ, తమలపాకులను మన బుద్ధిమంతనముతో జోడించి యుపయోగించినచో మేలుకాని చర్మవ్యాధులుండునా - ఆలోచించండి.

2) తులసి అత్యంత క్రిమి నాశిని. చనిపోయిన శరీరాన్ని (శవాన్ని) తులసీవనములో నుంచిన కుళ్ళదు అని ఆయుర్వేదము చెబుతున్నది. కేవలము ఇంటి ఆవరణలో తులసి మొక్కలను పెంచినంత మాత్రముననే ఆ ప్రాంతమునకు తేళ్ళు, పాములు రావని పెద్దల వాక్కు.

3) తులసి పంచాంగములు నీడను ఎండించి చూర్ణించి వస్త్రగాళితము గావించుకొని, భద్రపరచుకొని, రోజూ రెండుపూటలా తేనెతో కలిపి సేవించిన, రక్తము శుద్ధిని పొంది, సర్వ చర్మరోగములు నెమ్మదించును. ఆరోగ్యవంతులు వాడిన చర్మ రోగములు వారి దరిచేరవు.

4) తులసి ఆకులు, విత్తులు సమభాగములుగా కలిపి నిమ్మపండు రసముతో మెత్తగా నూరి, శరీరమునకు పట్టించిన గజ్జి, చిడుము, దురదలు హరించిపోవును.

5) ఒక రాగి ప్రాతలో పావుశేరు నిమ్మరసము పోసి 24 గంటలు నిలువవుంచి, అందులోనికి అర్ధపావు తులసిరసము, అర్ధపావు నల్లకపివెంద ఆకులరసము పోసి కలియబెట్టి 24 గం. ఎండలో యుంచవలయును. తర్వాత దీనిని ఒక గాజు సీసాలో భద్రపరచుకొని, ప్రతిరాత్రి నిద్రించుటకు ముందు ముఖానికి కొంచెము యీ ఔషధమును మర్దనము గావించుకొని, ఉదయము లేచుటతోడనే వేడినీళ్ళతో కడుగుకొనుచుండిన యెడల చర్మముపై వుండే మచ్చలు, పొక్కులు హరించి చర్మమునకు కాంతి, అందము, తేజస్సు కలిగించును.

6) తులసి, తమలపాకులు, ఎర్రకాచు, మిరియాలు, సున్నము సమభాగములుగా కలిపి నూరి లేపనము చేయుచున్న నాగసర్పి అను చర్మరోగము హరించిపోవును.

7) తులసి ఆకులను నిమ్మపండు రసముతో మర్దించి తయారించిన కల్కమును పూసిన గజ్జి, తామర, మొదలగు చర్మ రోగములు పోవును. వ్రణములకు పట్టించిన పురుగులు పడిపోయి వ్రణములు శుభ్రపడి శీఘ్రముగా మానును. ముఖమునకు పట్టించిన నల్లమచ్చలు పోయి అందమును కలిగించును. బొల్లిపై అంటించిన మంచిగుణము కనబడును.

8) తులసి ఆకుల రసము, ఆవునెయ్యి పసుపు, పాదరసము వీటినికలిపి నూరి శరీరమునకు లేపనము గావించిన దురద, గజ్జి, చిడుము మొదలగు చర్మవ్యాధులు నశించిపోవును.

9) తులసి ఆకుల చూర్ణమును వస్త్రగాళితముచేసి దానికి కొద్దిగా పటిక చూర్ణము కలిపి నూరి, అప్పుడే తెగిన గాయములకు వాడిన రక్తముకారుట వెంటనే ఆగి, గాయము మేలగును.

10) శరీరమున పుండ్లులేచి, రక్తము, చీము కారుట, దుర్వాసన వచ్చుట, క్రిములు కనబడుట జరుగవచ్చును. అటువంటి సమయమున తులసి, వేప, పసుపు కలిపి నీటిలోవేసి బాగుగా కాచి, భరించదగిన వేడిగాయున్న ఈ కషాయముతో వాటిని బాగుగా కడుగుట, కాపడముచేయుట, వీటి (Paste) గంధమును వాటిపై వేసి కట్టు కట్టుట చేసిన క్రిములు పడిపోవును. చీముకారుట ఆగిపోవును. పుండ్లు శుభ్రపడి చాలా త్వరగా మంచిగుణము నిచ్చును.

11) తులసి రసమునకు సమముగా కొబ్బెరనూనెను కలిపి కలియబెట్టి కాలిన పుండ్లకు పూసిన నొప్పి వెంటనే తగ్గును, బొబ్బలుకూడ గుణమగును.

12) తులసి రసము, నిమ్మపండ్ల రసము, ఆవునెయ్యి, తమలపాకుల రసములను సమభాగములుగా మిశ్రమము గావించి ఉపయోగించిన గజకర్ణమను కుష్ఠ గుణమగును.

13) సైంధవ లవణమునకు తులసి రసమును కలిపి శరీరమునకు రుద్దిన శీతపిత్తము (పైత్యపు దద్దులు - URTECARIA) వెంటనే తగ్గును

14) ధనుర్వాతము (Tetanus) వచ్చిన రోగికి వెంటనే వెల్లుల్లి, అల్లము, ఉల్లి, కృష్ణతులసి ఆకుల రసము లన్నింటిని కలిపి 5 గ్రాముల వరకూ సేవింప చేయ వలయును. ఇదే రసమును శరీరాద్యంతము పూయవలెను. మంచిగుణముండును.

15) 20 గ్రాముల తులసి ఆకులు, ఒక వెల్లుల్లి గడ్డవేసి నూరి తయారించిన మలాము (Ointment) (Wring worm రింగ్‌వార్మ్) ఎంగిలిదద్దులను పోగొట్టును.

16) కొందరు దీర్ఘ రోగులు సరియైన శుశ్రూత పాటించకపోవుటచేతను. శరీరముపై అతిగా వెంట్రుకలుండుట చేతను 'పేలు' పడును. అటువంటి సమయమున ఘాటుగాయుండు అడవితులసి రసము, నిమ్మరసము కలిపి శరీరాధ్యంతము రుద్ది ఒకగంట తర్వాత స్నానము గావించిన గుణమగును. అనగా పేలు చచ్చి రాలిపోవును. ఇలా 2-3 మార్లు చేసిన సంపూర్ణ ఫలితముండును.

17) వ్రణమున క్రిములు కనబడిన తులసి ఎండు దళముల చూర్ణమునకు, కర్పూరపు చూర్ణము కలిపి వ్రణమును నింపిన క్రిములు పడిపోయి వ్రణము గుణమగును.

18) తులసి దళములు, ముల్లంగి విత్తులు, కానుగవేరు యీ మూడింటిని కలిపి మజ్జిగతో నూరి లేపించిన అర్బుదరోగము నశించును.

19) తులసి బృందావనమునగల మృత్తికను గ్రహించి, చర్మ వ్యాధులు కలవారు దానిని శరీరమునకు బాగుగా రుద్దుకుని కొంతకాలమైన తర్వాత స్నానమాచరించి, తర్వాత దానిపై (చర్మరోగముపై) తడిబట్టను చుట్టిన చర్మవ్యాధులు పోవును. ఆరోగ్యముగాయున్నవారు ఈ విధముగా ఆచరించిన చర్మవ్యాధులు వీరి దరిచేరవు.

## చిన్నపిల్లల వ్యాధులు

1) చిన్నపిల్లలకు పండ్లు వచ్చు వయస్సులో ప్రతిదినము తులసి స్వరసము ఇచ్చుచుండిన పండ్లు సులభముగా భేదులు మొదలగు ఎలాటి వ్యాధులు రాకుండా వచ్చును. అలాగే తులసి రసం తేనెతో కలిపి పిల్లల చిగుళ్ళకు రుద్దుట చేయవచ్చును.

2) తులసి ఆకులు, తుమ్మ లేత చిగుళ్ళు, అజామోదము వీటిని 10 గ్రా. వంతున సేకరించి బాగా మర్ధించి, 5 గ్రా. తీసుకొని 50 గ్రా. నీటిలోవేసి 1/4 భాగం మిగులునట్లు ఉడికించి వడకట్టి రుచికి కొద్దిగా చక్కెరకలిపి చిన్నపిల్లలకు త్రాపిన ఏ జ్వరమైనను నెమ్మదించును.

3) 10 గ్రా. తులసి ఆకులను దీనికి సమముగా మిరియాలు కలిపి చూర్ణించి కొద్దిగా వేపబంక కలిపి పెసరగింజ పరిమాణపు మాత్రలుగా తయారించి భద్రముచేసుకొని రోజూ 3-4 మాత్రలవరకు చిన్నపిల్లలకు వాడిన దగ్గు, కుక్కదగ్గు గుణమగును.

4) తులసి రసమునకు అతిమధురపు చూర్ణమును కలిపి వాడిన పిల్లలకు వచ్చు సాధారణ దగ్గులు పోవును.

5) 5 గ్రా. తులసి రసము, అంతే వాము, పసుపు కలిపి చూర్ణించి, దీనికి 25 గ్రా. తేనె చేర్చి బాగుగా కలిపి సీసాలో భద్రపరచుకొని 30-50-60 చుక్కలవరకు పిల్లల కిచ్చిన పడిసము, దగ్గు పోయి పిల్లలు ఆరోగ్యవంతులగుదురు.

6) చిన్నపిల్లల కడుపు (గాలిచే) ఉబ్బరించియున్న 5-10 గ్రా. తులసి రసము, తమలపాకుల రసము కలిపి వాడిన నివారణమగును.

7) తులసి విత్తుల చూర్ణమును పాలతో ఇచ్చిన చిన్నపిల్లల వాంతులు నిలిచిపోవును.

8) తులసి వ్రేళ్ళ కషాయమునకు చక్కెరకలిపి వాడిన పిల్లలకు మలబద్ధకముపోయి, సుఖముగా మలప్రవృత్తి కలుగును.

9) తులసి విత్తుల చూర్ణము 2 గ్రాములను తల్లిపాలతోగాని, ఆవుపాలతోగాని ఇచ్చిన చిన్నపిల్లల అతిసార భేదులు నిలిచిపోవును.

10) తులసి రసమును తేనెతో వాడిన పిల్లల దగ్గులు త్వరగా గుణమగును. తల్లి పాలు పడకపోయినా పై మందునే వాడి మంచి ఫలితమును పొందవచ్చును.

11) తులసి రసమును కొద్దిగా వేడిచేసి వాడిన పిల్లలకు క్రిములు పడిపోవును.

12) తులసి దళముల రసము, తేనె, అల్లపు రసము వీటిని చేర్చి 20-60 చుక్కల వరకూ వాడిన జ్వరము, దగ్గు గుణపడును.

13) తులసి రసము ఖండచక్కెర చూర్ణము, మిరియపు గింజ చూర్ణము కలిపి 10 నుంచి 30 బిందువులవరకూ వాడిన దగ్గు, జ్వరము పోవును.

14) తులసి రసమునకు ఖండచక్కెర పిప్పిలీ చూర్ణము కలిపి వాడిన జ్వరములు గుణపడును.

15) తులసీ విత్తులను చూర్ణించి తల్లిపాలతోగాని, ఆవుపాలతోగాని వాడిన బిడ్డల అతి సారము నిలిచిపోవును. ఇదే చూర్ణమును దాడిమాది పానకముతో వాడిననూ మంచిగుణముండును.

16) తులసి చెక్క కషాయమున ఖండచక్కెరచేర్చి త్రాపిన మలావరోధము తగ్గును.

17) తులసి రసముతో మిరియాలు మర్ధించి చిన్నగా మాత్రలుగా తయారించుకొని వాడిన బిడ్డల దగ్గు నివారణమగును. ఉబ్బసమున్నచో తులసి దళములు, పుష్ప గుచ్ఛముల కషాయము వాడతగును.

18) తులసి రసమునకు తేనెవేసి నాకించిన వాంతికట్టును. మరియు తులసివేరు మీది తొగటును చూర్ణించి తేనెతో నాకించిన బిడ్డల వాంతులు గుణమగును.

19) తులసి రసమున శొంఠి చూర్ణమును కలిపి వాడిన పిల్లల కడుపునొప్పులు గుణమగును.

20) తులసి రసము, అల్లపు రసము కలిపి వెచ్చచేసి వాడిన పిల్లల ఉదరశూల మొదలగు వికారములు మేలగును.

21) తులసి రసమునకు ఖండచక్కెర చేర్చి 5-10 బిందువులు ప్రతిదినం బిడ్డలకు సేవింపజేసిన ఆరోగ్యవంతులుగా, శరీరపుష్టి నొంది యుందురు. ఆరోగ్యముగా యున్న పిల్లలకుకూడ వాడవచ్చును.

22) తులసి రసము, అల్లపు రసము కలిపి వెచ్చచేసి, చల్లారిన పిదప తేనె చేర్చి బిడ్డలకు త్రాపిన కడపునొప్పి, అజీర్ణము, వాంతి, ఎక్కిళ్ళు, దగ్గు, ఉబ్బసము జ్వరము మొదలగునవి దరిచేరవు.

23) తులసి రసమునకు సున్నోదకము (సున్నపురాయిని నీటియందు ముంచిన వచ్చు స్వచ్ఛమైన నీటిని బట్టలో శోధించి సంగ్రహించవలెను) ను సమభాగములుగా సంగ్రహించి. దానికి ఖండచక్కెర చేర్చి బాలకులకు ఉపయోగించిన (5 నుంచి 60 బిందువుల వరకు) పిల్లలు ఆరోగ్యవంతులుగా యుందురు.

24) పిల్లలకు రెండు పెదవులు కలియుచోటుల చీలిపుండు అగును. అటువంటి వ్యాధు లందు తులసి రసము అప్పుడే తయారించినది త్రాపిన మంచి గుణముండును, ఎందుకన అందు థైమాల్ అను పదార్థమున్నది.

## చెవిలో చీము కారుట

1) తులసి ఆకుల రసమును నాలుగైదు చుక్కలు ప్రతినిత్యం చెవిలోవేపి దూది పెట్టుచుండిన చీముకారుట, చెడువాసన, వాపు హరించిపోవును.

2) తులసి దళములు, పగులగొట్టబడని మిరియాలు, నూగులనూనెలో వేపి కాచి వడకట్టి సీసాలో భద్రపరచుకొని చీముకారుట, చెవుడు మొదలగు సర్వ చెవి రోగములయందును వాడిన మంచి గుణమునిచ్చును.

3) కృష్ణతులసి, భృంగరాజము యీ రెండు కలిపి తయారించిన రసమును అన్ని విధముల చెవిరోగములందు వాడతగును. కేవలము వనతులసి ఆకులను బట్టలో వేసి రసమును పిండుచూ రెండు మూడు చుక్కలు చెవిలోవేసిన చెవుడు నెమ్మ దించును.

4) తులసి దళములు, వెల్లుల్లి కలిపి నూరి రసమును 3-4 చుక్కలు చెవిలో వేసి దూది వుంచిన చెవిపోటులు పోవును. చెవుడున్న గుణమగును. చెవి పైభాగ మున వాపు, నొప్పియున్న తులసి రసమును మాత్రం ప్రొద్దున, సాయంత్రం రెండుపూటలా పైన పూయవలయును.

5) తులసి రసమునకు సమభాగముగా నువ్వులనూనె కలిపి కాచి గోరువెచ్చగాయున్న పుడు 3-4 చుక్కలు చెవిలోవేపి దూదిపెట్టిన చెవిపోటు వెంటనే తగ్గును.

6) ఆవాలనూనెను, తులసి రసమును కలిపి వెచ్చచేసి చెవిలో వేసిన చీము కారుట పోవును.

7) తులసి ఆకులను రోగియొక్క స్వమూత్రముతో కలిపి వేడిచేసి, గోరువెచ్చగా నున్నపుడు 3-4 చుక్కలు చెవిలోవేసి దూది వుంచవలెను. ఇలా ఒకవారం వాడిన చీము కారుట మొదలగు అనేక చెవి రోగములు మాయమగును.

8) పూర్ణో కర్ణో రసోన సురభిసలి లేనవాపి,
పూత్యామయంత్యజతి తక్షణ సంప్రణష్ట తీవ్రవ్యథా
పరిచయప్రతి పన్న సౌఖ్యః॥
వెల్లుల్లి, తులసి వీని రసమును (కర్ణపూరణము) చెవిలోవేసిన పూతి పూయముచే కలిగిన కర్ణరోగము శమించును. (గదనిగ్రహమునుంచి)

9) తులసి రసమునకు మొక్కజొన్న ఆకురసమునుచేర్చి చెవిలోవేసిన కర్ణరోగములు గుణమగును.

10) రామతులసి పుష్పముల గుచ్ఛరసమును చెవులలోవేసిన చెవుడు తగ్గును.

## జ్వ ర ము ల కు

1) మిరియాలు మూడు తులములు, తులసిదళములు మూడు తులములు ఈ రెండు కలిపి మెత్తగా మర్దించి, మినుములవలె మాత్రలుచేసి ఆరబెట్టి సీసాలోబోసి భద్రపరచుకొని, పూటకు ఒక మాత్రవంతున ప్రతిరోజూ మూడు మాత్రలు కొంచెం వేడినీళ్ళ అనుపానముతో ఇచ్చుచుండిన 4-5 రోజులలో అన్నిరకము లైన జ్వరములు హరించిపోవును.

2) తులసిదళములు, వెల్లుల్లి, మిరియాలు వీటినికలిపి నమిలి మ్రింగిన అహిక జ్వరములు నివారణమగును.

3) 10 గ్రా. మిరియాలపొడి, 10 గ్రా. పిప్పలీమూలం (మోడి) లను తులసి రసముతో ఆరుమార్లు భావనచేస్తూ, బాగా మర్దించి, బఠాణీగింజ పరిమాణపు మాత్రలు తయారించి, అవసరాన్నిబట్టి అన్నిరకముల జ్వరములందు ఉపయోగించి మంచి ఫలితమును ఆశించవచ్చును.

4) శొంఠిని తులసి రసముతో నూరిన గంధమును నొసట పూసి రుద్ది, కొంతసేపు రగ్గు కప్పుకొని పరుండిన బాగుగా చెమటపట్టి జ్వరము విడుచును.

5) కరక్కాయ పెచ్చులు, వేపచెట్టు బెరడు, వాకుడుచెట్టు వ్రేళ్ళు, నేలవేము, తిప్ప తీగ ముక్కలు, చేదుపుచ్చ వ్రేళ్ళు, కానుగ ఆకులు, వాము, అడవి తులసి

వీటిని అయిదు తులముల వంతున తీసుకొని కచ్చాపచ్చాగా దంచి, (నలగగొట్టి) యీ మొత్తం వాటికి ఎనిమిదిరెట్లు నీళ్ళు (360 తులములు) పోసి పొయ్యిమీద పెట్టి మందాగ్నితో కషాయము కాచి, రెండు వంతులు మిగులునపుడు దించి వడపోసి, అందు 30 తులాల పంచదార కలుపుకొని, తేనెపాకంగా కాచి సీసాలో పోసి భద్రపరచుకొనవలెను.

పై ఔషధమును పూటకు అరతులం మోతాదు చొప్పున సేవించుచున్నయెడల సన్నిపాత జ్వరము, న్యుమోనియా, ఇన్‌ఫ్లుయెంజా జ్వరములు - సాధారణ జ్వరములు హరించిపోయి, ఆరోగ్యముకల్గును.

6) 50 గ్రా. తులసి ఆకులు, అయిదు మిరియాలు కలిపి నూరి 200 గ్రా. నీటిలోవేసి అర్ధభాగము మిగులునట్లు కషాయము తయారుచేసి, దీనిని మూడుపూటలా సేవించిన ఇన్‌ఫ్లుయెంజా జ్వరం నెమ్మదించును. అలాగే తులసి, వాము, శుంఠి కలిపిన చూర్ణమును తేనెతో కలిపి వాడిననూ మంచి ఫలితముండును.

7) తులసి ఆకులు 11, మిరియాలు 9, శొంఠి 3 మాషములు వీటిని 5 తులముల నీటిలోవేసి బాగుగా కాచి అందులో కొద్దిగా సైంధవలవణము కలిపి త్రాగవలెను. విషమ జ్వరములు నెమ్మదించును.

8) పొంగించిన వెలిగారం అరతులం, మిరియాలు అరతులం, లవంగాల చూర్ణం అరతులం, తాడికాయపెచ్చులు అరతులం, తులసి ఆకులు రెండు తులములు వీటిని కలిపి చూర్ణించి బఠాణీగింజల పరిమాణములో మాత్రలుచేసి పూటకు రెండుమాత్రలుచొప్పున వేడినీళ్ళ అనుపానముతో ఇచ్చుచుండినయెడల సాధారణ జ్వరములు, అజీర్ణజ్వరములు, ఇన్‌ఫ్లుయెంజా జ్వరములు హరించిపోవును.

9) 2 స్పూనులు తులసిరసమును అల్లపు రసమును కలిపి అర్ధగ్రాము త్రిభువనకీర్తి రసమును వాడిన ఇన్‌ఫ్లుయెంజా జ్వరము పోవును,

10) తులసి, అల్లము కలిపి దంచి తీసిన రసమునకు తేనెకలిపి తీసుకొన్న నిమోనియా ఇన్‌ఫ్లుయెంజా జ్వరములు కొరైజా (దగ్గు, పడిశము) యందు మంచిఫలితము లుండును.

11) తులసి దళములు 11, మిరియాలు 9, శొంఠిపొడి 50 గ్రా., వాము 30 గ్రా. వీటిని కలిపి నీటితోనూరి యుంచుకొనవలయును. మట్టి మూకుడును అగ్ని యందుంచి బాగుగా వేడిచేసి, అందులోనికి పై కల్కమును పోసిన అది ఒక మోస్తరుగా ఉడుకును. దీనిని ఆయుర్వేదమున 'పొంగు కషాయము' అందురు. వేడి మూకుడులోనికి పోసినపుడు వచ్చు వేడి ఆవిరిని రోగి శరీరమునకు తగులు నట్లు చూడవలెను. ఆ కషాయము చల్లబడినతర్వాత కొంత ఉప్పుకలిపి త్రాగించ వలయును. ఎలాటి జ్వరముకాని తక్కువకాలంలో గుణమగును.

12) జ్వరము, దగ్గు, ఆయాసము యున్న 3 గ్రా. తులసి రసము, 3 గ్రా. అల్లపు రసము ఒక స్పూను తేనెతో కలిపి సేవించిన జ్వరము పోయి, కఫము తెగి, ఆయాసము గుణమగును.

13) తులసి కషాయము చింతపండు రసము, వీటికి మిరియాలపొడి కలిపి సేవించిన జలుబు, జ్వరములందు మంచి గుణకారిగా యుండును.

14) తులసి, పుదిన కలిపి తీసినరసము 10 గ్రా. దీనికి 5 గ్రా. చక్కెర కలిపి సేవించిన పురాణ జ్వరములు గుణమగును. దీనినే మాలినీ వసంతము లేక స్వర్ణమాలినీ వసంతముతో వాడిన తిరుగులేకుండా గుణమయితీరును.

15) తులసి ఆకులు, ప్రొద్దుతిరుగుడుపువ్వు మొక్క ఆకులు (Sun Flower leaves) కలిపి తీసిన రసము సేవించిన అన్నిరకముల జ్వరములు హరించి పోవును.

16) 10 గ్రా. ఎండు తులసి ఆకుల చూర్ణము, ఒక గ్రాము దాల్చినచెక్క, ఒక గ్రాము కుంకుమపువ్వు, మూడు ఏలకులు వీటిని నీటిలో వుడికించి వడకట్టి పాలు చక్కెర కలుపుకొని, కాఫీ, టీలవలె త్రాగిన సర్వజ్వరములకు హితకారిగా యుండును.

17) 5 గ్రా. మిరియాలపొడి, 15 గ్రా. వేపచిగుళ్ళు, 15 గ్రా. తిప్పతీగె, 15 గ్రా. తులసి దళములు వీటిని కలిపి నూరి, తేనెతో కలిపి సేవించిన పురాణ జ్వరము లందు మంచి గుణకారిగాయుండును.

18) 10 గ్రా. తులసి రసమున 5 గ్రా. పటికబెల్లము చేర్చి సేవించినా, తులసి దళముల కషాయము (డికాక్షన్) నందు పాలు. చక్కెర కలిపి వేడివేడిగా సేవించినా జ్వరములందు చాల హితవుగాయుండును.

19) నల్లతులసి, అడవితులసి, పుదిన కలిపి తయారించిన రసమును 3 నుంచి ఒక వారం రోజులు సేవించిన అన్నిరకముల జ్వరములు నెమ్మదించును.

20) తులసి ఆకులు ఎండించి చేసిన పొడుము ఒక తులం, పావుశేరు నీళ్ళలో వేసి కాచి, అర్ధపావు వుండగాదించి వడపోసి, అందు కొంచెము పాలు, పటికబెల్లం పొడి, రెండు యాలకుల చూర్ణము కలిపి పూటకొక మోతాదుగా రోజూ రెండు పూటలువంతున త్రాగుచుండిన యెడల జ్వరములు హరించిపోవును.

21) తులసి దళములు 10, మిరియాలు 5, కలిపిరుద్ది, అందు ఒక తులము పటిక బెల్లముకూడాచేర్చి, ఒక పావు శేరు నీళ్ళలోవేసి అర్ధము మిగులునట్లు కాచి, గోరు వెచ్చగా యున్నపుడు త్రాగవలయును. ఔషధము పుచ్చుకున్న తర్వాత రెండుగంటలదాకా చల్లటి మంచినీళ్ళు త్రాగకూడదు. ఇట్టి ఔషధమును ప్రతి నిత్యం ఉదయం, సాయంత్రం రెండుపూటలా సేవించుచుండినయెడల ఇన్‌ఫ్లుయెంజా జ్వరము నిశ్చయముగా హరించిపోవును.

22) జ్వరముతోయున్నపుడు సంభోగము గావించిన దోషజ్వరము - సంగమ జ్వరము వచ్చునని ఆయుర్వేదము చెప్పుచున్నది. అటువంటి జ్వరమునందు - తెల్లజిల్లేడు వేరు పట్ట ఒకభాగము, ఏలకులు 1/2 భాగం, రెండు కలిపి కల్వములోవేసి కొంచెము నీరువేసి నూరి కందిగింజ పరిమాణపు మాత్రలుచేసి, పూటకు ఒకటి లేక రెండు వంతున తులసి ఆకురసముతో అరగదీసి రోజుకు రెండుపూటలు నాకించిన దోషజ్వరము హరించిపోవును. చనుబాలతోకూడ ఈ మాత్రలు వాడి మంచిగుణమును పొందవచ్చును.

32) ప్రాతఃకాలమున దంతదావనానంతరము, ఏ ఇతర వస్తువులు సేవించకుండా అయిదారు తులసి దళములు నమలి, ప్రతినిత్యము మ్రింగుచుండిన జ్వరములు రాకుండాయుండుటయేగాక, జీర్ణశక్తికూడా పెంపొందును.

24) ఆయుర్వేదమున చెప్పబడిన మృత్యుంజయరసం, స్వచ్ఛంద భైరవిరసం, జ్వరాంకుశరసం, అగ్నికుమారరసం, శీతాంశురసం, త్రిభువనకీర్తి రసం మొదలగు ఔషధములను - జ్వరనిర్ణయముతో - తులసి స్వరసముతో వాడిన చాల మంచి ఫలితములను ఆశించవచ్చును.

25) అరణ్యా తులసీ ద్రాక్షా శుంఠీ భార్జీ విశాలికా॥
సహదేవీ బలా క్వాథో హరేచ్ఛీఘ్రం త్రియాహికం॥
అడవితులసి, ద్రాక్ష, శొంఠి, గంటుభారంగి, పాపరవేరు, సహదేవి ముత్తవ పులగము వీటిని సమాంశములుగ వైచి కషాయమునుబెట్టి పుచ్చుకొనిన త్యాహిక జ్వరము శీఘ్రముగ మానును.

26) కాకజం ఘాబలా వ్యాఘ్రీ హ్యారణ్యా తులసీ వచా।
శుంఠీ నిశాద్వయం క్వాథః పురాణ జ్వర నాశకః॥
వెలమసంధి, చిట్టాముట్టి, వాకుడుసమూలము (కుక్కగగ్గెర) కుక్కతులసి, వస, శొంఠి, మానిపసుపు, మంచి పసుపు వీటిని సమాంశములుగ జేర్చి కషాయము కాచి యిచ్చిన పురాణ జ్వరము పోవును.

27) అరణ్యాతులసీ శుంఠీ విష్ణు క్రాంతాచ పద్మకీ।
బలాక్వాథః కణాయుక్త యుక్తశ్శీత జ్వర నివారకః॥
అడవితులసి, శొంఠి, విష్ణుక్రాంత, తామరతూండ్లు, పెద్దముత్తవపులగము వీటిని సమముగజేర్చి కషాయముకాచి పిప్పలీచూర్ణము చేర్చి యిచ్చిన శీత జ్వరములు పోవును.

28) ఆరణ్య తులసీబిల్వం కాక జంఘాకుశోనిశా।
ఖరవిష్ఠా కాకపక్షః ధూపోయం జ్వర నాశకః॥
అడవితులసి, మారేడుబంక, వెర్రిఅత్తి, దర్భ, పసుపు, గాడిదలద్ది, కాకియాకెలు వీటినిజేర్చి దూపమువేసిన జ్వరము మానును.

29) తులసి ఆకులను నీటియందువేసి ఉడికించి, వడకట్టి త్రాపిన సాధారణ జ్వరములు గుణమగును.

30) తులసి ఎండిన ఆకులను, పచ్చిదళములను కలిపి నీటియందు ఉడికించి ఆవుపాలు చక్కెరవేసి త్రాపిన జ్వరములు పోవును.

31) ఎండిన తులసి ఆకులు, వేప ఆకులు, తిప్పతీగె ముక్కలు వీటిని కలిపి చూర్ణము గావించి నీటిలోవేసి ఉడికించి 5-6 నిమిషములు తర్వాత పాలు, చక్కెర కలిపి సేవింపచేసిన జ్వరము నాశనమగును.

32) నీడను ఎండిన తులసి ఆకులను చిన్నమంటతో కాల్చవలెను. దీనికి యాలకుల విత్తులు, దాల్చిన్ని, లవంగములు, యష్ఠిమధు వీటిని చూర్ణించి వేడినీటిలోవేసి 2-3 నిమిషాలు తర్వాత వడకట్టి పాలు, చక్కెర చేర్చి సేవించిన జ్వరము, దగ్గు మలేరియా జ్వరము, వాంతి తగ్గును.

33) తులసి రసమునకు నల్లమిరియాలు కలిపి ప్రాతఃకాలమున సేవించిన జ్వరములు పోవును.

34) తులసి, బిల్వపత్ర ఆకులు. వేపచివుళ్ళు మరియు మామిడి ఆకులు వీటిని నీడను ఎండించి, నీటిలోవేసి ఉడికించి కషాయము కాచి పుచ్చుకొనిన జ్వరములు గుణమగును.

35) తులసిరసమున నల్లమిరియాల చూర్ణమును మూడుమార్లు భావనచేసి నీడను ఎండించి, శనగగింజ పరిమాణపు మాత్రలు తయారించుకొని, రోగి జ్వర తీవ్రతను చూచి ఉపయోగించిన జ్వరములు పోవును.

36) తులసి దళముల రసమున పిప్పలీ చూర్ణమును ఏడుమార్లు భావనచేసి, బాగా మర్ధించి శనగగింజంత మాత్రలు తయారుచేసుకొని వాడిన జ్వరములు గుణమగును.

37) రోగికి శీతముకమ్మి నాడి పడిపోవునపుడు తులసీ రసము. తేనె కలిపి దీనితో మకరధ్వజము వాడినవెంటనే తప్పక మంచి గుణము కనబడును.

38) తులసిదళములు, నల్లమిరియాలు, కొద్దిగా పాతబెల్లము వీటిని కలిపి మర్ధించి, చిన్నమాత్రలుగా తయారించి, విషమజ్వరములలో వాడతగును.

39) తులసి రసము, తేనె, అల్లపురసము కలిపి సేవించిన కఫజ్వరములు గుణపడును.

40) వనతులసిదళముల కషాయము సేవించిన చెమటపట్టి జ్వరము వెంటనేవిడుచును.

41) గ్రంథిక జ్వరమునందు : రామతులసి దళములు, నేలయుసిరిక, ఆవునెయ్యి, పిప్పలీ చూర్ణము, శుద్ధ కర్పూరములను చేర్చి, లేత వేపచిగుళ్ళ రసముతో వీటిని మర్ధించి మాత్రలు తయారించుకొని, నీడను ఎండించి, భద్రపరచుకొని, సాధారణ జ్వరమున మూడుమాత్రలు రెండుగంటల కొకమారు వంతునను, తీవ్రజ్వరమున రెండుగంటల కొకమారు నాలుగుమాత్రల వరకూ రోగి బలము, వయస్సు, రోగ తీవ్రతను గమనించి వాడతగును.

42) తులసి దళములు, మిరియముల చూర్ణము. కాకర ఆకు, (చిత్రక) ఆముదపు ఆకులు వీటిని ఒకటిగాచేసి దంచి మాత్రలుగా తయారించి, దినమునకు రెండు మార్లు రెండు మాత్రల వంతున సేవించిన శీత జ్వరములు పోవును.

## తలనొప్పులు : Headache

1) తులసి ఆకులను నీడను ఎండించవలయును. తర్వాత మెత్తగా చూర్ణించి, వస్త్ర గాళితము గావించి సీసాలో భద్రపరచుకొనవలయును. తలనొప్పి యున్నవారు యీ చూర్ణమును ముక్కుపొడుమువలె పీల్చుచుండిన కఠినమైన తలనొప్పులు కూడ శాంతించును.

2) కర్పూరమును గంధపురాతిపై తులసి స్వరసముతో బాగుగా రుద్ది ఆ గంధమును నొసట అంటించిన తలనొప్పి వెంటనే మాయమగును.

3) తులసి స్వరసము అరతులం, గజ్జేరు ఆకురసం అరతులం, మిరియములు నాలుగు కలిపి నూరి బట్టలోవేసి, ముక్కులకు 2-3 చుక్కలు వంతున పిండిన తలనొప్పి, శిరోభారము, పీనసము అను నాశికారోగము పోవును.

4) దీర్ఘ కాలముగా తలనొప్పితోగాని, అరతలనొప్పి (Migraine)తో గాని బాధ పడుచున్నవారు, మొదట మలబద్ధము లేకుండా చూచుకొనవలయును. ప్రతిదినము ప్రొద్దున ముఖము కడుగుకొనునపుడు, స్నానము చేయునప్పుడు ముక్కుతో నీళ్ళు పీల్చి వదులుట అలవాటు చేయవలయును.

తులసీ దళములను ఎండించి, బాగుగా ఎండిన తర్వాత చూర్ణించి వస్త్రగాళితం గావించి భద్రపరచుకొనవలెను. ఈ చూర్ణము 5-10గ్రా. తీసుకొని, పాత తేనెతో కలిపి ఒకేమారు మ్రింగక నిదానముగా చప్పరిస్తూ సేవించవలయును. ఇలా రోజూ ప్రొద్దునా, సాయంత్రం రెండుపూటలు సేవించవలయును. పై చూర్ణ మును నీటితోకలిపి ప్రాతఃకాలమున సూర్యోదయానికి ముందుగనే నొసటకి పట్టువేయవలయును. రోజూ సాయంత్రం సూర్యుడు మునుగు సమయమున మంచముపై తల కొద్దిగా వ్రేలాడునటుల పరుండి, కృష్ణతులసి ఆకులను బాగుగా నలిపి 3-4 చుక్కలు రెండు ముక్కు రంధ్రములకు వేయవలయును. ఒకే వారములో ఊహించని ఫలితము కనబడును.

5) తులసి రసము, అల్లపురసమునకు పుష్కరమూల చూర్ణమును చేర్చి మర్దించి పట్టువేసిన వాతజ అరతలనొప్పి గుణమగును.

6) తులసి ఆకులు, శొంఠి, లవంగము కలిపి నూరి ఆ గంధమును కొద్దిగా వెచ్చచేసి లేపించిన తలనొప్పులు మాయమగును.

7) తులసి పూగుత్తులను నీడను ఎండించి చూర్ణముగావించుకొని తేనెతో సేవించిన అరతలనొప్పులు పోవును.

## తృష్ణ

1) తులసిఆకుల రసము, నిమ్మపండు రసము, వీటికి కలబంద చేర్చి షరబత్తుగా తయారుచేసి సేవించిన తృష్ణ నెమ్మదించును.

2) తులసి రసము, నిమ్మపండు రసము, చక్కెరచేర్చి నీటిలో కలిపి త్రాపిన అతి దాహమగుట తగ్గును.

3) పిత్తజ దాహమున తులసి దళములను నీటిలోవేసి కాచి కషాయము తయారించుకొని, కొద్దిగా చల్లారిన తర్వాత ఖండచక్కెర వేసి సేవించతగును.

4) రసజ దాహమందు తులసి రసమును సేవింపనగును.

5) వనతులసిని సేవించుటతోను, వనతులసి విత్తుల చూర్ణంను సేవించుట చేతను, లేక వనతులసి దళముల రసమున ఖండ చక్కెర చూర్ణం వేసుకొని సేవించుటచే దాహం శమించును

## దగ్గు : Cough

1) తులసి పువ్వులు (పెన్నులు), అల్లము యీ రెండు సమభాగములుగా కలిపి నూరి అందు తగుమాత్రము తేనె కలిపి పూటకు అరతులం వంతున రోజూ రెండు పూటలా పుచ్చుకొను చుండినయెడల దగ్గులు హరించిపోవును.

2) తులసి దళములు 10-12 తీసుకొని 3-4 మిరియాలు కొద్దిగా అల్లపుముక్క, ఒక చిటికెడు సైంధవ లవణము కలిపి ఒక గ్లాసు నీటిలోవేసి అరకప్పు మిగులునట్లు కాచి, సేవించిన పడిశము దగ్గులు మాయమగును.

3) తులసి విత్తులు, ఉల్లిపాయ, అల్లం కలిపి నూరి కొద్దిగా తేనెచేర్చి నాకిన సాధారణ శ్వాసకోశ వ్యాధులు, మొదటిదశలోయున్న తమక శ్వాసము (ఆస్త్మ) కూడ వెనుతిరుగును. శ్వాసకోశములో పేరుకొనియుండి, దగ్గినను బయటికి వెలువడని గట్టిపడిన కఫము (Fhlem) తెగి సులభంగా వెలువడి రోగికి హాయిని కూర్చును

4) తులసి ఆకుల రసమును నాలుగు తులముల మోతాదుగా రోజూ రెండు, మూడు మార్లు పుచ్చుకొనుచున్న దగ్గులు హరించును.

5) తులసి దళముల రసము ఒక తులం, తేనె తులం కలిపి ఒక మోతాదుగా రోజూ మూడు పూటలు వాడిన చిన్నపిల్లల దగ్గులు గుణమగును, కఫము హరించును. శ్వాసనాళిక శుభ్రపడి శ్వాస సులభమయి పిల్లలు సుఖముగా నిద్రింతురు.

6) గొంతు బొంగురు, దగ్గు, గొంతుపుండు యున్నటువంటి సమయాలలో తులసి ఆకులు, బొప్పాయి (పరంగి) విత్తులు, అతిమధురము సమభాగములుగా గ్రహించి వీటికి సమభాగము పటికబెల్లముచేర్చి సేవించిన గుణకారిగా యుండును.

7) తులసి దళములను నీటిలో మరగించి. వడబోసి, అందులోనికి మరిగిన పాలు, పటికబెల్లము కలిపి టీ, కాఫీ లవలె త్రాగిన దగ్గు నెమ్మదించును. కేవలము తులసి రసమునకు తేనె కలిపి వాడినా గుణమగును.

8) తులసి విత్తుల చూర్ణమునకు, ఖండచక్కెరపొడి చేర్చి సేవించిన ఆయాసము, దగ్గు నెమ్మదించును.

9) తులసి దళముల తాజా స్వరసమున, తేనె, అల్లము మరియు ఉల్లిగడ్డల రసము కలిపి సేవించిన కఫము బాగుగా పడిపోయి, దగ్గు నెమ్మదించును.

## నా సా రో గ ము లు

1) తులసి ఆకులను తెచ్చి నీడను ఆరబెట్టి చూర్ణముగొట్టి వస్త్రగాళితము గావించి సీసాలో భద్రపరచుకొని యుంచుకొనవలయును. అవసరము వచ్చినపుడు ఈ చూర్ణమును ముక్కుపొడుమువలె పీల్చుచుండినయెడల ముక్కునుంచి కారుచున్న రక్తము అప్పటికప్పుడే నిలిచిపోవును.

2) ఆవు వేయుచున్న పేడను క్రిందికిపడకుండా పట్టుకొని, అందులో కొద్దిగా తులసి రసము కలిపి వాసనచూపిన ముక్కునుంచి రక్తముకారుట వెంటనే నిలిచిపోవును

పథ్యాపథ్యములు :

ఎండలో తిరుగుట, నిప్పుసెగను కూర్చుండుట, బెల్లము, వేడివస్తువులు, పంచదార తినుట మానవలెను. చలువచేయు కూరగాయలు, కరబూజ పండు బార్లి ఉపయోగించవలెను.

3) తులసిరసం, అడ్డసరపురసం సమభాగములుగా కలిపి సేవించిన జలుబుచేసి ముక్కునుంచి శ్లేష్మము కారుచుండుట తగ్గును.

4) తులసి దళములు, దంతివేరు, ములకవేరు,వస, మిరియాలు, శొంఠి, సైంధవ లవణము, పిప్పళ్ళు, మునగపట్ట, వీనిని కల్కముగాచేసి నూగుల నూనెలోవేసి తైలపాకముగా కాచి, వడపోసి సీసాలో భద్రపరుచుకొనవలయును. ఈ తైలము సాయంత్రం 5-6 గంటలమధ్య రెండు ముక్కు రంధ్రములకు 3-4 చుక్కలవంతున వాడిన నాసా రోగములు, ముక్కునుంచి వెలువడు దుర్గంధము నివర్తించిపోవును.

5) తులసి చూర్ణమును నశ్యముగా వాడిన పీనస వ్యాధియూ నెమ్మదించును. కానీ చాలరోజులు వాడవలసియుండును.

6) తులసిరసం అల్లపురసం జోడించి త్రాగిన నాసా రోగములు గుణపడును.

7) తులసి చూర్ణము, సైంధవ లవణము, మిరియాల చూర్ణము కలిపి సేవించిన నాసా రోగము పోవును.

8) తులసి రసమును నస్యకర్మగా వాడిన దుర్గంధయుక్త నాసా స్రావము నిలిచి పోవును. అలాగే తులసి పొగనూ పీల్చవచ్చును.

9) తులసి సమూల కషాయమున ఆవుపాలు, చక్కెర చేర్చి సేవించిన నాసా రోగము లన్నియూ నెమ్మదించును.

## పడిశము

1) జలుబుచేసినవారికి రోజుకు 30-40 తులసి దళములను తినుపించు చున్నయెడల మూడురోజులలో పడిశము తగ్గును. జ్వరము రానీయదు.

2) తులసి, మిరియాలు కలిపి నూరి మాత్రలుగా తయారించుకొని వాడిన పడిశమున బాగుగా పనిచేయును. ఈ మాత్రలు యెదనొప్పినికూడ తగ్గించును.

3) యెండు తులసి ఆకుల మెత్తటి చూర్ణమును ముక్కుపొడుమువలె పీల్చుచుండిన యెడల ఎల్లప్పుడు పడిశముతో ముక్కు కారుచుండే పీనస వ్యాధిని హరించును. ముక్కులయందలి పుండ్లు గుణమగును.

4) తులసి ఆకుల రసము ఒక శేరు, పటికబెల్లము పొడి పావుశేరు, ఈ రెండు వస్తువులనుకలిపి పాకమువలె మందాగ్నితోకాచి, పూటకు పావుతులం చొప్పున రోజూ

రెండుపూటలా కొంచెము మంచినీళ్ళతో కలిపి ఇచ్చుచుండినయెడల పిల్లల దగ్గులు జ్వరములు, సునాయాసముగా హరించిపోవును.

5) తులసి ఆకులతో డికాక్షన్ (టీ వలె) తయారు చేసుకొని పాలు, చక్కెర కలుపుకొని, వేడి వేడిగా యున్నపుడే కాఫీ, టీ లవలె సేవించుచుండిన దీర్ఘకాలముగా యున్న శ్వాసకోశ రోగములన్నియూ నెమ్మదించును. దీనికి తిప్పతీగెను కూడ కలిపి తయారించిన మరికొంత గుణవత్తరముగా నుండును.

6) బాగా పడిశముపట్టి బాధించుచున్న సమయమున ఒకరోజు పూర్తిగా నిరాహారముగా వుండి, తులసి రసము రెండు టీ స్పూనులు, అంతే అల్లపురసం కలిపి రోజూ ప్రొద్దున, సాయంత్రం సేవించిన మంచి గుణమగపడును. రెండవ దినమునుంచి తేలిక ఆహారము సేవించవచ్చును. ప్రవృత్తి సక్రమముగా అగునటుల చూచుకొనవలెను.

7) తులసి ఆకుల రసము పూటకు మూడు తులముల వంతున, రోజు రెండు పూటలా పుచ్చుకొనుచుండిన పడిశము గుణమగును.

8) తులసి స్వరసము, అల్లపురసము తేనెతో కలిపి రోజూ ముప్పూటలా సేవించిన పడిశము మాయమగును.

9) పిల్లలకు ముక్కు కారుచున్న రోజూ రాత్రిపూట 2-3 చుక్కలు తులసి రసము ముక్కులకు పిండి రోజూ ప్రొద్దున తులసిరసం త్రాపుచుండిన 2-3 రోజులలో మంచి గుణము కనబడి, ఒకవారములో పూర్తిగాపోవును.

10) శొంఠి చూర్ణము, మిరియాలు, తులసి వీటి సమభాగముల కషాయమున చక్కెర చేర్చి వేడి వేడిగా త్రాగిన పడిశము వెంటనే నెమ్మదించును.

11) నల్లఉమ్మెత్త ఆకు, తులసి కలిపి యెండించి, సిగరెట్లవలె తయారించి, పొగ సేవించిన తమకశ్వాశము (Asthma) నెమ్మదించును.

12) గొంతులో నస, ముక్కులో వాసనయున్న తులసి రసమును పుక్కిలించుట, ముక్కులలో వేయుట, ఆవిరిపట్టుట, త్రాగుట మొదలగు క్రియలు చేసిన తప్పక గుణమగును.

# పంటి రోగములు

1) భూతులసి ఆకు స్వరసము చెవులలో పిండినయెడల పుప్పిపంటిలోని పురుగులు చచ్చిపోయి బాధహరించిపోవును.

2) తులసి పంచఅంగములు, వక్క, బాదాముల కాయలపై పెచ్చులు (Shell) వీటిని బూడిదరంగు వచ్చువరకు పెనముపైవేపి తర్వాత చూర్ణించవలయును. ఈ చూర్ణమును 100 గ్రా. తీసుకొని, దీనికి 20 గ్రా. మిరియాల చూర్ణము, 20 గ్రా. మంచికర్పూరము, 20 గ్రా. లవంగాలు, 20 గ్రా. పటిక, 20 గ్రా. అతిమధురము, 20 గ్రా. రావిబంక వీటిని బాగుగా చూర్ణించి, వస్త్రగాళితము గావించి భద్రపరచుకొనవలయును. ఈ చూర్ణముతో ప్రతిదినమూ రెండుపూటలా పళ్ళు తోముచున్న పళ్ళు గట్టిపడును. పంటి రోగములు పయోరియాతోపాటు గుణమగును.

3) రెండు లేక మూడు తులసి దళములు కొద్దిగా అల్లపుముక్క ఈ రెండింటిని కలిపి నూరి నొప్పివున్న పంటికి రెండువైపులా వుంచిన పంటినొప్పి మాయమగును.

4) సూర్యోదయానికి ముందే సూర్యకిరణములు తులసికి సోకకముందే, తులసి ఆకులు నమలి పండ్లను దానితోనే తోమిన పండ్లనొప్పులు పోవును. పండ్లు తళతళ మెఱయును. నోటిపూతలు హరించిపోవును.

5) తులసిని సమూలముగా కాల్చిన బూడిదతో ప్రతిదినం దంతములు తోముకున్న దంతశూల, రక్తము కారుట, దంతములు కదలుటపోయి దంతములు తళతళ మెఱయును.

6) తులసి పంచ అంగముల కషాయముతో పుక్కిళించుట, భోజనానంతరం 5-6 తులసి ఆకులు నమలుట, తులసి ఆకులను నలిమి పుప్పిపంటికి పెట్టుటచే నోటి దుర్వాసన, నోరు పొక్కుట (Stomatitis) పండ్లనొప్పి, మొదలగు నోటి సాధారణ వ్యాధులన్నియు నెమ్మదించును.

7) ఎండిన తులసి దళములను చూర్ణించి, రుద్దిన దంతరోగములుపోవును.

8) తులసి దళములు, లవంగములు, కర్పూరముచేర్చి మర్ధించి చిన్న మాత్రలుగా తయారించి, పుచ్చు పల్లునందు ఒక మాత్రవేసి అదిమి యుంచివేసిన మంచి గుణముండును. అలాగే తులసి రసముతో మిరియములను నూరి పంటికి అంటించిన పంటినొప్పి మాయమగును.

9) తులసి దళములు, మల్లెచిగుళ్ళు ఒకటిగాచేర్చి బాగుగానమలిన పంటిబాధలు పోవును

10) తులసి రసమున కర్పూరముకలిపి దీనితో దూదిని తడిపి పుప్పిపంటిపై యుంచిన వెంటనే గుణమగపడును. మరియు పంటియందలి క్రిములు పడిపోవును.

## ప్రమేహము

1) తులసి వేరు చూర్ణమును నీటిలోనానవేసి ప్రొద్దున కలిపి త్రాగిన ప్రమేహము గుణపడును.

2) తులసి విత్తులను ఈ దినం సాయంత్రి నీటిలో నానవేసి మరుసటి దినము ప్రొద్దున వాటిని మర్ధించి సేవించవలెను, ఇలా 40 రోజులు ఆచరించవలెను.

3) తులసి విత్తుల చూర్ణమున పాతబెల్లమునుచేర్చి, అప్పుడే పితికిన ఆవుపాలతో సేవించుతూవచ్చిన ప్రమేహముపోయి ధాతుపుష్టి ఒనగూడును.

4) తులసి దళములను నీడను ఎండించి, చూర్ణము గావించుకొని, దానికి అశ్వగంధ చూర్ణము, మెంతులు కలిపి సేవించిన ప్రమేహము గుణపడును.

## బొల్లి : Leucoderma

1) కృష్ణతులసి ఆకుల రసములో నల్లకరక్కాయను అరగదీసి, ఆ గంధమును పట్టించుచుండినయెడల తెల్లమచ్చలు హరించిపోవును.

2) భూతులసి సమూలము, వావిలివేళ్ళు, మిరియాలు, పిప్పలి, శొంఠి, వీటిని సమ భాగములుగా కలిపి, నువ్వులమానెతో నూరి పట్టించుచుండిన తెల్లమచ్చలుపోవును.

) 125 గ్రా. తులసి ఆకులను, 125 గ్రా. (గుడూచి) తిప్పతీగెను కలిపి 750 గ్రా. నీటితో బాగా రుబ్బాలి. ఈ కల్కమును 500 గ్రా. ఆవునేతితో కలిపి, నీటి అంశముపోవు వరకూ మందాగ్నితో వుడికించి వడపోసి సీసాలో భద్రపరచుకొన వలెను. ఈ ఘృతమును వుపయోగించిన బొల్లిగుణమగును.

4) ప్రాతః పిబేద్వా సురసస్యమూలం సనాగరం కోష్ఠజలేనవాపి
తులసి వేరును, శుంఠిని మెత్తగా కల్కము నూరి ప్రతిరోజున ఉదయమునందు గోరువెచ్చని నీళ్ళతో సేవించిన కుష్ఠము శమించును.

5) రోజూ రెండు పూటలు తులసిదళ చూర్ణమును సేవిస్తూ బొల్లిపై తులసి ఆకురసము మొక్క వేళ్ళయందలి మట్టిని కలిపి లేపించవలెను.

## భూ త బా ధ లు

1) తులసి దళములు ఎనిమిది, మిరియాలు ఎనిమిది, సహదేవిమొక్క వేరు అరతులం యీ వస్తువులను ఆదివారంనాడు పవిత్రముగా తెచ్చి, చిన్నగుడ్డలోవేసి మూటగట్టి రోగియొక్క మెడలో కట్టిన యెడల భూతబాధలు హరించిపోవును.

2) కుర్యాద్భూత జ్వరేనస్యం వ్యోషాష్ట తులసీదళైః॥
శొంఠి, పిప్పలి, మిరియాలు వీటిని చూర్ణముచేసి ఎనిమిది తులసీ దళములతోచేర్చి నస్యముచేసిన భూతజ్వరము మానును.

3) శారిబా సురభీ బ్రహ్మీ శంఖినీకృష్ణ సర్షపైః।
వచాశ్వగంధ సుర సాయుక్తై స్సర్పిర్వి పాచ యేత్।
తన్నాశ యేద్గ్ర హాన్ సర్వాన్ పానేనాభ్యంజనేనచ.

సుంగధిపాల, అందుగు, మండూకపర్ణి, శంఖిని, నల్లఆవాలు, వస, పెన్నేరుగడ్డ, తులసి వీటిని సమభాగాలుగ గ్రహించి నూరి, ఆవునేతితో గలిపి విధిప్రకారము పక్వముచేసి శిశువులకు పానాభ్యంజనములయందుపయోగించిన గ్రహబాధ లన్నియూ నివర్తియగును. (భైషజ్య రత్నాకరము - ఘృత తరంగము)

## మే ధో రో గ ము

1) తులసి రసమున తేనె కలిపి సేవించుతూ వచ్చిన మేధోరోగము (స్థూలత) నాశనమగును.

2) తులసి రసమును వేడిచేసి తేనె చేర్చి సేవించిననూ మేధోరోగముపోవును.

3) నవక గుగ్గులు ప్రతిదినం మూడుపూటలు - పూటకు ఒక మాత్రవంతున తులసి రసమున వాడిన స్థౌల్యత తగ్గును.

## మూత్రకృచ్ఛము, మూత్రాఘాతము
## Dysuria & Retension of urine

1) 125 గ్రాముల పాలు, అంతే నీరు కలిపి, దీనికి 20-30 గ్రాముల తులసీరసం కలిపి త్రాగిన మూత్రపుమంట గుణమగును.

2) కృష్ణతులసి సమూలము చూర్ణించి యుంచుకోవి, నిమ్మరసముతో ప్రతిదినము విడువక సేవించిన మూత్రవ్యాధులన్నియూ గుణపడును,

3) తులసి విత్తులు 5 గ్రా., ఏలకుల విత్తులు 10, కొద్దిగా పెట్లుప్పు కలిపి బాగుగా మర్దించి చూర్ణము గావించి యుంచుకోవాలి. 5 గ్రా. యీ చూర్ణమును సేవించి పాలు, అంతకు రెండింతలు నీళ్ళు కలిపి త్రాగాలి. లస్సీకూడా తీసుకొనవచ్చును. ఇది మూత్రవాధులను చక్కబరచును.

4) 10 గ్రా. తులసి విత్తులను ఒకరాత్రి ఒకగ్లాసు నీటిలో నాననిచ్చి, ప్రొద్దున గుజ్జు వలె దానిని నూరి, కొద్దిగా చక్కెర కలిపి సేవించిన మూత్రకృచ్ఛ్రిము (Dysuria) పోవును. లేక 10 గ్రా. తులసి జూస్, 5 గ్రా. నీళ్ళు కలిపి ఆవుపాలతోసేవించిన మూత్రకృచ్ఛ్రిము, జననేంద్రియములోని తాపము, మంట పోవును. లేక 10 గ్రా. తులసి కషాయము, 10 గ్రా. నిమ్మషరబత్తుతో కలిపి సేవించిననూ మూత్రకృచ్ఛ్రిము పోవును. లేక కొన్ని తులసి ఆకులు రోజూ నమలి తింటూయున్ననూ మూత్రము మంట గుణమగును.

5) 5 గ్రా. తులసి విత్తులను 125 గ్రా. నీటిలో ఒకరాత్రి నానవేసి, ప్రొద్దున బాగుగా పిసికి అదేనీటిలోకలిపి ఖండచక్కెరచేర్చి త్రాగుచుండిన మూత్రకృశ్ఛము గుణమగును. పలుచబడిన వీర్యము గట్టిపడును, గనోరియావ్యాధి నెమ్మదించును.

6) తులసి విత్తులను చూర్ణించి, తేనెతో సేవించుచుండిన జననేంద్రియ సర్వరోగ ములు శమించును. స్వప్నస్కలనములు, గనోరియా ఆదిగాగల వాటియందు కూడ మంచి ఫలితముండును.

7) 10 గ్రా. తులసి వ్రేళ్ళ చూర్ణమును, ఒక గ్లాసు నీటిలో రాత్రి నానవేసి యుంచి ప్రొద్దున పరిగడుపున బాగుగా కలిపి త్రాగుచున్న గనోరియా గుణమగును.

8) తులసి విత్తులను జీలకర్రతో కలిపి నూరి పటికబెల్లము కలిపి వేడిపాలతో కలిపి సేవించిన మూత్రకోశములోని రాళ్ళు యుండి కలిగించు బాధ నివారణమగును. మూత్రనాళములోని పుండు నాశనమై మూత్రకృచ్ఛ్రము గుణమగును.

9) మూత్రము సరిగా జారీకానిచో తులసిరసము, దానికి రెండింతలు ద్రాక్షారసమును గాని, చెరుకురసమునుగాని లేక లేతటెంకాయ నీరుగాని కలిపి త్రాగుటచే మంచి గుణము కనబడును.

10) తులసి వేర్ల చూర్ణమును కొద్దిగా బూరుగు బంక, లాక్షాచూర్ణమును చేర్చి, తమల పాకుతో సేవించిన జననేంద్రియమునుంచి మూత్రముతోపాటు రక్తము స్రవించు చున్ననూ లేక శరీరము లోపలి అవయవములలో ఎచటగానీ రక్తము స్రవించు చున్నదని అనుమానమున్ననూ యీ మందువాడి మంచిఫలితమును పొందతగును.

11) బొగ్గుల ఇనుప పుయ్యిపై బాగా నిప్పులు రాజేసి, ఒక వెడల్పాటి మూతగల పాత్రలో తులసి దళములు, నీళ్ళుపోసి, పైకుంపటిమీదయుంచి, మూత్రకోశంలో రాళ్ళు వున్న రోగిని, పేమ్‌తో అల్లిన లేక నవారపట్టతో అల్లిన కుర్చీపై కూర్చుండజేసి, ఈ కుంపటిని కుర్చీక్రిందయుంచి, రోగికి ఆ వేడి ఆవిరి తగులు నట్లు చూడవలెను. ఆవిరి ఎక్కువగా తగులుటకు దుప్పటి చుట్టూ కప్పుట వగైరా ఉపాయములు చేయవచ్చును. ఇలా కొద్దిరోజులు రోజూ రెండుపూటలు గావించిన రాళ్ళు ముక్కలయి మూత్రనాళముగుండా మూత్రముతోపాటు పడిపోవును. శస్త్ర చికిత్స అక్కరలేకనే రోగము గుణమగును. తప్పక ప్రయత్నం చేయండి.



తన పనిలో తన్మయుడైనవానికి ఆ పని భారంగా తోచదు

12) తులసి రసము మూత్రపిండాల శక్తిని పెంచును. మూత్రకోశములో రాళ్ళు వున్న రోగికి వరుసగా ఆరు మాసములపాటు తులసి రసమున తేనె కలిపి సేవింపజేసిన రాళ్ళు అరిగిపోతవి.

13) మూత్రకృచ్ఛ్రమున తులసిరసము ఆవుపాలు త్రాగిననూ, తులసి రసము నిమ్మ రసము కలిపి సేవించిననూ, గుణమగును.

## రక్త విరోచనములు : Dysentery

1) అడవి తులసి గింజలు అరతులం, పదితులముల మంచినీళ్ళల్లో నాలుగు గంటలు నానబెట్టి, అందు అయిదు తులముల పటికబెల్లము చూర్ణమువేసి కలిపి త్రాగవల యును. ఇట్లు మూడురోజులు సేవించిన కఠినమైన విరేచనములుకూడ కట్టి పోవును.

2) తులసిఆకుల రసం మూడుతులములలో చిటికెడు జాజికాయ చూర్ణము కలిపి త్రాగుచుండినయెడల నీళ్ళ విరేచనములు, జిగట విరేచనములు హరించును,

3) ఎండిన తులసి దళములు 5 గ్రా., 2 గ్రా. సైంధవలవణమును కలిపి, 50 గ్రా. ఆవుపెరుగుతోకలిపి సేవించిన రక్తవిరేచనములు, అతిసారబేదులు నిలిచిపోవును.

4) ఎండు తులసి దళములు, వీటికి సమముగా సైంధవలవణము, జీలకర్ర కలిపి చూర్ణించి పీగడ తీసి తయారించిన మజ్జిగతోగాని, పెరుగుతోగాని సేవించిన రక్త విరేచనములు కట్టును.

5) తులసి దళముల చూర్ణమునకు చక్కెరచేర్చి సేవించిన గ్రహిణి పోవును.

6) తులసీ విత్తుల చూర్ణమును కొన్నిదినములు సేవించుటచేతనూ, తులసి బిల్వ పత్ర ములు, మిరియాలు కలిపి కొన్నిదినములు సేవించిననూ గ్రహిణి నిలుచును,

## వాంతులు : Vomiting

1) తాజా తులసి ఆకులరసమునకు ఏలకుల చూర్ణమును కలిపి సేవించిన వాంతులు నిలిచిపోవును.

2) గోపిచందనము 2 గ్రా., తులసి రసము 5 గ్రా. కలిపి కొద్దికొద్దిగా త్రాపుచుండిన వాంతులు నిలిచిపోవును. కేవలము తులసి స్వరసమును తేనెతో త్రాపినా వాంతులు అరికట్టబడును.

3) వాంతులందు ఆకుపచ్చగా (Bile) పైత్యరసము వెలువడుచున్న 10 గ్రాముల తులసి స్వరసమునకు అంతే అల్లపురసము. 20 గ్రా. నిమ్మపండు రసము కలిపి చక్కెరగాని, తేనెగాని కలిపి త్రాగిన గుణమగును.

4) 10-20 గ్రాముల తులసి రసమునకు రుచికి కొద్దిగా చక్కెర కలిపి సువాసనకు ఒక చిటికెడు యాలకుల చూర్ణము, లవంగాల చూర్ణము కలిపి త్రాపిన వాంతులు కట్టును.

5) తులసి విత్తులు ఆవుపాలతో నూరి చిన్నపిల్లలకు వాంతులు. బేదులందు వాడతగును. ఒక్క సం॥ వయస్సుగల పిల్లలకు 2-3 గ్రెనుల విత్తులు వాడవచ్చును. రోజు 3-4 మార్లు ఇవ్వవచ్చును.

6) త్రిదోషజవమనమందు తులసి రసమునకు కొద్దిగా ఏలక్కుల చూర్ణము కలిపి సేవించిన గుణపడును.

7) పిత్తజవాంతులందు తులసిరసము, అల్లపు రసము, నిమ్మరసములకు ఖండచక్కెర చేర్చి పుచ్చుకొన్న గుణమగును.

8) జ్వరమునందు వాంతులున్న తులసి రసమునకు ఖండచక్కెర చూర్ణము కలిపి సేవించిన చాలును.

## వాతనొప్పులు : Nervous Diseases

1) తులసిరసము పావుశేరు, ఆవనూనె పావుశేరు, రెండూకలిపి కాచి నూనె మిగులు నపుడు దించి సీసాలోపోసి భద్రపరచుకొని, పైన మర్ధించుచుండినయెడల వాత నొప్పులు శీఘ్రముగా హరించిపోవును.

2) ప్రవాళభస్మము, తులసి రసములను తేనెతో కలిపి వాడిన వాతరోగములు గుణ మగును.

3) తులసి పంచఅంగములు బాగుగా ఉడికించి, ఆవిరిపట్టిన అన్నిరకముల పార్శ్వ వాయువులు నెమ్మదించును.

4) తులసి దళములను, ఆముదపుమొక్క వ్రేళ్ళను కలిపి ఉడికించి గోరువెచ్చగా యున్నపుడు తేనె కలిపి త్రాగించిన ఆమవాతము నిర్మూలమగును.

5) నల్లతులసి ఆకులు ఆరుతులములు, గుంటగలకరాకు ఆరుతులములు వావిళ్ళవ్రేళ్ళ పట్ట నాల్గుతులములు, మాల్కంగిణీ గింజలు రెండుతులములు, మునగచెక్క ఒక తులం, పిప్పళ్ళు తులం, మిరియాలు తులం; శొంఠి తులం యీ వస్తువులన్నీ కలిపి చూర్ణంజేసి, సీసాలోపోసి భద్రపర్చి, పూటకు అరతులం చొప్పున రోజూ రెండుపూటలా తేనె అనుపానముతో పుచ్చుకొనుచుండినయెడల, వాతపునొప్పులు, పక్షవాతములు, కీళ్ళనొప్పులు, మొదలైన సమస్త వాతవ్యాధులు హరించిపోవును.

6) తులసి పంచాంగములు సమముగా తీసుకొని నూరి ఆ చూర్ణము ఏడుమాషలు తీసుకొని, ఆరుమాషలు బెల్లముచేర్చి మేకపాలతో దినమునకు రెండుసార్లు సేవించిన సంధివాతము గుణమగును.

7) కృష్ణతులసి రసమునకు వెల్లుల్లి లేక ఉల్లిగడ్డ కలిపి నూరిన కల్కమును నొప్పులున్న కీళ్ళకు అంటించిన మంచిగుణము నొసంగును.

8) తులసి పంచభాగములను సమానముగా సేకరించి బాగుగా చూర్ణముగావించి జల్లెడ పట్టి వీలయిన వస్త్రగాళితము గావించిన చూర్ణమునకు సమానముగా పటికబెల్లంను చూర్ణించి కలిపి, ప్రతిదినం ప్రొద్దున, సాయంత్రం సేవించి ఒకగ్లాసు మేకపాలు త్రాగుచున్న ఆమవాతములు పోవును.

9) పుష్కరమూలము, తులసి రసము, అల్లపు రసము, కలిపి నూరి ఉడికించి, అంటించిన వాతపునొప్పులు నెమ్మదించును.

10) కృష్ణతులసి ఆకురసమున నెయ్యి, మిరియాలచూర్ణము కలిపి సేవించిన వాతములు హరించును.

11) పెట్లుప్పు, ఆముదపు ఆకులు, తులసి ఆకులు నీట ఉడికించి దానిని బట్టలోవేసి వేడివేడిగా కాపడము చేయుట, లేక అలాగేవేసి కట్టుకట్టుటచే వాతనొప్పులు

స్వర్గనరకాలు మరెక్కడో, ఏలోకంలోనో లేవు. అవి నీ మనస్సులోనే ఉన్నాయి



ముఖ్యముగా కీళ్ళనొప్పులు గుణమగును. తులసిరసమును ఉడికించి దానితో కాపడముపెట్టుట, ఆవిరిస్నానము చేయించుటచే ఆమవాతమున అత్యంత ఉపయోగ కారియని గుర్తించబడినది.

12) తులసి ఆకులరసమును సేవించిన తలనొప్పి, శరీరము లావెక్కడము, నరముల జబ్బులు గుణమగును. గుండెజబ్బులు, అట్టిజబ్బులవల్ల కలిగే నిస్సత్తువకు తులసి రసము బ్రహ్మాస్త్రముగా పనిచేయును.

13) ఎండిన తులసిఆకులు 5 గ్రా , అల్లము 2 గ్రా., మిరియాలు 2 గ్రా. వీటితో వేడి డికాక్షన్ తయారించి, పాలు, చక్కెర కలుపుకొని వేడివేడిగా త్రాగిన జ్వరములు, యెదయందలి కండరములనొప్పి, ఎక్కిళ్ళు గుణమగును.

14) మిరియాల చూర్ణము అరతులం, నెయ్యి అరతులం, తులసి ఆకులచూర్ణము అరతులము కలిపి నూరి, 2 మోతాదులుచేసి ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం ఒక్కొక్క మోతాదు చొప్పున తినుచున్న అన్నిరకముల వాతరోగములు హరించి పోవును.

15) శుద్ధఅమరశిల గంధకమును తులసీదళముల రసముతో మూడురోజులు మర్దించి, తర్వాత బాగుగా ఎండించి, చూర్ణము గావించి, పూటకు అణాఎత్తు చొప్పున, తేనె అనుపానముతో రోజూ రెండుపూటలా ఇచ్చుచుండినయెడల సకలవాతములు గుణమగును.

16) యెదలోగాని, పొట్టలోగాని, పొత్తికడుపునగాని వేడిచే మంటయుండిన తులసి రసమును దేవదారుచెక్కతో నూరిన గంధమును పూసిన గుణమగును.

17) తులసిఆకు పొగను పీల్చినంతమాత్రమున ఆమవాతము హరించును.

18) కీళ్ళనొప్పులున్ననూ, అన్నివిధములైన వాతవ్యాధులందును, తులసి ఆకుల కషాయము సరియైన మందుగా భావించి వాడతగును.

19) తులసిరసము, మిరియాలచూర్ణ మిశ్రమమును తేనెతో సేవించిన వాతరోగములు నివారణమగును.

రాతి విగ్రహాల్లో మనం దేవుణ్ణి చూడగలిగితే, సజీవ ప్రాణుల్లోకూడా అతణ్ణి చూడగల్గుతాము

20) తులసి దళములు ఆముదపువేళ్ళు కలిపి కషాయమును తయారించి తేనె చేర్చి సేవించిన వాతరోగములు పోవును.

21) ధనుర్వాతమున కృష్ణతులసి రసమునకు ఎర్రవెల్లుల్లి రసము, మరియు ఉల్లిపాయ రసమునుచేర్చి సేవించిన గుణమగును.

22) అగ్నివాతమందు తులసి రసమునకు మిరియముల చూర్ణము, ఆవునేతితో కలిపి పుచ్చుకున్న నివారణమగును.

23) సంధివాతమునకు తులసిదళములను మర్ధించి అంటించుటగాని లేక తులసీదళముల కషాయముతో స్నానము ప్రతిదినం చేయించుట చాలమంచిది.

24) గ్రంథి వాతమునందు తులసి దళములు, ఆముదపు ఆకులు మరియు సైంధవ లవణము కలిపి నూరి వేడిచేసి పట్టువేయవలయును.

25) స్నాయుశూలలందు తులసి విత్తుల చూర్ణమును తేనెతో సేవించిన మంచిఫలిత ముండును.

26) వాతరక్తమునందు తులసి రసమును ప్రతిదినము విడువకుండా ఒక సంవత్సరము వరకూ సేవించుట చాల ఉత్తమము. ఇతర మందులు సేవించుచూ ఈ పై రసమును సేవింపవచ్చును.

## విషమునకు విరుగుడుగా

1) తులసిమొక్క వేరును అరుగదీసిన గంధమును తేలుకాటుపై పట్టించినయెడల విషము వెంటనే దిగిపోవును.

2) నల్లతులసి, చెంగల్వకోష్ఠు, గ్రంథితగరము, మిరియాలు, ఇంగువ, పిప్పళి, శొంఠి ఏలకులు, యష్ఠిమధుకము, వాయువిడంగాలు, సైంధవలవణము, సుగంధిపాల, పచ్చకర్పూరము, మోదుగశర్కరలు కాల్చిన బూడిద యీ వస్తువులన్ని సమభాగము లుగా తీసుకొని మెత్తగా మర్ధించి, కుంకుడుగింజ మోతాదు చొప్పున ఇచ్చుచుండిన యెడల అన్నిరకముల విషములను హరించివేయును.

3) కుక్క, కోతి, ఎలుక, పిల్లి, తేలు, పాము మొదలగు వాటిద్వారా శరీరమునకు విషము సంభవించవచ్చును. అంతేగాక కలరా, మలేరియా, క్యాన్సర్, చర్మ వ్యాధులు మొదలగు అనేక వ్యాధులు, శరీరములోనే జనించిన విషక్రిములద్వారా జనించును. వీటి అన్నింటను తులసి ఉత్తమ గుణకారిగా తెలియవలయును.

పాము కరచి తెలివి తప్పిన వ్యక్తికి తులసి ఆకులను బాగుగా రుబ్బి, రసముతీసి, ముఖము, నొసలు, హృదయభాగమున బాగుగా రుద్దుచూ, తులసి స్వరము, అరటి కాడ రసము రెండు కలిపి 10 మి.లీ. వంతున అప్పుడప్పుడు అనగా పదినిమిషము లకు ఒకమారు వంతున త్రాగించుచున్న పూర్తిగా విషహరమై రోగి స్వస్థుడగును తులసి రసమును కన్నులలోనికి, ముక్కులలోనికి వేయుటద్వారానూ, తులసివేరు గంధమును కాటుపై వుంచుటద్వారాను పాము కాటున మంచి ఫలితముపొంద వచ్చును.

4) కుక్కనుంచి చీమవరకు విషమునకు సంబంధించిన ఏదైనాసరే మనిషిని కరచిన, కుట్టినవెంటనే తులసి ఆకును నూరి ఆ ముద్దను దానిపై (కాటు) వేసి రుద్దుట, అంటించుటచే తప్పక విషప్రభావము తగ్గితీరును.

5) తులసి ఆకుల రసమునకు తులసి పువ్వులు, వెన్నలు, చిన్నవేళ్ళుకూడ కలిపి నూరి త్రాగించిన పాము విషము వెనుతిరుగును.

6) దత్తూరు, ఓపియము, పాదరసము మొదలగువాటి విషములకు వీలయినంత తులసి ఆకులు దంచి, ఆవునేతితో కలిపి త్రాగించాలి. మోతాదు 100 నుంచి 500 గ్రా. నేతిని యివ్వవచ్చును. అప్పటికీ విషహరము కానిచో కొంతసమైముఇచ్చి మరలా అదేమోతాదుతో వాడవచ్చును.

7) తులసి ఆకులు, వేరు కలిపి నూరిన గంధమును తేలుకాటు స్థలమున వుంచిన వెంటనే ఫలితముండును. పాము, తేలు, జర్రి, ఎలుక మొదలగువాటి విషములకు కూడా బుద్ధిమంతనముగా తులసి పంచఅంగములను, ఆవునెయ్యి, వెన్న, పాలు, మూత్రములతో కలిపి పై పూతకు - అంజనముగాను, కన్నులకు కలికముగాను ముక్కులోనికి చుక్కలుగాను, పొట్టకు త్రాపించుట మొదలగు క్రియలద్వారా పరిస్థితులను అనుసరించి ఉపయోగించిన మంచి ఫలితముండితీరును.

8) పాముకరచిన వెంటనే కాటుకు నాలుగుఅంగుళములపైన కట్టుకట్టి రెండుగుప్పెళ్ళు తులసి ఆకులను తినిపించవలయును. మరియు తులసివేరు గంధమును వెన్నతో కలిపి కాటుపైనవేసి యుంచవలెను. పాము విషము పీల్చుకొని ఆ వెన్న నల్లబడును. వెంటనే ఆ వెన్నను తీసివేసి. తులసివేరు గంధమును కలిపిన క్రొత్త వెన్నను కాటుపై పట్టించవలయును. ఇట్లు వేసిన వెన్న నల్లబడకుండా వుండే టంతవరకూ కాటుపై తులసివేరు గంధం కలిపిన వెన్నను వేయుచుండవలయును యీ చికిత్సవలన పాముకాటువలన మరణించకుండా అనేకమంది బ్రతికి బయట పడిరి.

9) పాము కరచి తెలివితప్పి పడిపోయినవ్యక్తి నడినెత్తిన (బ్రహ్మరంధ్రస్థానం) వెంట్రుకలనుతీసి కత్తితో గంటుపెట్టి ఆ స్థలమున కృష్ణతులసి ఆకులను బాగుగా నూరిన ముద్దనుంచి అడిపడిపోకుండ బట్టను కట్టాలి. అప్పుడప్పుడు తులసి ఆకుల రసం దానిపై వేయుచుండిన విషము హరించి రోగికి తెలివివచ్చును. తులసివేరు చనుపాలతోనూరిన గంధమును రోగికి కలికముగా కన్నులకుంచాలి. మంచి ఫలితము వెంటనే కనుపించును.

10) తులసి దళములను గోమూత్రంతో రుద్ది, దానిని తేలుకాటున లేపించుట, కొంత తినిపించుటచే మంచి ఫలితముండును.

11) సర్పవిషమున తులసిని ధారాళముగా వుపయోగించవలయును. ఇందుకు కృష్ణ తులసి ఉత్తమము, తులసీరసమును చెవులలో వేయుట, కన్నులకు కలికముగా వేయుట, ముక్కులలో నశ్యముగా వాడుట, కరచిన స్థలమున తులసి వేరుగంధమును లేపించుట, తులసీ రసమును పానము చేయుట మొదలగు విధములుగా తులసిని యథేచ్ఛగా వుపయోగించిన మంచిఫలితము లభించితీరును, ధైర్యముగా చేయవలయును.

12) చనిపోయిన శరీరమును బంధువులు వచ్చువరకూ యుంచవలసిన పరిస్థితులు వచ్చినపుడు, తులసీ మొక్కలున్న ప్రదేశమున యుంచుటగాని, శవముపై తులసి దళములను ఎక్కువగా యుంచుటగానిచేసిన మంచిఫలితముండును. అనగా శరీరము వెంటనే వికృతిపొందదు.

# వీర్యవృద్ధి

1) కృష్ణతులసి వేరుముక్కను తాంబూలములో వుంచి భక్షించుచున్నయెడల స్త్రీ సంభోగమునందు వీర్యస్తంభనము, ఆనందము లభించును.

2) ఒక తులం తులసి ఎండు ఆకులను 10 తులముల నీళ్ళలో మరగించి, కషాయం తయారించి వడబోసుకొని దానికి కొద్దిగా యాలకులపొడి, సాలమిశ్రిపొడిని కలిపి సేవించిన వీర్యవృద్ధి కలుగును.

3) తులసి విత్తులను తమలపాకులో వుంచి రోజూ సేవించిన రక్తము, శుక్రము రెండూ వృద్ధిచెంది, నపుంసకత్వమును పోకడంచును.

4) 15 గ్రా. తులసివిత్తులను 30 గ్రా. పాతబెల్లంతో కలిపి సేవించుచుండిన పలుచ బడిన వీర్యం గట్టిపడును.

5) తులసి సమూల చూర్ణము రెండుతులములు, 40 తు. నీటియందువేసి 1/4 వంతు మిగులునటుల కషాయముకాచి వడబోసి, అందు తగుమాత్రము పాలు, పంచదార దొరికిన పంచదారకు బదులు తేనె చేర్చి. పెన్నేరు, నేలగుమ్మడి, ఏలకులగింజలు వీని చూర్ణములలో దేనినైనను బేడయెత్తు కలిపి కొంచెంవేడిగానున్నపుడు కాఫీ వలె సేవించుచూ వచ్చిన అగ్నిమాంద్యము, అరుచి, పైత్యవికారములుపోయి రక్తవృద్ధి, ఇంద్రియపుష్టి, బలములను కలిగించును.

6) తులసిదళములను నీడను ఎండించి వీటికి సమముగా మెంతులను, అశ్వగంధ చూర్ణమును కలిపి ఆవుపాలతో సేవించిన వీర్యవృద్ధి కలుగును. గనోరియా నెమ్మదించును.

7) తులసివిత్తులు అల్లము సమభాగములుగా తీసుకొని బాగుగా మర్ధించి, బఠాణిగింజ సైజుతో మాత్రలుతయారించి నిలువచేసుకొని, ప్రొద్దున, సాయంత్రం ఒక్కొక్క మాత్రవంతున ఆవుపాలతో విడువకుండా నాలుగునెలలు సేవించిన వీర్యవృద్ధి బాగుగా జరుగును. రక్తనాళములు శక్తిని పుంజుకొనును. జీర్ణశక్తి బాగుగా వృద్ధిపొందును. నపుంశకత్వము పోవును.

8) తులసి దళముల చూర్ణము లేక తులసి వ్రేళ్ళముక్కలు తమలపాకుతో సేవించిన శీఘ్రస్ఖలనము పోవును.

9) కందగడ్డముక్క, తులసివేరు పైపట్ట. రెండు సమభాగములుగా కలిపి మర్ధించి శనగగింజ పరిమాణముతో మాత్రలుచేసి, అందొక మాత్రను తాంబూలంలో వుంచి నమలి మ్రింగుచుండిన వీర్యము స్తంభించును.

10) 50 గ్రా. తులసి విత్తులను, 60గ్రా. చక్కెరతో కలిపి మర్ధించి. పూటకు 5గ్రా. వంతున ఆవుపాలతో సేవించుచూ వచ్చిన పలుచబడిన వీర్యము గట్టిపడును. వీర్య కణములు వృద్ధిచెందును. సంతానప్రాప్తికి దోహదమగును.

11) 40 గ్రా. తులసి విత్తుల చూర్ణమునకు 12 గ్రా. పాతబెల్లమును కలిపి పాలతో విడువకుండా ఒక మండలము (40 రోజులు) సేవించిన వీర్యము గట్టిపడును. వీర్యము వృద్ధిచెంది మంచి పురుషత్వమును కలిగించును.

12) తులసి వ్రేళ్ళముక్కలను తమలపాకుతోపాటు తిన్ననూ స్వప్నస్ఖలనములు ఆగిపోవును.

13) 10 గ్రా. తులసి విత్తులు రాత్రి కుండలోవేసి నీరుబోసి నానవేయవలయును. ప్రొద్దున వాటిని బాగుగా మర్ధించి దానికి 15 బాదామిపప్పు, 16 ఏలకులువేసి కలయనూరి, కావలసినంత చక్కెర కలుపుకొని సేవించిన రాత్రి స్ఖలనములు నిలిచిపోవును. శరీరమునకు శక్తి ముఖమునకు మంచివర్చస్సు కలిగి అందమును పెంపొందించును.

14) తులసి వేరును నీటితో అరుగదీసి ఆ గంధమును రాత్రి నిద్రపోయేముందు రహస్యాంగమునకు లేపనముచేసుకొనిన సంభోగశక్తి అమితంగా వృద్ధిపొందును.

15) తులసి విత్తులను తమలపాకుతో సేవించిన శీఘ్రస్ఖలనము గుణపడును.

16) తులసివేరుమీది పట్టను మరియు సువర్ణగడ్డ చూర్ణమును కలిపి తమలపాకుతో సేవించిన శీఘ్రస్ఖలనము తగ్గును.

## సంతాన ప్రాప్తికి

1) తులసిని నమ్మి పూజలు సలుపుచూ, తులసి దళముల కషాయము, తులసి విత్తుల కషాయము, తులసి సిరప్ వాడుచున్నచో స్త్రీలకు గర్భధారణ కలుగుటకు బాగుగా తోడ్పడును. వీటిని విడువకుండా చాలారోజులు, నెలలు సేవించిన - తులసి దళముల కషాయము స్త్రీ జననేంద్రియ టిష్యూస్‌ను సరిచేయును. విత్తుల కషాయము గర్భకోశమునకు బలమును ఒనగూర్చును. ఇవి తప్పక గర్భధారణకు తోడ్పడును.

2) తులసి దళాలు, నాగకేసరములు, రావిపండ్లు, పెన్నేరు, వృద్ధదారుగింజలు, శొంఠి, మానిపసుపు, పటికబెల్లం వీటిని సమభాగములుగా గ్రహించి, చూర్ణముచేసి, స్త్రీ ఋతుస్నానము చేసినరోజునుంచి పూటకు అరతులం చొప్పున, ఒకేరంగుగల ఆవుపాలతో సేవించుచుండినయెడల ఆ స్త్రీ గర్భమును ధరించును.

3) తులసి విత్తులు నీటిలో నానవేసి దంచి పిండిచేసి ముట్టు మూడుదినములు 10-15 గ్రాములవరకు తీసుకొనుచున్న గర్భకోశము (Uteres) శుద్ధిఅగును. వంధ్యా స్త్రీ యీ చికిత్సను ఒక సంవత్సరము కొనసాగించిన తప్పక గర్భవతియగును.

ఈ చికిత్సను గర్భస్రావము, గర్భపాతములు జరుగు స్త్రీలకుకూడ చాల గుణకారిగాయుండును.

4) తులసి పంచాంగములు, కుంకుమపువ్వు, శతావరి, పుత్రకంద, గరిక వీటిని మర్ధించి. దూడకలిగిన ఆవుపాలు, చక్కెరతో బహిష్ఠు అయిన దినమునుంచి 10-15 దినములు సేవించిన వంధ్యాస్త్రీ గర్భమును ధరించి సంతానమును పొందును.

5) సంతాననష్టము కలుగుచున్న స్త్రీలు తమగర్భాశయమునకు. జననేంద్రియమునకు కాళ్ళకు తులసిని మర్ధించిన గుజ్జుతో ప్రతిదినము బాగుగా రుద్దుట ఆచరించిన తప్పక పుట్టి బ్రతుకు మగశిశువు జన్మించును.

సంతానము లేనివారుకూడా ఈ విధముగా ఆచరించిన ఒక సంవత్సరములో గర్భమును ధరించి ఆరోగ్యవంతమైన సంతానమునకు జన్మనిత్తురు.

## స్పృహ తప్పిన

1) తులసి దళములను ఎక్కువగా తీసుకొని బాగుగా రుబ్బి శరీరమున కంతయూ దీనితో రోజూ అర్ధగంటకాలము రుద్ది తర్వాత అర్ధగంట విడిచి స్నానము చేయు చున్న మూర్ఛరోగము నయమగును. ఈ చికిత్సను విడువకుండ కొద్దిరోజులు చేయవలసియుండును.

2) తులసిఆకు రసములో కొద్దిగా సైంధవలవణము కలిపి మూడుచుక్కలు ముక్కులో వేసినయెడల ఎంతటి స్పృహతప్పి పడిపోయినవారికైనా వెంటనే తెలివివచ్చును.

3) తులసీ తీర్థము (నీళ్ళతో తులసి దళములు వేసియుంచిన నీరు)ను గుక్కెడు ప్రతి అయిదు నిమిషములకు ఒక మోతాదుగా స్పృహ వచ్చువరకూ త్రాగించుచుండ వలెను. విసనకర్రతో గాలి ధారాళముగా వచ్చునట్లు విసురుచుండవలెను. రోగి చుట్టూ జనులు జమకాకూడదు. ఇట్లు గావించిన త్వరగా స్పృహకలుగును.

4) కొద్ది తులసిరసమునకు అతికొద్దిగా ఉప్పుకలిపి ముక్కురంధ్రములకు 2-3 చుక్కలు వేసిన తెలివితప్పి పడిపోయిన వ్యక్తి లేచి కూర్చొనును.

5) రోగికి శీతము కమ్మి. నాడి పడిపోయినపుడు తులసిఆకుల రసమును తేనెతోపాటు మకరధ్వజమను ఆయుర్వేద ఔషధమును నాకించిన మంచి గుణకారిగాయుండును. మరియూ వనతులసి దీనినే అడవితులసి, కుక్కతులసి అనికూడ అందురు. దీని రసమును చేతులకు. కాళ్ళకు పట్టించిననూ చలవలు తగ్గి వేడిహెచ్చి నాడి సక్రమమగును.

6) తులసి లేతచివుళ్ళను, మునగవిత్తులు, నల్లమిరియాలు వీటిని చూర్ణించి తేనెతో సేవించిన మూర్ఛ. అపస్మారము పోవును.

## స్త్రీ వ్యాధులు

ఈ మొక్కకు తులసి, బృంద, లక్ష్మి, వైష్ణవి మొదలగు స్త్రీ నామము లుంచుటతోనే ఇది స్త్రీ వ్యాధులకు ప్రత్యేకమొక్క అని భావించబడుచున్నది.

1) తులసి వ్రేళ్ళను గర్భిణిస్త్రీ మణికట్టుకు కంకణమువలె కట్టుకున్న ప్రసవవేదనతగ్గి సులభముగా ప్రసవమగును.

2) శుంఠిచూర్ణము 2 గ్రా., వేపబంక 2 గ్రా., అజామోదము 2 గ్రా , తమలపాకులు 2 గ్రా. వీటిని సమముగా తులసి పంచఅంగములు వీటిని 100 గ్రా. నీటిలోకలిపి 25 గ్రా. మిగులునట్లు కాచి ఆ కషాయమును చల్లార్చి వడబోసి నియమితముగా సేవించుచున్న రక్తప్రదరములు హరించిపోవును.

3) తులసి రసము 20 గ్రాములను బియ్యము కడిగిన నీటితో సేవించుచూ పాలు అన్నము మాత్రమే తీసుకొనుచున్న శ్వేతప్రదరము (Lucorrhoea) తప్పక గుణమగును.

4) జీలకర్రను తులసిరసముతో నూరి ఆవుపాలతోకలిపి త్రాగిన బట్ట అగుట ఆగి స్త్రీ ఆరోగ్యము కుదుటబడును.

5) బహిష్ఠు సమయమున రక్తము ఎక్కువగ పోవుచున్న. తులసి రసమును తేనెతో కలిపి తీసుకొనుట ఉత్తమముగాయుండును.

6) తులసివేరు చూర్ణము సుద్ద వీనిని సమభాగములుగా కలిపి మర్ధించి పూటకు 1/16 తులము చొప్పున వాడిన తెల్లబట్ట అగుట పోవును.

7) గర్భిణి స్త్రీకి పొత్తికడుపున, చనుకట్టునందు దురద సాధారణముగా యుండును. దానిని గోకిన తెల్లవి మచ్చలు (Silver lines) వచ్చును. ఇవి ఒకమారు వచ్చిన పోవు. గాన దురద సమయమున గోళ్ళతో గోకక, అడవితులసిని దంచి రసమును ఆ స్థలమున పూసిన దురదలు శాంతించిపోవును.

8) తులసి, మామిడల్లము కలిపి నూరి దానిని పొత్తికడుపునకు, జననేంద్రియానికి పూసిన కదలిన గర్భసంచి (Displaced uterus) సరిపోవును. మరియు గర్భిణి సమయములో పొత్తికడుపుకు జనించు దురద, మచ్చలు రాకుండా నివారణ మగును.

9) తులసిదళముల రసమునకు జీలకర్రకలిపి ఆవుపాలు లేక బియ్యపుకడుగు నీటితో ఉదయం, సాయంత్రం రోజుకు రెండుపూటలు సేవించిన ప్రదరము కట్టును.

10) కేవలము తులసి జూస్ త్రాగిన ప్రసవవేదన తగ్గును.

11) తులసి దళముల రసమునకు తగు మాత్రము మిరియముల చూర్ణమును కలిపి మాత్రలుగా తయారించుటకు వేపబంక నీళ్ళను కొద్దిగా కలిపి కుంకుడుగింజ పరిమాణపు మాత్రలు తయారించి, నీడను యెండించి భద్రపరచుకొనవలెను.

బహిష్ఠు అయిన రోజునుంచి నాలుగురోజుల వరకు పూటకు ఒకటి - రెండు మాత్రలువంతున రోజూ రెండుపూటలు వాడినయెడల ఋతుశూలలు హరించును. ఇలా మూడు బహిష్ఠులలో వాడిన చాలును. ఈ మాత్రలు ఏరోజున కారోజే తయారించి ఉపయోగించుట ఉత్తమము.

12) తులసి విత్తులు, నాగకేసరములు, అశ్వగంధ, మోదుగ, రావి ఇవి ఒక్కొక్కటి ఒక్కొక్క గ్రామువంతున సేకరించి, బాగుగా మర్ధించి వస్త్రగాళితముగావించి, 10 గ్రా. ఆవుపాలలో చక్కెరవేసి సేవించిన రెండునెలలలో బహిష్ఠ సక్రమమగును. ఏదోకారణముచే ఆగిపోయిన బహిష్ఠుకూడ జారిఅగును.

13) తులసి విత్తులు, నల్లనువ్వులు, ప్రత్తిమొక్క లేతచిగుళ్ళు, వెదురు లేతచిగుళ్ళు వీటిని ఒక్కొక్కటి 125 గ్రాములవంతున సేకరించి, వీటికి 220 గ్రా. పాత బెల్లము కలిపి అన్నింటిని బాగుగామర్ధించి, బఠాణీగింజ పరిమాణముతో మాత్రలు తయారుచేసి, భద్రపరచుకోవాలి. ప్రొద్దున, సాయంత్రం ఒక్కొక్క మాత్రవంతున వేడిపీటితో సేవించిన బహిష్ఠు జారీఅయి నెలనెల సక్రమమగును.

14) తులసి విత్తులు 12 గంటలు నీటిలో నానవిచ్చి బాగుగా పిసికి, చక్కెర కలిపి (అదేనీటిలో) త్రాపిన సుఖప్రసవమగును.

15) తులసి రసము 20 గ్రా., మొక్కజొన్నఆకుల రసము 20 గ్రా., అశ్వగంధ రసము 20 గ్రా., తేనె 10 గ్రా. కలిపి బాలింతకు త్రాపించిన చనుబాలు వృద్ధి అగును.

16) తులసి ఆకులను పెరుగు లేక మజ్జిగతో వాడిన బరువు తగ్గునని తెలియుచున్నది.

17) తులసి విత్తులను కొద్దిగా నీరు వేపి బాగుగా మర్ధించవలెను. దీనికి రెండింతలు వేపమానె కలిపి వుడికించాలి. కల్కము నల్లగా అగువరకు ఉడికించి, దింపి, పొంగశీతలమైన తర్వాత వడపోసి నూనెను భద్రపరచుకొనవలెను. ఈ నూనెను

ముఖ్యంగా మేహరోగము (Syphilis) పుండ్లకు, ఇతరమైన మొండి పుండ్లకు లేపనముచేసిన గుణమగును.

18) తులసి విత్తులను నీటియందు ఉడికించి మట్టు మూడు దినములు సేవించిన గర్భాశయము శుద్ధి అగును.

19) తులసి విత్తులను 12 గంటల కాలము నీటిలో నానవేసి, ఆ నీటితోనే మర్ధించి, దానికి ఖండచక్కెర చేర్చి త్రాపిన, ప్రసవానంతర నొప్పులు మాయమగును.

20) తులసి రసము, మొక్కజొన్న ఆకురసము, అశ్వగంధ రసమునుచేర్చి, తేనెలో ఏడుదినములు సేవించిన చనుపాలు శుద్ధినొందును.

21) తులసి రసమును బియ్యపుకడుగు నీటితో సేవించుచూ, పాలుఅన్నము, నెయ్యి అన్నము తినుచున్న ప్రదరములు గుణమగును.

22) తులసి రసమునకు ఖండచక్కెరచేర్చి వాడిననూ, తులసీ బీజములను రాత్రి నాన వేసి ప్రొద్దున సేవించిననూ రక్తప్రదరము శాంతించును.

## స్ఫోటకము

1) తులసి ఆకులు 6 మాషములు, మంచి ముత్యములు రెండు రత్తులు, జాపత్రి 3 మాషలు ,కుంకుమపువ్వు 4 రత్తులు, జాజికాయ 4 రత్తులు, లవంగాలు 2 మాషలు, మిరియాలు 20, వీటిని నీటితో నూరి జొన్నగింజంత మాత్రలు తయారించి నీడను ఎండించి సీసాలో భద్రపరచుకొని, పూటకు ఒక మాత్ర వంతున రోజూ మూడుపూటలు మూడుమాత్రలు వంతున స్ఫోటకమున వాడిన మంచి గుణము నిచ్చును.

2) తులసి ఆకులు 7, మిరియాలు 7, కాశ్మీరపు మంచి కుంకుమపువ్వు ఒక చిన్న మెత్తు వీనిని నూరి 7 మాత్రలు జేసి, వీనిని ద్రాక్షపండులో పొదిపి ఉదయము, సాయంకాలము ఒక్కొక్కటి వేసిన యెడల ముత్యములు (స్ఫోటకపు బొబ్బలు) త్వరలో పక్వపడి జ్వరము తగ్గిపోవును. స్ఫోటకపు జ్వరమపుడుకూడ వీనిని వాడ నగును. జ్వరము తగ్గి అమ్మవారు పోయదు. పోసినను సూక్ష్మముగ గనిపించి

తగ్గును స్ఫోటకము ఎక్కువగా నుండెడి కాలమున ఎల్లవారును దీనిని సేవించిన యెడల అమ్మవారి బారినుండి తప్పించు కొనెదరు.

3) తులసి ఎండిన దళములను నీటితో మర్ధించి లేపనము తయారించుకొని ముఖమునకు లేపనము గావించు కొనుచున్న, కొన్నిదినములకు, ముఖకాంతి, వర్చస్సు, కోమలత వృద్ధిచెందును.

## సురాసాది గుణము

శ్లో॥ సురస యుగ ఫణిజ్జం కాలామాలా విడంగం ఖరబు సవృష కర్ణి కట్ఫలం కసమర్దః। క్షవక సరసి భార్గి కాముకా కాకమాచీ కుల హల విషముష్టి భూస్తృణో భూతకేశీ॥ సురసాది గణః

శ్లేష్మ మేదః కృమిని షూదనః। ప్రతిస్యాయారుచి శ్వాస కాసఘ్నో వ్రణ శోధనః॥

తులసి, నల్లతులసి, గగ్గెర, నల్లగగ్గెర (గగ్గెర = అడవితులసి) వాయువిడంగములు, మరువము, ఎలుకచెవి ఆకు, గుమ్మడు, రేగు, కపివెంద, తుమ్మి, సరసి (చాతలాశి), గంటుభారంగి, పిప్పలికాయ, దీనినే బండిగురువింద యని కొందరు చెప్పెదరు. కాచి, నేలకనుము, విషముష్టి, కామంచిపూరి, జటామాంసి, లేక నల్లవావిలి ఇవి సురసాది గుణమనబడును.

ఈ గుణము శ్లేష్మము, మేదోరోగము, కృములు, పీనసము, అరుచి, శ్వాసము, కాసము వీనిని హరింపజేయును. వ్రణమును శుద్ధిజేయును.

## హృద్రోగము : Heart Diseases

1) తులసి దళముల చూర్ణమునకు అర్జున వృక్ష (మద్దిచెట్టు) పట్ట చూర్ణమును కలిపి తేనె అనుపానముతో సేవించిన హృద్‌రోగము గుణపడును.

మధుమేహమున్న రోగికి హృద్‌రోగము వచ్చిన పై మందుమ తేనెతోగాక వేడి నీటితో సేవించవలయును.

2) యెదలో నొప్పివచ్చినపుడు కొద్దిగా తులసి దళములకు 2-3 మిరియాలు కలిపి నమిలి మింగిననూ. తులసిరసము త్రాగుట, తులసిని బాగుగా మర్దించిన గుజ్జును యెదకు పూసిననూ వెంటనే మంచి గుణముండితీరును.

## హిక్క : ఎక్కిళ్ళు : Hic - Cough

1) తులసి స్వరసమును తేనెతో కలిపి సేవించిన ఎక్కిళ్ళు నిలిచిపోవును. గాని కొందరికి విడువకుండా మొండిగా కొన్నిదినములు ఎక్కిళ్ళు వచ్చుచుండుట అరుదుగా జరుగుచుండును. అటువంటి సమయములందు - తులసి, శొంఠి, అతి మధురము, తిప్పతీగ వీటిని సమభాగములుగా గ్రహించి చూర్ణము తయారించి, వస్త్రగాళితము గావించుకొని, తేనెతో సేవించిన ఎక్కిళ్ళు నిలిచిపోవును. తేనెకు బదులుగా పాతబెల్లమునుగాని, పటికబెల్లమునుగాని వాడవచ్చును.

2) తులసి దళములు, తులసి పువ్వులు (కంకులు) కలిపి కషాయమును తయారించి పాతబెల్లమునుచేర్చి సేవించిన ఎక్కిళ్ళు నిలుచును.

## క్షయ : T.B.

1) ప్రతిదినము ఉదయంపూట పావుశేరు పచ్చి ఆవుపాలలో తులసి ఆకుల చూర్ణము ఒక తులము కలిపి త్రాగుచుండినయెడల, పదిహేనురోజులలో క్షయవ్యాధి తగ్గు ముఖముపట్టును. వ్యాధి పూర్తిగా తగ్గేవరకు యీ ప్రకారమే సేవించుచుండ వలెను. తేలికగా జీర్ణమగు ఆహారపదార్ధములు తినుచుండవలయును. మంచిగాలి వీచుచుండు ప్రదేశములలో నివసించుచుండవలయును. ఆవు పేడతో అలుకు చుండు కొట్టము - పరిసరములలో అధికముగా తులసి మొక్కలు పెంచబడిన ప్రదేశము అత్యుత్తమము. ఇట్లు చేయుచున్నయెడల క్షయవ్యాధి నిశ్చయముగా హరించిపోవును.

వల్లభాయిపటేల్ వృక్షసంస్థాన్ - న్యూఢిల్లీ పరిశోధనలవారి మేరకు తులసి మొక్కలలో క్షయవ్యాధిని వృద్ధిచేసే క్రిములను అడ్డగించే శక్తి యున్నదనియు, తులసినుంచి తయారగు తైలము క్షయరోగక్రిములను నశింపజేయునని నిర్ధారించినారు.

From:

**INDIAN METERIA MEDICA**

by **Dr. K. M. Nadkarni**

## 1. Ocimum Album : Telugu : కుక్కతులసి

Sans : Sukla Tulasi Can : Nayi Tulasi

The plant is aromatic, carminative, diaphoretic and stimulant during fever when the extremities are cold, leaves made in to a paste are applied to the finger and toe-nails. The same preparation is used to cure parasitical diseases of the skin such as ring worm etc. Leaf Juice is given to children in cold, catarrh and bronchitis in doses of 1/2 to 2 drachms..

## 2. Ocimum Basilicum :

Sans : Bisva Tulasi; Vara Vara; Manjariki
Eng : Sweet Basil, Hind : Babui; Tulasi; Sabzah
Malay : Tiru-nitru, Tel : Kukkatulasi; Bhu-tulasi
Can & Kon : Kam Kasturi

This small annual shrub or herb is cultivated in gardens in India

**Action :** Diaphoretic, carminative and stimulant. Seeds are mucilaginous, demulcent, adhrodisiac and diuretic. Leaves are fragrant and aromatic. Juice of the plant is anthelmintic. Root is tebrifuge. Antidote to Snake-poison whole plant is aromatic; leaves and leafy tops have a pungent taste and clove-like odour.

**Uses :** Leaves are used for flavouring purpose. Seeds are useful in catarrh, Chronic diarrhoea, dysentery, gonorrhoea

nephritis, cystitis and internal piles; they also relieve the ofter pains of parturition; they are used as an aphrodisiac in doses of from 1 to 3 drachms; a teaspoonful of seeds steeped in a glass of water swell into a mucilaginous jelly and with some sugar forms an excellent drink in the above - named diseases. Juice of the leaves is dropped into the ear in earache and dullness of hearing. Leaves dried and powdered and used like snuff dislodge maggots from the nose. A 12 percent decoction of the plant used as irrigation in nasal myosis produces anaesthesia. It has long been in use in Bengal with like effect for a similar affection known as PINASH.




OCIMUM CANUM Sims

Figs. : 1. Branch, 2. Inflorescence, 3. Calyx, 4. Flower bud, 5. Flower, 5a. Corolla out open, 6. Stamens, 7. Pistil 8. Dise of ovray, 9. Nutlets on dise, 9a. Nutlet

English : The Hoary Basil. Tamil : Nai Thulasi
Telugu : Kukka Thulasi. Malayalam : Kattu Thulasi
Flowering and fruiting time : August-Novemer
Habit : A herb. Habitat : Dry fields and waste places
Propagation : By seed-like nutlets
Number of seeds : 1,000 - 14,000

## 3. Ocimum Canum :

Sans : Gramya; Thiksnamanu. Eng. : Rosary; Tulasi
Hind & Ben. : Kala tulasi. Tel : Tulasi; Kukka tulasi.
Can : Nayitulasi

This is also used in skin diseases. Its uses are like those of O. album.

## 4. Ocimum Caryophyllatum :

Sans : Marubaka. Hind : Gola-tulasi. Ben : Gandha Tulasi

It has two varieties - white and black; the former is used for Medicinal Purposes. It is bitterish acrid, stimulant, light, palatable, generative of digestive fire, fragrant, bilious, and alleviative of wind, phlegm (vata, kafa), worms, leprosy, sula pains, flatulence, loss of appetite, scorpion stings and diseases of skin.

## 5. Ocimum Gratissimum : నిమ్మతులసి

Eng : Shrubby Basil. Sans : Ajeka; Vantulasi.
Hind : Banjari; Ramtulasi. Tel : Nimma-tulasi

It is styptic, stimulant, demulcent, diuretic and carminative; It is generally combined with expectorants

in cough mixtures. Infusion of the seeds is used in doses of 1/2 to 1 ounes in urinary disorders, such as gonorrhoea scanty and scalding urine etc. Leaf-juice is also given in such cases in rice water. Baths and fumigations of the plant are used in rheumatism. Aromatic roots are used like balm.

## 6. Ocimum Longifolium or Longiflorum :

It is found in Assam and Southern India. Leaves are made into a tea and used in the treatment of diseases of the kidneys and bladder and other urinary organs.

## 7. Ocimum Pilosum :

Sans : Khara Pushpa. Eng : Green Basil. Hind : Babestul

it is found throughout India. Seeds are mucilaginous. demulcent and nutriout given in gonorrhoea, strangury, spermatorrhoea and kidney diseases; also in dysentery and cough and to relieve pains of parturition, jelly is given in Spermatorrhoea.

## 8. Ocimum Minimum :

Sans : Maruvaka. Eng : Bush-basil

It is a species found all over India and its flowers and leaves are aromatic, and are used for seasoning.

## 9. Ocimum Sanctum :

Sans : Vishnu-Priya; Tulasi; Divya; Bharati; Krishnamul.
Eng : Holy Basil; Mosquito plant of South Africa.
Hind : Kala-tulasi. Ben : Krishna tulasi. Tel : Krishna tulasi




*Ocimum sanctum.*

1. English name : Sacred Basil. 2. Vernacular name : Tulasi

3. Economic importance : The seeds are used in chronic diarrohea and dysentery. Decoction of the leaves is said to be useful in cold.

This small herb is found throughout India and cultivated near Hindu houses and temples. Leaves, and seeds and root is used.

**Action :** Demulcent, expectorant, and antiperiodic. Dried plant is stomachic and expectorant. Leaves are anti-catarrhal, expectorant, fragrant and aromatic.

**Uses :** The plant drives away mosquitoes. Leaves ground with water are applied on bed boils. Infusion of the leaves is given in malaria and as a stomachic in gastric diseases of children and inhepatic affections. Persons affected with bad blood etc., should drink the juice of basil leaves and also apply the same by itself or preferably mixed with juice of Lemon as a paste for radical cure. Dried plant in decoction (1 in 10) is a domestic remedy for croup, catarrh, bronchitis and diarrhoea. Decoction of the leaves with the addition of a little cardamom powder and about a tola of salep powder, makes a nourishing and aphrodisiac drink. Dried leaves are used as snuff in myiosis and ozoena. Expressed leaf-juice serves as a rasayana if taken twice half a tola weight or one chattach every morning increases the complexion and charm of the person, and if used while any epidemic such as influenza, malaria, cholera etc., rage, is a prophylactic. Leaf juice poured into the ear is a first rate remedy for earache. It also cures chronic fever haemorrhage, dysentery and Dyspepsia. Mixed with a little ginger, Leaf-juice is given for colic in children, and one tola of it mixed with quarter tola of black pepper is given in catarrhal fever and in the cold stages of intermittent fever. Fresh juice checks vomiting and destroys intestinal worms with honey, ginger and onion juice it forms

a good expectorant remedy useful in cough, bronchitis and children's fever. Following pill is recommended in vomiting : Take of leaves of ocimum Sanctum, seeds of Zizy phus jujuba and Sugar candy, each 3 mashas and black pepper one masha and pure water sufficient quantity; and make pills of this about the size of wild plums. A man who has lost consciousness being struck with thunder or by being seriously poisoned by snake - bite should be fed with the juice (2, 3 or 4 days) of its leaves. Thus there will again be electric current in the system and both the sorts of affictions will be cured there by. Repetition of doses after some time is necessary.

In case of snake-bite, of a very bad kind, even if the patient is totally unconscious and dead like, feed helf a tola of the juice internally if possible, other wise apply all over the body, fill the navel, ears, eyes, mouth with it and sufficiently. Repeat the process and the patient will be cured. If basil root is held in the arm, there is no fear of thunders. If a garland prepared of small beads of the wood of basil plant trunk is worm in the neck, then electric current is generated and some diseases are cured thereby. No sudden attack of any germs is possible. If basil root is taken 4annas weight, at eve, increases the vital fluid and will bestow retentive virtue. Weakmen may take half-anna weight of root -powder with ghee daily in the evening, which will bring electric current into play. Powder of the root rubbed slightly on a scorpin bite will give relief from pain.

# తులసి : హోమియోపతి ఉపయోగము

## 1. అసిమం కారియోఫైల్లాట : Ocimum Caryophyllatum

ఇది ఒకరకమగు తులసి. మూత్రపిండములు, మూత్రకోశము, మూత్ర నాళములకు సంబంధించిన వ్యాధులమీద ఈ మందు గొప్పగ పనిచేయును. మూత్ర పిండముల వాపు, మూత్రపిండములకు రక్తప్రసరణాధిక్యత, రక్తముతోకూడిన మూత్రము మొదలగు వ్యాధులకీమందు మేలుచేయును. సెగరోగ ప్రథమదశలో ఇది ఉపయోగపడును. మూత్రమును విసర్జించునపుడు అమిత మంటగానుండును. మూత్ర మును తరుచు విసర్జించుచుండును. ఈ లక్షణములతో జ్వరముండవచ్చును. మూత్ర ములో చీముండును. శుక్రనష్టమునకు, సెగకు ఈ మందు ముఖ్యముగా ఉపయోగ పడును. రక్తముతోకూడిన గ్రహిణి (Dysentery) యందుకూడ ఈ మందు మేలుచేయును. ప్రసవానంతర నొప్పులకు వాడతగును.

పొటెన్సీ : ఈ మందును 1×, 3×, 6× మొదలగు పొటెన్సీలలో తరుచు వాడుటకలదు.

## 2. అసిమం సాన్క్టం - Ocimum Sanctum : నల్లతులసి

మతిమరపు ఈ మందు కొక ముఖ్యలక్షణము. ఈ రోగి తాను సాధారణంగా చేయవలసిన పనులను మరచిపోవుచుండును. మాట్లాడునపుడు మతిమరపువల్ల తప్పుగ మాట్లాడుచుండును. మనస్సు చాలకలతనొంది యుండును. ఏపనివి శ్రద్ధగచేయలేడు. ఏ విషయముమీద మనస్సును కేంద్రీకరించలేడు. నిస్త్రాణగనుండి నిద్రమత్తుగ నుండును. ప్రశ్నలకు సమాధానము చెప్పుచునే నిద్రపోవును. సంధికి ఒక క్రమ ముండదు. చంటిపిల్లవాడు క్షోభముగనుండి ఏడ్చుచుండును. ఎత్తుకొని త్రిప్పుటచే ప్రశాంతముగ నుండును. (కేమోమిల్లా). ఈ మందు జ్వరములమీద చాల గొప్పగ పనిజేయును. చిన్నపిల్లలకు పండ్లువచ్చునపుడు కలుగు జ్వరములు, దగ్గు, జలుబు, విరేచనములు, న్యుమోనియా, బ్రోంకైటీస్, బ్రోంకో న్యుమోనియా ఉబ్బసములతో

 మాన హానికంటే ప్రాణహాని మేలు

కూడియుండు రెమిటెంటు జ్వరములు. సన్నిపాత జ్వరమందుగాని, సంధితో కూడిన జ్వరమందుగాని రోగి నిద్రమత్తుగ పరుండును. నిస్త్రాణగనుండును. సమాధానము చెప్పుచునే నిద్రపోవును. (బాప్టీషియా). దగ్గుతో చరుకగు నొప్పులతోను కూడియున్న జ్వరములు ఇన్‌ఫ్లూయంజా. కండరములు పుండువలెనుండును. ఎముకలందుకూడ నొప్పులుండును. (యుపటోరియం పెర్ఫోలియాటం). తలనొప్పి భయంకరముగ నుండును. నాలుక అంచులు అతి ఎర్రగనుండి మధ్యభాగము చాల తెల్లగనుండును. పెదవులు పొడిగ, నల్లగను ఉండును. విడుప (మలేరియా) జ్వరములమీదకూడ ఈ మందు గొప్పగ పనిచేయును. అమితచలితో జ్వరము మధ్యాహ్నము కలుగుచుండును. హస్తములు, పాదములు అతి చల్లగ నుండి, తిమ్మిరితోను, జిలతోను ఉండును. ఎండలో కూర్చున్ననూ చలితగ్గదు. దాహముండవచ్చును. ఉండకపోవచ్చును. శరీర మంతయు కాళ్ళయందు, పాదములందు నొప్పులుండును. ఉష్ణదశలో అమితమగు వేడి కలిగి ముఖమునందు కన్నులందు వేడి పరంపరలు కలుగును. అరిచేతులు అరికాళ్ళు మంటగనుండి చల్లగాలి తగులుటచే సుఖముగ నుండును. తలమీద చన్నీరుపోసి కొనుటచే మంట తగ్గును. ఉష్ణముచే చెమటకూడ పట్టును. ఉష్ణము చెమట, చలి ఉష్ణము తారుమారగు చుం(డును)డ వచ్చును. జ్వరము వానకాలమందు కలిగినను. శీతాకాలమందు కలిగినను, మరేకాలమునందు కలిగినను ఈ మందుపయోగపడును. సన్నిపాత జ్వరమందుకూడ ఈ మందు ఉపయోగపడును. చలిగ వుండవచ్చును. ఉష్ణముండవచ్చును. శరీరమంతట మంటయుండవచ్చును. చెమట, సంధి, నిద్రమత్తు లేక మగత మొదలగు లక్షణములుండవచ్చును.

తలనొప్పి భయంకరముగ వుండును. నడచుటవల్లగాని, కదలికవల్లగాని తల నొప్పి అధికమగును. తలకు గాలి విసరుట, శీతలోదకమును పోసికొనుట, ప్రశాంత ముగ నుండుటవల్లను, తలకు బట్టను చుట్టుబెట్టుకొనుటవల్లను తలనొప్పితగ్గును. కన్నులు ఎర్రనై నీరుకారును. ఇట్టి లక్షణములలో ఈ మందు కుదుర్చును. నడినెత్తిమీద వేడిగనుండును. కంటి జబ్బులకుకూడా యీ మందుపయోగపడును. ఏదైన వస్తువును తదేకముగ చూచునపుడు కన్నులముందు పొగమంచు ఉన్నట్లుండును. కన్నులకలక, వెలుతురును చూడలేడు, కన్నులంటుకొనును. చెవులందు శబ్దముగ వుండును. పెద్ద శబ్దమువల్ల చాల బాధకలుగును. చెవులనుండి దుర్వాసనకల చీము స్రవించును,

చెముడు. జలుబుచే చెవులు నొప్పిగ వుండును. చెవులనుండి వేడి పరంపరలు వచ్చుచుండును. తరచు తుమ్ములతోను, తెల్లని లేక పచ్చని స్రావముతోను ఉండు జలుబు ముక్కునుండి నీటివంటి స్రావము కారును. ముక్కు రంధ్రములు పుండుపడును. ముక్కునుంటి రక్తస్రావము కలుగును.

పెదవులు అతిఎర్రగను, పొడిగను ఉంటి ముఖము ఎర్రగావి, పాలిపోయి గాని యుండును. ముఖము పేడిగా వుండును. నీటివంటి లాలాజలము స్రవించుచుండును. నోటియందు రుచి కుళ్ళుగను, చేదుగను వుండును, నోరు పుండుపడును. నోటియందు తెల్లని చిన్నపుండ్లుండును. చిన్నపిల్లల నోరు, నాలుక పుండుపడును. నాలుక అంతయు ఎర్రగ వుండవచ్చును. లేక మధ్యభాగము చాల తెల్లగనుండి అంచులు ఎర్రగ వుండవచ్చును. పెదవులు పొడిగ నల్లగ వుండును. పంటినొప్పి చాల భయంకరముగ వుండును. నొప్పి రాత్రి అధికమై, స్పర్శవల్లను, చల్లదనమువల్లను ఉద్రేకించును. నోటినుండి దుర్వాసన కలుగుచుండును. లాలాజలం దుర్వాసనగ వుండును. గొంతుకలో నొప్పిగవుండును. గుటకవేయునపుడు నొప్పిగ బాధగవుండును. దగ్గునపుడు, తుమ్మునపుడు, నడుచునపుడు, గొంతుకలో నొప్పిగ వుండును. గొంతుకలోపలివైపు ఎర్రగవుండును. గొంతుకలోనుండు రెండుటాన్సిల్సు పెద్దవగును, గొంతుక పుండుపడును, గొంతుక స్వరముమారును, గొంతుక బొంగురు పోవును.

ఉదరకుహరము వాయు పూరితమై ఉబ్బరించును. త్రేన్పులు, ఆకలి లేకపోవుట, ఎక్కిళ్ళుండును. ఉదరకుహరములో గుడగుడ లుండును. ఉదరకుహరము బరువుగనుండి తరుచు మలవిసర్జన చేసినను ఆ బరువుతగ్గదు. ఉదరములో శూలవంటి నొప్పియుండవచ్చును. కాలేయ మండలములోను ప్లీహమండలములోను నొప్పిగ వుండును. కుడివైపు పొత్తికడుపులో నొప్పిగవుండి అచట నొక్కిన గుడగుడశబ్దము కలుగును. ప్రేగులందలి జీర్ణకోశమందలి ఆమత్వక్కు వాపుతో జ్వరము విరేచనములుండును. విరేచనములు నీటివలెనుండి, విస్తారముగనుండి చాల దుర్వాసనగవుండును. పచ్చగగాని, ఆకుపచ్చగగాని, రేగడిమన్ను రంగుగగాని యుండును. గ్రహణి, చీము విరేచనములు లేక రక్తముతోకూడిన విరేచనములు తీవ్రజ్వరములందు రోగికి తెలియ

కుండగనే విరేచనమగుచుండును. తరుచు మలవిసర్జనచేసినను ఉదరకుహరపు ఉబ్బరం తగ్గదు. ఇట్టికకపు విరేచనములు జ్వరముతోను, జలుబు, దగ్గు, న్యుమోనియా, బ్రోంకైటీస్ మొదలగు ఎట్టి వ్యాధితోవున్ననూ యీ మందు మేలుచేయును. వాన కాలమందును, ఆకురాలు కాలమందును కలుగు విరేచనములు, చిన్నపిల్లలందు కలుగు క్రిముల నీ మందు పోగొట్టును. క్రిములతో చంటిపిల్లవాడు క్షోభముగనుండి, నిద్ర నుండి వులికిపాటుగాలేచును. చిన్నపిల్లవాడు వైద్యుని పరీక్షించనీయడు.

చిన్నపిల్లలు పక్కలో మూత్రమును అప్రయత్నముగ పోయుచుందురు. మూత్రమును విసర్జించినపుడు, మూత్రనాళములో మంటగనుండును. మూత్రము ఆమముతోగాని, చీమువంటి పదార్థముతోగాని కూడియుండును. చాల తరచుగ మూత్రమును విసర్జించవలయునని వుండును.

ప్రసవానంతరము కలుగు మైలు చాల దుర్వాసనగనుండి సహజమగు రంగులో నుండక చాలకాలము స్రవించుచుండును. ప్రసవానంతరము విస్తారమగు రక్తముతో కూడిన స్రావములు కలుగుచుండును. స్రావము చీమువలెనుండి చేపలు కడిగిన నీటి వలె వుండును. ఋతువు క్రమముగ వుండక చాలకాలము స్రవించును, కుసుమ, గర్భకోశ వ్యాధులు మొదలగునవి ఈ మందును ప్రసవానంతరము వాడినయెడల కలుగజాలవు.

ఛాతీ యిరువైపుల నొప్పులుండి, దగ్గువల్ల, తుమ్ముటవల్ల అధికమగును. రోగి ప్రశాంతముగ పరుండలేడు. ఛాతీ యందు ప్లూరా వాచుటచే కలుగు నొప్పులు, ఉబ్బసము కలుగుచుండును. పసివారియందు, చిన్నపిల్లలయందు కలుగు ఉబ్బసమునకు ఈ మందు చాల గొప్పది. ఛాతీ యందు ఊష్మధ్వనులు, గురకయుండును. ఉబ్బసం నందు రోగి వీపుమీద పరుండలేడు. అట్లు పరుండినయెడల శ్వాస చాల కష్టముగ నుండును. రోగి ముందుకు వంగి తలను చేతులమీదకాని, మోచేతులను మోకాళ్ళమీద పెట్టుకొనుటగాని, ముందుకు వంగి చేతులను టేబిల్ మీదగాని, బల్లమీదగాని ఆని చేతులపై తలను పెట్టుకొనుటవల్లగాని శ్వాస కొంత సుఖముగ ఆడును. రొమ్ముఎముక మధ్యభాగమందు నొప్పిగనుండును.

అనేకరకములగు చర్మవ్యాధులలో యీ మందుపయోగపడును. తులసి సూక్ష్మక్రిమి సంహారమగుటచే చనిపోవువాని సూక్ష్మజీవులు ఇతరులకు సోకకుండుటకై హిందువులు చనిపోయిన వానిని తులసి కంపతో దహనము చేయుటకలదు. చనిపోవునపుడు తులసితీర్థమును ఇచ్చుటకలదు. చెవినుండి కలుగు చీమునకు, వ్రణములలో సూక్ష్మక్రిములు ఏర్పడినపుడు తులసి ఆకు చూర్ణమును వాటిపై జల్లుటకలదు. తామరకు తులసి ఆకులు సున్నముతో కలిపి ఆయుర్వేద వైద్యులు పైకివాడుట కలదు. దగ్గు, గురక, జలుబులతో బాధపడుచుండు చిన్నపిల్లలకు తులసిఆకు రసము తేనెతో కలిపి పట్టించెదరు.

పొటెన్సీ : 1×, 2×, 3×, 6×, 12×, 30. 200 మొదలగు పెద్ద పొటెన్సీలలో సాధారణముగ వాడుట కలదు.

## 3. ఆసిమం గ్రాటిస్సిమం : Ocimum Gratissimum
## రామతులసి

రామతులసి : దీని ఆకులు ఇతర రకముల తులసి ఆకులకన్న పెద్దవిగనుండును. ఈ మందు సాధారణముగ సెగయందుపయోగపడును. మూత్రమును విసర్జించునపుడు మంటగనుండును. మూత్రము చీముతో కలిపియుండును. మలబద్ధమునకున్ను, పిల్లలకుకలుగు జలుబు, దగ్గు, జ్వరములకు ఈమందుపయోగపడును.

పొటెన్సీ : ఈ మందును 1×, 3×, 6×, 30 పొటెన్సీలలో సాధారణముగ వాడుట కలదు.

(హిందూదేశ మూలికలు హోమియోపతి ఉపయోగము
By వేమవరపు వెంకటరమణయ్యశర్మ)

## 4. ఒసిమం కానం : Ocimum Canum

బ్రెజిల్ దేశపు తులసి. మూత్రకోశము. మూత్రవిసర్జన నాళపు వ్యాధులకిది సిద్ధౌషధమువంటిది. మూత్రపిండములందు శూల, ఉద్భృతమగు వాంతులతో, బాధభరించ

లేక చేతులను నులుముకొనుచు, బిగ్గరగమూల్గుచు. ఏడ్చుచుండును. శూలకలిగినపిమ్మట మూత్రం ఎర్రగనుండి, అందు ఇటుకపొడివంటి లేక ఇటుకవంటి పదార్ధముండును. మూత్రము కుంకుమపువ్వు రంగుగగాని చిక్కగ, చీముతో భరింపశక్యముగాని కస్తూరి వాసనగగాని యుండును. మూత్రములో ఎర్రని ఇసుకవంటి పదార్ధముండుట ముఖ్యలక్షణము. (లైకొ). మూత్రపిండములందు రాళ్ళు, మూత్రము చాల ఆమ్ల యుతముగనుండి మూత్రికామ్లము స్ఫటికములవలె ఏర్పడును. కుడి వృషణము ఉబ్బి చాల నొప్పిగ నుండును. స్త్రీ జననేంద్రియముబ్బి, అందు నొప్పిగ నుండును. యోని దిగజారును, (బొరాక్సు), దురద, స్తనాగ్రములు చాల నొప్పిగనుండి ఏ మాత్రము స్పర్శవల్లనైన బిగ్గరగఏడ్చును. కీళ్ళవాతము, పైత్యరసోద్రేకతచే కలుగు జ్వరములు. ఈ మందు తర్వాత డైస్కోరియా బాగుగ పనిచేయును. సరిపోల్చుము : డైస్కో, కాల్కే. బెర్బె, కొలొ. హెడియొను, లైకొ, పరైర, యుర్టిక.

పొటెన్సీ : 6, 12, 30, 200 : 1M.

(A complete Homoeopathic Meteria Madica. వేమవరపు వెంకట రమణయ్యశర్మగారి పుస్తకమునుంచి)



# దీర్ఘరోగములను చికిత్స సలుపునపుడు

1) దీర్ఘరోగులకు తులసిని ప్రతిదినం 3-4 మార్లు ఇవ్వవలెను. దీనిజతకు ఇతర మందులు అనుపాన భేదములతో ఉపయోగించవలెను. మందు జతకు బలవర్ధక మందులు (Vitamins) కూడా ఇచ్చుచుండవలెను.

2) రోగికి కూరగాయలు, మొలకెత్తిన పెసలు వగైరాలున్ను, దూర్వా (గరికగడ్డి) రసము, పండ్లు, వెన్నతీసినపాలు, పెరుగు మొదలగు ఆహారపదార్థములను కాలము, రోగి-రోగము పరిస్థితులనుబట్టి వాడవలసియుండును.

3) తులసి సుధను తయారించి రోగిచే త్రాగించుచుండవలెను. తులసిదళములను నీటిలో పుడికించుచూ దాని జతకు దాల్చినచెక్క, లవంగములు, ఏలకులు మరియు అల్లమువేసి బాగా పుడికించి చల్లారినతర్వాత నిమ్మరసము కలపాలి. ఇదియే తులసిసుధ.

4) ఉప్పు, చక్కెర, తీపిమిఠాయిలు, టీ, కాఫీ, మైదాతో తయారైన తినుబండార ములు, పొగాకు, సిగరెట్లు వగైరాలు పూర్తిగా విసర్జించవలయును.

5) రోగి మాంసాహారియైనచో మాంసము, చేప, గ్రుడ్డు తినకూడదు. మద్యము కూడా సేవించకూడదు. అలాగే మత్తును కలిగించు ఏ పదార్థమును గాని సేవించ కూడదు.

6) (నేచర్‌క్యూర్) ప్రకృతిచికిత్సకు సంబంధించిన చికిత్సా విధానములను అవసర మగుచోట ధారాళముగా ఉపయోగించుకోవాలి.

7) రోగి ఆచరించుటకు వీలున్న యోగాసనములు, ప్రాణాయామాదులు ఆచరించుట ఉత్తమము.

8) ప్రార్థన, ధ్యానము అత్యంత ఉత్తమ చికిత్సావిధానమని గుర్తించి వీలున్నంత కాలము వీటిని చేయుచూ గడపాలి.

---

మితాహారం శరీరానికి ఎంతఅవసరమో, మితవాక్కు చిత్తశుద్ధికి అంతకంటె అవసరం

మన ఆయుర్వేద మహర్షుల ఆదేశానుసారము తులసి ఒకటి, రెండు రోగాలను మాత్రమే నివారణ చేయుటకాదు - గుండె జబ్బులు, వీర్యాన్ని వృద్ధిచేయుటయేకాక మంచి గుణవత్తరంగా అనగా వీర్యవంతంగా చేయుట, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును, అతిసారము, మూలవ్యాధి, మూత్రకోశమున రాళ్ళను నిర్మూలించుట, మందగించిన ఆకలిని వృద్ధిచేయుట, అరుచిని పోగొట్టుట, చర్మవ్యాధులను నిర్మూలించుట, క్రిమి రోగములు, నొప్పులు, ఇసిపి, దుర్గంధమును బోగొట్టుట, గర్భకోశ వ్యాధుల నిర్మూలనము, వంధ్యాత్వము, కాన్పు నొప్పులు, మలబద్ధత, పంటినొప్పులు, చెవినొప్పులు, మూత్రకృచ్ఛము, మూత్రనాళ దోషములు, ఆస్త్మ, సాధారణ జ్వరములు, వాంతి, నోటిపూతలు, కంటివ్యాధులు, రక్తక్షీణత, కుష్ఠు, బొల్లి, స్త్రీ వ్యాధులు, ధనుర్ వాయువు మొదలగు నూరార్ల రోగములు ఒక్క తులసి నుంచే నివారణ జరుగు ననియూ - మరియూ పరిసరవాతావరణమునుకూడా పరిశుభ్రపరచునని తెలియుచున్నది.

ఇంతటి యుపయోగకారియైన తులసియొక్క ప్రాశస్త్యమును కొంత తెలుసుకొందము.



"ఇతర్ల పనులకు పాలుమాలితే భగవంతునికి సమాధానము చెప్పవలసి ఉంటుంది, సొంతపనులకుకూడా చెప్పవలెనేమో కాని - అంతదండన ఉండదనుకుంటాను"

- శరత్

# నాల్గవ అధ్యాయము

# తులసీ ప్రాశస్త్యము

వేదాలలోని భాగమైన ఆయుర్వేదము వృక్షములకు, మొక్కలకు, లతలకు అత్యున్నతస్థానం ఇచ్చినది. అందులోనూ రావి, వేప, బిల్వశమి, ఉశిరిక వృక్షములకు, మొక్కలలో తులసిని దేవతావృక్షములుగా భావించి పూజించుట, వాటిచుట్టు అరుగులు కట్టి ప్రదక్షిణలు సలుపుట సాధారణము. బుద్ధునికి జ్ఞానోదయమైనది రావిచెట్టుక్రిందనే గాన దానిని బౌద్ధులు పరమపవిత్రంగా భావిస్తారు. సిలోన్‌యందు అనూరాధపురము నందలి ఒక రావిచెట్టుకు బంగారు కటాంజనము వేయించి పూజిస్తారు.

అనాదినుండి తులసి మొక్కను ప్రత్యేకముగా హిందువులు తమ ఆరాధ్య దైవంగా తమ ఇంటి ఆవరణములలో పెంచుట, అందుకు ప్రత్యేకముగా బృందావనము అని కట్టించుట, దానిచుట్టూ ఆవుపేడతో అలికి ముగ్గులుపెట్టి మొక్కకు ప్రొద్దున సాయంత్రం నీరుపోసి, పూజచేసి, దీపము వెలిగించి, అగరుబత్తి అంటించి, పసుపు, కుంకమ, పుష్పములు వుంచి పూజసల్పుట ఈనాటికి జరుగుచునేయున్నది. ముఖ్యంగా స్త్రీలు అన్నివయస్సులవారు తులసిని పూజిస్తారు. చాతుర్మాస్యము నాలుగునెలలూ ఈ కార్యక్రమము ప్రత్యేకముగా నిర్వహించబడును.

కార్తీక శుక్ల నవమినాడు తులసికి వివాహమైనట్లు పద్మపురాణమున చెప్పబడి యున్నది. గాన ఆనాడు తులసి మొక్కను చూచినా, ఆరాధించినా పాపవిముక్తి లభిస్తుంది. తులసిమొక్క నీడలో శ్రద్ధతో ఏకార్యాన్ని నిర్వహించినా పితృదేవతల ఆత్మశాంతిస్తుంది. అంతేగాక తులసిమొక్క దగ్గర దీపారాధన గావించినవారికి విష్ణు లోకప్రాప్తి కలుగుతుంది. నర్మదానదిని తిలకించడము, గంగలో స్నానమాచరించ టము, తులసిమొక్కను స్పృశించడము ఈ మూడుకార్యములు ఒకేఫలితమును ప్రసా దించునని పద్మపురాణమున ఉత్తరకాండలో తెలుపబడినది. ఇంకనూ వేదాలన్నిటికిని, తీర్థాలన్నిటికినీ నమస్కరించిన ఫలితము ఒక్క తులసికి నమస్కారముచేయుట ద్వారానే పొందగలమని వివరించుట జరిగింది.

శివాలయములేని గ్రామములోను, తులసి మొక్కలేని ఇంటిలోను భోజనము చేయరాదు అని ధర్మశాస్త్రమున తెలుపబడియున్నది.

ప్రతినిత్యము తులసిమొక్కను పూజించినవారికి మోక్షప్రాప్తి కలుగుతుందని గౌరీతంత్రములోని ఈ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

శ్లో॥ యే తులసి సేవాంకుర్వంతి గిరి సంభవే।
నానోపహారస్తైయా న్తితద్విష్ణోః పరం పదం॥
యేకుర్వంతి మహాభాగే తులసీ నామ కీర్తనం।
తద్వనంచ పశ్యంతి విష్ణునైవ సమాహితే॥

ఒక సందర్భమున విఘ్నేశ్వరుడంతటివాడు తులసిని ఈ క్రిందివిధముగా ప్రార్థించినాడు.

శ్లో॥ పుష్పాణాం సారభూతాత్వం భవిష్యసి మనోరమే।
కలాంశోన మహాభాగేస్వయం నారాయణ ప్రియా॥
ప్రియాత్వం సర్వదేవానాం కృష్ణస్యచ విశేషతః।
పూజా విముక్తి దాన్వణాం మమత్వాజ్యాచ సర్వదా॥
(బ్రహ్మ వైవర్త పురాణం - గణపతి ఖండం నుంచి)

సాటిలేని సుందరమైన ఓ తులసి, విష్ణుమూర్తి అంశానివైన నీవు పుష్ప రాజానివి. సకల దేవతలచేత ఆరాధింపబడే నిన్ను ఆరాధించినవారికి మోక్షప్రాప్తి కలుగుతుంది.

శ్లో॥ యత్రైకస్తులసీ వృక్షః తిష్ఠత్యపిచ సత్తమ।
తత్రైవ త్రిదశా స్సర్వే బ్రహ్మ విష్ణు శివాదయః॥
కేశవః పత్రమధ్యేచ పత్రాగ్రేచ ప్రజాపతిః।
పత్రవృంతే శివ స్తిష్ఠేత్తుల స్యాస్సర్వదైవహి॥

ఒక్క తులసి మొక్కైన వున్నచోట బ్రహ్మ, విష్ణువు, శివుడు మొదలగు దేవతలందరు ఉంటారు. తులసియాకు మధ్యలో విష్ణువు, చివర బ్రహ్మదేవుడు, తొటిమలో శివుడు ఎల్లప్పుడు ఉంటుంటారు.

శ్లో॥ లక్ష్మి సరస్వతీ చైవ గాయత్రీ చండికా తథా।
సర్వాశ్చాన్యా- దేవపత్న్యః తత్పత్రేషు వసంతి హి॥
ఇంద్రోగ్ని శ్శమన శ్చైవనైర్రుతి ర్వరుణ స్త థా।
పవనశ్చ కుబేరశ్చ తచ్ఛా ఛాయాం వసం త్యమీ॥

లక్ష్మి, సరస్వతి, గాయత్రి, చండిక అట్లే దేవతల భార్యలు అందరు తులసి ఆకులలోనే ఉంటుంటారు. ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు ఆది దిక్పాలకులందరు తులసి కొమ్మల్లోనే వుంటారు.

శ్లో॥ కోటి బ్రహ్మాండ మధ్యేషు, యాని తీర్థాని భూతలే।
తులసీదళమాశ్రిత్య తాన్యేవ నివసంతి హి॥
తులసీం సేవతే యస్తు భక్తిభావ సమన్వితః।
సేవితాస్తేన తీర్థాశ్చ దేవా బ్రహ్మాదయ స్తథా॥

• అనంత బ్రహ్మాండముల మధ్యభాగములోను, భూభాగంలోను వుండే తీర్థాలన్నీ ఒక్క తులసీదళాన్ని ఆశ్రయించే వున్నాయి. గాన భక్తిభావముతో తులసిని సేవిస్తూ పూజించిన అన్ని పుణ్యతీర్థాలను బ్రహ్మాది సకల దేవతలను సేవించినట్లు, పూజించినట్లు అగును.

శ్లో॥ ఛిందంతి తృణజాలని తులసీమూల జానియే।
తద్దేహ స్థాం బ్రహ్మహత్యాం హరిర్హంతత్క్షణాత్॥

శ్లో॥ వైశాఖేఽక్షతధారాభిః అద్భిర్యస్తులసీం నరః।
సించయేత్సోఽశ్వమేధస్య ఫలం ప్రాప్నోతి నిత్యశః॥

శ్లో॥ కదాచిత్తులసీం దుగ్దైః సేచయే ద్యోనరోత్తమః।
తస్యవేశ్మని విప్రర్షే లక్ష్మీర్వసతి నిశ్చలా॥

తులసి పరిసరములలో వుండే గడ్డి మొదలగు కలుపుమొక్కలను పీకివేస్తే బ్రహ్మహత్య పాతకమునుకూడ విష్ణువు పోగొట్టును.

ముఖ్యముగా వేసవిలో తులసి మొక్కకు సంతృప్తిని కలుగునట్లు నీటిని పోసే వారు అశ్వమేధయాగ ఫలితాన్ని పొందుచున్నారు.

ఏ మానవుడు ఎప్పుడైనా తులసిని పాలధారతో తడిపిన అనగా పాలను తులసి మొదలులో నీటివలె పోసిన వారింటిలో లక్ష్మీదేవి అచంచలముగా నివాసముండును.

శ్లో॥ గోమయైస్తులసీ మూలం యఃకుర్యాదుపలేనమ్।
సమ్మార్జనంచ విప్రర్షే తస్య పుణ్యఫలం శ్రుణు॥

శ్లో॥ రజాంసి తత్రయావంతి దూరీ భూతాని జైమినే।
తావత్కల్ప సహస్రాణి విష్ణు నా మోదతే సదా॥

శ్లో॥ ప్రదీపం యస్తు సంధ్యాయాం స్థాపయే త్తులసీ తలే।
సయాతి మందిరం విష్ణోః కులకోటి సమన్వితం॥

ఓ జైమినిమహర్షి ఆవుపేడతో తులసిమొక్కయున్న బృందావన ప్రదేశమును అలికి ముగ్గులుంచేవారికి కలుగు ఫలితాన్ని చెప్పుచున్నాను- విను. అక్కడి దుమ్ము (కసువు) కణాలు ఎన్నింటిని దూరముగా త్రోసివేయబడతాయో అన్ని కల్పసహస్రాలు ఆ మానవుడు విష్ణు లోకంచేరి నిరంతరం ఆ భగవంతునితో సంతోషిస్తూవుంటాడు.

సంధ్యాకాలములో తులసిమొక్క వద్ద దీపము వుంచేవారు తన వంశంలోని వారితోగూడ వైకుంఠాన్ని పొంది సుఖింతురు.

శ్లో॥ ప్రభాతే తులసీం పశ్యేత్ భక్తిమాన్ యోనరోత్తమః।
సవిష్ణు దర్శన స్యైవ ఫలం ప్రాప్నోతి చాక్షయమ్॥

శ్లో॥ తులసీ స్మరణేనైవ సర్వపాపం వినశ్యతి।
తులసీ స్పర్శనేనైవ నశ్యంతి వ్యాధయోనృణామ్॥

భక్తిభావంగలవాడు నిద్రలేచిన వెంటనే తులసిని దర్శించినంత మాత్రముననే అక్షయమైన విష్ణుదర్శన ఫలితాన్ని పొందుచున్నాడు. తులసిని స్మరించినంత మాత్రంతో పాపాలన్నీ నశించిపోతున్నాయి. స్పృశించినంతమాత్రంతో రోగములన్ని నశించి పోవుచున్నవి.

శ్లో॥ తులసీ పత్ర గళితం య స్తోయం శిరసా వహేత్।
గంగాయాః స్నానజం పుణ్యం లభతే నాత్ర సంశయః॥

శ్లో॥ దూర్వాభిరక్షతైః పుష్పైః నైవేద్యైస్తులసీం శుభామ్।
సమారాధ్యనరో భక్త్యా విష్ణు పూజాఫలం లభేత్॥

తులసీదళాల పయినుండిపడే నీటిని తలపయిన చల్లుకొనేవారు గంగాస్నానము చేసిన పుణ్యాన్ని నిస్సందేహంగా పొందుచున్నారు. మరియు గరికతో, అక్షతలతో పుష్పములతో శుభప్రదమైన తులసిని పూజించి నైవేద్యమును సమర్పించి భక్తిభావముతో తులసిని ప్రార్థించువారు విష్ణు పూజాఫలితమును పొందుచున్నారు.

ఎవరు నారాయణమంత్ర జపమును సాగించి సిద్ధిపొందవలెనని ప్రయత్నిస్తారో వారు స్వయంగా ఎనిమిది దిక్కులలోను, ఎనిమిది తులసిమొక్కలునాటి వాటి మధ్యన అరుగును నిర్మించి, ఆ మొక్కలపై నీళ్ళు చల్లి వాటిపైనుండివచ్చు తులసీ పరిమళమును పీల్చుచూ, ప్రాణాయామము ధ్యానము, మంత్రజపము చేయవలయును. ప్రతిదినము ఆవుపాలతో తులసీదళములను చేర్చి, సాలిగ్రామమునకు పురుషసూక్త, శ్రీసూక్తములతో అభిషేకము గావించి, ఆ తీర్థ (పాలు) జలమును తులసిమొక్కకు పోసి, మిగిలినవాటిని తీర్థముగా స్వీకరించి జపము చేయవలెను.

ఇంతేగాక ప్రతినిత్యం తాను చేసిన జపం తర్పణముగా తులసి మొక్కనందే విడవాలి. అలా పెరిగిన తులసిమొక్కలనుండి ఏర్పడిన కర్రతోనే జపమాలను తయారుచేయాలి. మొక్క సహజముగా మరణించిన (ఎండిపోయిన) తర్వాతనే మొక్కకు పసుపుతాడు కట్టి, ముమ్మారు ప్రదక్షిణముచేసి, టెంకాయకొట్టి, కర్పూర హారతిచ్చి, మొక్కను త్రవ్వి తీయవలయును. దానిని నీడనే ఎండించి, ఆ కర్రతో జపమాల పూసలు తయారుచేయాలి. వీటిని ఆవునేతితోనూ, ఆ తరువాత ఆవు పంచితములోను, ఆవుపాలయందు రెండేసి రోజులుంచి ఆ తరువాత శుద్ధిచేసి, ప్రాణ ప్రతిష్టచేసి జపమాలను వాడాలి.

సన్నివేద్యైవ హరయే తులసీకాష్ఠ సంభవామ్।
మాలాం పశ్చాత్ స్వయం ధత్తేసవై భాగవతోత్తమః॥

- స్కాంద పురాణము (హరిభక్తి విలాసము)

పైన వివరించిన విధముగా తయారైన జపమాలను హరికి నివేదించి యావలయెవడు ధరించునో వాడు భాగవతోత్తముడు.

యః పునస్తులసీమాలాం కృత్వాకంఠే జనార్దనమ్।
పూజయేత్ పుణ్యమాప్నోతి ప్రతి పుష్పం గవాయుతమ్॥

తులసీకాష్ఠ సంభూతాం యో మాలాం వహతే నరః।
ప్రాయశ్చిత్తం నతస్యాస్తి నాశౌచం తస్య విగ్రహే॥

తులసీకాష్ఠ మాలాభిభూషితో భ్రమ తోయది।
దుస్స్వప్నం దుర్నిమిత్తంచ నభయం శస్త్ర జంక్వచిత్॥

- స్కాంద, గరుడ పురాణములు

ఎవడు తులసిమాలను కంఠమున ధరించి, జనార్ధనుని పూజచేయునో, వానికి ప్రతి పుష్పమునకు పదివేల గోదానములు చేసిన పుణ్యము లభించును.

ఎవడు తులసి కట్టెతో జేసిన పూసలమాలను ధరించునో, వానికి ప్రాయశ్చిత్త మక్కరలేదు. వాని దేహమునకు మైలలేదు. తులసీకాష్ఠ మాలను ధరించి తిరుగు వానికి దుస్వప్నములవలన, దుశ్శకునములవలన, శస్త్రములవలన భయమెన్నడును కలుగదు.

ఎవరి జపమాలను వారే భద్రముగా ఇతరులు వాడకుండా, తాకకుండా కాపాడు కోవలెను. పట్టుబట్టతో తయారించిన సంచిలోగాని, శిల్కుగుడ్డలోగాని మూటగట్టి, అందు కొన్ని తులసీదళములుంచి భద్రపరచుకొనవలెను. జపమాల క్రిందపడుటగాని, మైలపడుటగాని జరిగిన తిరిగి శుద్ధి చేసుకొనవలెను. జపమాల కంఠములో వున్నంత వరకు అఖండ బ్రహ్మచర్యమును పాటించితీరవలయును. గృహస్థులైన సాయంత్రం జపమాలనుతీసి పూజాస్థానములో వుంచి తిరిగి స్నానానంతరము ఉదయము పూజా నంతరము ధరించవలెను.

శ్లో॥ తులసీ కాష్ఠ సంభూతాం మాలాం వహతి యోనరః।
తద్దేహే పాతకం నాస్తి సత్యమే తన్మ యోచ్యతే॥

తులసీ కర్రముక్కలతో చేసిన పూసలదండ ధరించినవాని శరీరంలో పాపా లుండవని నేను నిజంగా చెప్పుతున్నానని వ్యాసమహర్షి తెలిపినాడు.

శ్లో॥ తులసీ కాష్ఠ సంభూతే మాలే విష్ణు జనప్రియే।
త్వాం ధారయామ్యహం కంఠే కురుమాం విష్ణువల్లభమ్॥

అని ప్రార్థనచేస్తూ తులసీమాలను కంఠమున ధరించవలయును.

శ్లో॥ తతస్సర్వేషు కాలేషుధార్యా తులసి మాలికా।
క్షణార్థం తద్విహీనోఽపి విష్ణుద్రోహీ భవేన్నరః॥

శ్లో॥ యజ్ఞోపవీత వద్ధార్యా సదా తులసి మాలికా।
క్షణమాత్ర పరిత్యాగాత్ విష్ణుద్రోహీ భవేన్నరః॥

ఎల్లప్పుడూ తులసిమాలను ధరించాలని, యజ్ఞోపవీతంవలె ఎప్పుడు తీపివేయకుండా ధరించాలని, తీపివేయడంవల్ల విష్ణుద్రోహి అవుతాడని తెలియుచున్నది.

తులసిమాలను హారంగా ధరించిన అశ్వమేధయాగ ఫలితములభిస్తుంది. జపమాచరించుటకు తులసీమాల ప్రశస్తమైనది. జపమాచరించు మాలను మెడను ధరించరాదు. వేరువేరుగా రెండుమాలలుండవలెను.

శ్లో॥ సంఘృష్ట తులసీ కాష్ఠ యోదద్యాద్రామ మూర్ధని।
కర్పూరాగరు కస్తూరీ చందనంచ నతత్సమం॥

తులసీ చెక్కతో గంధముతీసి విష్ణువుకు పూస్తే కర్పూరం, అగరు, కస్తూరి, చందనము ఇవేవీ దానితో సమానం కాలేవు.

శ్లో॥ తులసీ మంజరీభిర్యః కుర్యాద్ధరి హరార్చనమ్।
నసద్గర్భగృహం యాతి ముక్తి భాగీ భవేన్నరః॥
(హరిభక్త విలాసం)

తులసీదళాలతో విష్ణువునుగాని, ఈశ్వరునిగాని (హరిహరులను) అర్చించేవాడు మరల జన్మనెత్తడు. మోక్షమును బొందును.

తులసీదళాలు దేవతలందరి పూజకు (ఒక్క గణపతికితప్ప) పనికివస్తాయి. హనుమంతుని పూజకు తులసీదళాలు ముఖ్యమనే విషయం హనుమత్కల్పంలో వివరించబడియున్నది.

## తులసి ఆకులను కోయుముందు పాటించవలసిన నియమాలు :-

శ్లో॥ అస్నాత్వా తులసీం చిత్వాయః పూజాం కురుతేనరః।
సోఽపరాధీ భవేత్స త్యం తత్సర్వం నిష్ఫలం భవేత్॥

స్నానమాచరించకుండా తులసిని కోసి పూజించేవారు నిశ్చయముగా తప్పుచేసిన వాడే అగును. వాడుచేసిన పూజంతా నిష్ఫలమే అవుతూందని వాయుపురాణమున ఉన్నది. గాన స్నానమాచరించిన తర్వాతనే భక్తితో దళములు కోయవలెను. పడమటి మొగమై తులసిని గ్రహింపరాదు.

శ్లో॥ మాతస్తులసి గోవింద హృదయానంద కారిణీ।
నారాయణస్య పూజార్థం చినోమి త్వాం నమోస్తుతే॥

తులసీ దళాలను త్రుంచునపుడు ఈ పై శ్లోకమును పఠించి మూడుమార్లు కరతాళధ్వని చేస్తూ తులసీదళాలను అవసరమగు మేరకుమాత్రమే త్రుంచి, నమస్కరించాలి. త్రుంచునపుడు కొమ్మలను విసురుగా వదలటంగాని, కొమ్మలు విరగడం గాని వాంఛనీయంకాదు.

శ్లో॥ తులస్య మృతజన్మాసి, సదాత్వం కేశవప్రియే।
కేశవార్థం లునామిత్వా, వరదా భవ శోభనే॥

శ్లో॥ మోక్షైకహేతో ధరణి ప్రసూతే, విష్ణో స్సమస్తస్యగురోః ప్రియతే।
ఆరాధనార్థం పురుషోత్తమస్య, లునామి పత్రం తులసి క్షమస్వ॥

శ్లో॥ ప్రసీదమమదేవేశి, ప్రసీద హరివల్లభే।
క్షీరోదమథనోద్భూతే, తులసి, త్వం ప్రసీదమే॥

అమ్మా! తులసీమాతా నీవు అమృతంనుంచి జన్మించినావు. కేశవునికి ప్రియురాలివి. కల్యాణీ – భగవంతుణ్ణి పూజించడానికే నేను నీ దళములను కోయుచున్నాను నాకు వరాలనిమ్మా. నారాయణుని పూజింపడానికే నీ దళాలను గిల్లుచున్నాను. నీవు లేకపోతే కేశవుడు తృప్తిచెందడు. నీవులేకపోతే దేవ, పితృకార్యాలన్నీ నిష్ఫలములే. అందువల్లనే నీ దళాలను కోయుచున్నాను. నీవు వరప్రదాయినివి కావాలి. నీ దళాలు

గిల్లేటప్పుడు నీకు బాధ కలుగుతుంది. జగన్మాతా - నన్ను క్షమించు. నీకు ప్రణామం చేయుచున్నాను. అని క్షమాపణ కోరుతూ దళములు తెంచుటకు ప్రారంభించవలయును.

శ్లో॥ అకాలే తులసీ పత్రం ఛేదయే ద్యస్సవై పుమాన్।
పత్రాదేకాద్బ్రహ్మహత్యా సోఽవశ్యం నరకం వ్రజేత్॥

అకాలములో ఒక్క తులసీపత్రం కోసినా బ్రహ్మహత్యనుబొంది నరకాన్ని అనుభవిస్తారు అని చెప్పబడియున్నది, గాన పూజకొరకు తులసీదళములు కోసేముందు ఈ కాల నియమాలను పాటించాలి.

శ్లో॥ పూర్ణిమాయాం అమాయంచ ద్వాదశ్యాం రవి సంక్రమే।
తైలాభంగేచ స్నానేచ మధ్యాహ్నే నిశిసంధ్యా యోః॥

శ్లో॥ అశౌచేఽ అశుచి కాలేచ రాత్రి వాసాన్వితే పివా।
తులసీం యేచ చిన్వంతి తే ఛిందంతి హరే శిరః॥

అనగా పౌర్ణమి, అమావాస్య. సంక్రమణం రోజులలోనూ. అభ్యంగన అనగా శరీరాధ్యంతము నూనెరాచుకొని స్నానానికి ముందుగాని, అపరాహ్నం, రాత్రి, సంధ్య వేళయందు, జాతాశౌచమృతాశౌచములందు, అపవిత్రముగా వున్నసమయములందును, రాత్రి దుస్తులు ధరించి యున్నపుడుగాని తులసిని కోయరాదు. వీటిని పాటించక కోసిన విష్ణుమూర్తి శిరస్సునే తృంచినట్లు భావించనగును. మరియు ఆదివారము, మంగళవారము, గురువారము ముఖ్యముగా శుక్రవారమునాడు ప్రతినిత్యం తులసితో అర్చనచేసే వాడైనప్పటికి తులసిని కోయరాదు. ద్వాదశిరోజు, శ్రవణా నక్షత్రమునాడు పురుడు, అంటు ఉండే దినాల్లో తులసిని త్రెంచకూడదని బ్రహ్మవైవర్త పురాణము చెబుతూంది. అందుచే పూజకుగాను బృందావనమున పెంచుకొన్న మొక్క విషయంలో యీ నియమాలు పాటించుచూ, వైద్యానికి అందుబాటులో యుండుటకు ఇంటి ఆవరణములో క్రోటన్సువలె విరివిగా తులసి మొక్కలను పెంచుకున్న - వాడుకొనుటకు వీలుండును. ఔషధముగా ఆపద్విషయముగా వాడుకొనునపుడు మినహాయింపున్నది. అనగా వైద్యన కెందును అడ్డురాకూడదన్నమాట. అందుచే అతనిని మనవారు వైద్యో నారాయణోహరిః అని అన్నారు. విష్ణు పూజకు తులసిని, హోమంకొరకు సమిధలను, ఆవులకు గడ్డి ఏరోజైనను కోయవచ్చునని "శ్రీహరి భక్తి విలాసమనే"

గ్రంథమున ఉన్నది. తులసిని స్త్రీలు కోయరాదు అని పెద్దలు చెప్పుదురు. ఒకవేళ అవసరమైనచో మగవారి చేతనే శుచిగా యున్నపుడే కోయించుకోవాలి అని తెలియ నగును.

తులసిని కోయునపుడు విడి ఆకులను, కొమ్మలను కోయరాదు. అనగా దళ ములుగా కోయతగును. దళాలను కోసేటప్పుడు మొక్క కదలకుండా రెండవ చేతితో దళములను కోయుచోట పట్టుకొని తొందర తొందరగాకాక, నిదానముగా కోయవల యును. తులసీ దళములను పురుషులు కోయవచ్చునుగాని గోటితో గిల్లరాదు. చూపుడువ్రేలు, చిటికెనవ్రేలును వదలి, మిగిలిన మధ్యమవ్రేలు, ఉంగరపువ్రేలు, బొటనవ్రేలుతో జేర్చి దళములు త్రుంపవలెను. త్రుంపబోవునపుడు విష్ణు ప్రియమగు తులసీ మాతను స్మరించుట మరువకూడదు. అంతేకాదు కోసిన ఆ దళాలను దేవతా పూజకే వాడవలయును.

తులసి విష్ణుప్రియురాలు గాన విష్ణు పూజా సమయమున ఆమెను (తులసిని) అతని పాదాలచెంత - పాదములపై వుంచవలయునేగాని అతని తలపై వుంచరాదు. గణపతికి తులసిని వుపయాగించరాదు. గాని వినాయకచవతి దినమున మాత్రము పూజకు వుపయోగించవచ్చును.

శ్లో॥ వర్జ్యం పర్యుషితం పుష్పం వర్జ్యం పర్యుషితం జలమ్।
నవర్జ్యం తులసీపత్రం నవర్జ్యం జాహ్నవీ జలమ్॥

భగవంతుని పూజకు చద్దిపూలు, చద్దినీరు పనికిరాదు. కాని తులసీదళాలు - గంగానదినీరు చద్దివైనా పనికివస్తాయని తులసి మృత్తికయందు లేక జలమునందు పడినదయినను కడిగినచో శుద్ధమగును అని స్కాంద పురాణం - వైశాఖమాస మహాత్మ్యంలో చెప్పబడియున్నది.

శ్లో॥ తులస్యాం బిల్వ పత్రేచ జలజే షుచ సర్వశః।
నపర్యుషిత దోషోఽస్తిమాలాకార గృహే షుచ॥

తులసి, బిల్వపత్రము, తామరపుష్పములకు పర్యుషితదోషం అనగా నిన్నటిది, మొన్నటిది అనే దోషం యుండదని విష్ణు ధర్మోత్తరపురాణం చెప్పింది. అందునూ తులసి పదిదినములు నిల్వయున్నప్పటికి పూజకు పనికివస్తుందని స్కాంధ పురాణంలో

దశాహం తులసీదళం అనియున్నది. లేతపైన తులసీదళాలతో హరిని పూజించేవారికి అనంత హిరణ్య దాన ఫలితము లభిస్తుందని ఇదే పురాణంలో అవంతి ఖండమున చెప్పబడియున్నది.

గరుడ పురాణంలోని ప్రేతకల్పములో తులసీ మహిమను గురించి క్రింది విధముగా చెప్పబడియున్నది.

శ్లో॥ అర్చయేద్గంధ పుష్పైశ్చ కుంకుమైస్తులసీదళైః।
దూపైర్దీపైశ్చ నైవేద్యైర్బహు భిర్మోదకాదిభిః॥

ప్రాణముపోవు సమయములో సాలగ్రామాన్ని గంధ పుష్పాలతో కుంకుమతో తులసీ దళాలతో, దూపదీప నైవేద్యాదులతో, మోదకాలతో పూజింపవలెనట.

ఏకాదశీవ్రతము, భగవద్గీత, గంగాజలము, తులసీదళములు విష్ణు పాదోదకము, భగవన్నామము - ఇవి అంతిమ సమయములో ముక్తిని కలిగిస్తాయనికూడ చెప్పబడి యున్నది.

శ్లో॥ తులసీవిటపచ్ఛాయా యత్రాస్తి భవతాపహా।
తత్రైవ మరణాన్ముక్తిః సర్వదా దానదుర్లభా॥

సమస్త భయములను, తాపములను పోగొట్టునట్టి తులసిమొక్కయొక్క నీడ యెంతవరకూ వ్యాపించియుండునో, అక్కడ మృతి నొందినయెడల, నెల్లపు డెన్ని దానములు జేసినను పొందశక్యముగాని మోక్షమునుపొందును.

శ్లో॥ తులసీ విటపస్థానం గృహేయస్యావతిష్ఠతే।
తద్గృహం తీర్థరూపం హినయాంతియమకింకరాః॥

శ్లో॥ తులసీ మంజరీ యుక్తోయస్తు ప్రాణాన్ విముంచతి।
యమస్తం నేక్షితుం శక్తోయుక్తం పాపశతైరపి॥

ఎవనియొక్క గృహమునందు తులసిమొక్క ఉండునో ఆ గృహము సమస్త పుణ్యతీర్థముల స్వరూపముకలది యగును. కాబట్టి యట్టి ప్రదేశమునకు యమభటులు రారు-రాలేరు. ఎవడు (మంజరితో) తులసీదళముల మాలను ధరించి ప్రాణములను విడుచుచున్నాడో, అట్టివాడు విశేషపాపములను జేసినవాడైనను యమధర్మరాజు వానివద్దకు వచ్చి వానిని జూచుటకైనను సమర్థుడు కాడు - కాలేడు.

శ్లో॥ తస్యాదళం ముఖేకృత్వా తిల దర్భాసనేమృతః।
నరోవిష్ణుపురం యాతి పుత్రహీనోఽప్యసంశయః

శ్లో॥ తిలాః పవిత్రాస్త్రి విధాదర్భాశ్చ తులసీరపి।
నరం నివారయం త్యేతే దుర్గతిం యాంత మాతురమ్॥

ఏ మనుష్యుడైనను (ముఖమునందు) తులసిని నోటనుంచుకొని, తిలలు (నువ్వులు), దర్భలు పరచబడిన యాసనంబున మృతినొందినయెడల వాడు పుత్రులు లేనివాడైనను వైకుంఠమును పొందును. సందేహమేమియునులేదు.

నూగులు, దర్భలు, తులసిదళములు – నరకానికి పొయ్యే ప్రాణులనుగూడ కాపాడి సద్గతిని కలిగిస్తాయి అని చెప్పబడియున్నది. ఈ విషయమున వ్యాసభగవానులు యీ క్రింది విధముగా వివరించినారు.

శ్లో॥ తులసీ మృత్తికా పుంద్రం యో మృత్యు సమయే వహేత్।
సముక్తస్సకలైః పాపైః పురం గచ్ఛతి చక్రిణః॥

శ్లో॥ తులసీ కాష్టజనం యస్తు చందనంధార యేన్నరః।
తద్దేహం నస్పృశేత్పాపం క్రియ మాణరుసీహయత్॥

శ్లో॥ యస్యస్యాత్తులసీ పత్రం ముఖేశిరసి కర్ణయోః।
మృత్యుకాలే ద్విజశ్రేష్ఠ తస్యస్వామినభాస్కరిః॥

మరణ సమయంలో తులసీ బృందావనములోని (మట్టిని) మృత్తికను ముఖమున బొట్టుగా పెట్టుకొనేవాడు (పెట్టించుకున్నవాడు) సమస్త పాపములనుంచి విముక్తుడయి వైకుంఠాన్ని చేరుతున్నాడు.

తులసిమొక్క మొదలు వేళ్ళక్రిందయున్న మృత్తికను తీపి దానిని శరీరమున– హృదయస్థానంలో, భ్రూమధ్య, కంఠం, నాభి, శిరస్సునందు పూసుకొని ఎవ్వరు ప్రాణములు విడుతురో అట్టివానిపైన యముడు చేరి చూడజాలడు.

మరణసమయంలో ముఖముపై, శిరస్సుపై, చెవులలో తులసిదళముండినవాణ్ణి యముడు ఏమీచేయలేడు. మరియు సాక్షాత్ లయకర్తఅయిన చంద్రశేఖరుడు నారద మహర్షితో తులసీ మహిమను యీ పై విషయమును గూర్చి వివరిస్తూ :–

# తులసి వ్రతము

శ్రీ తులసి కార్తికపూర్ణిమా శుక్రవారమునాడు జన్మించింది. కార్తీకశుక్ల నవమినాడు ఈమె వివాహమైనట్లు పద్మపురాణములో కనిపిస్తుంది. గాన వ్రతము ఆచరించదలచినవారు ఆనాటినుంచే చేయాలనే నియమమేర్పరచుకున్నారు.

మొదట స్నానాదులతో శరీరము శుద్ధిగావించుకొనవలెను. వ్రత సమయంలో ఇంద్రియ సంయమనము ముఖ్యము. మనోనిగ్రహంతో ప్రతిదినం రాత్రివేళ తులసీ వన సమీపంలోగాని వనములేనిచో తులసిమొక్క సమీపములోగాని భగవంతునిస్మరిస్తూ శయనింపవలెను. చరువు వండి విష్ణు దేవతాప్రీతికి హవనం చేయవలెను. ద్వాదశి నాడు భగవత్పూజానంతరం, పంచరత్న (బంగారము, రత్నము, నీలము, పద్మరాగము ముత్యము), పంచపల్లవ (మామిడి, మేడి, మర్రి, రావి, జువ్వి వీటిచిగుళ్ళు) ఓషధీ సహితంగా కలశస్థాపనచేసి, దానిపై ఒక పాత్రనుంచి దానిలో వట లక్ష్మీనారాయణ ప్రతిమనుంచవలెను. వైదిక పౌరాణిక మంత్రాలను ఉచ్చరిస్తూ తులసీమొక్క మూలంలో ఆ కళశాన్ని ప్రతిష్ఠింపవలెను. తులసీ బృందావనిలో నీరుపోయవలెను. తరువాత భగవత్ప్రతిమకు పంచామృత స్నానం చేయించి షోడశోపచార విధానంతో పూజించి భగవంతుని ప్రస్తుతింపవలెను.

ఆనాటి రాత్రి జాగరణచేసి భగవన్నామ సంకీర్తనముతో సద్గ్రంధ పఠనంతో, భజనతో, స్మరణతో, మననంతో కాలక్షేపం చేయవలెను.

మరునాటి ప్రాతః కాలములో స్నానాదులు ముగించి బ్రాహ్మణులను పిలిపించి భక్తితో వైష్ణవశ్రాద్ధం చేయవలెను. అటుపై బ్రాహ్మణులను భోజన తాంబూల దక్షిణలతో సంతృప్తిపరచి, భగవత్కృపను బొందగోరి భగవంతుని పాదపీఠికి ప్రణమిల్లవలెను. శ్రీ లక్ష్మీనారాయణ ప్రతిమను కలశవస్త్ర సహితంగా పురోహితునకు దానమీయవలెను.

నవమినుండి మూడురాత్రులిట్లు చేయవలెనని వ్రతరాజమనే గ్రంథములో చెప్పబడియున్నది. వేప, అశ్వత్థ వృక్షముల నొకచోటవేసి (వేప-ఆడి, రావి-మగ) వాటికి వివాహము చేయింపవలెను. ఈ తులసీవ్రతాచరణ ప్రభావమువల్ల ప్రాచీన

---

సౌశీల్యము, సంపద ఒకేచోట ఉండటం అరుదు

కాలములో కాంచీపురంలోని నిరుపమాన సౌందర్యవతియైన కిశోరికి వైధవ్యం తొలగి పోయిందని వ్రతమాహత్మ్యంలో చెప్పబడింది. ఇతర గ్రంథాలను అనుసరించి ఉత్థానైకాదశినుండి పూర్ణిమా పర్యంతము అయిదురోజులు ఈ వ్రతాన్ని ఆచరించవలసి వుంది.

## తులసీ ధ్యానము

చేతిలోనికి పూలు, అక్షతలు, గ్రహించి చేతులు జోడించి

శ్లో॥ ధ్యాయేచ్చ తులసీం దేవీం । కమల లోచనాం।
ప్రసన్నాం పద్మవదనాం । వరాభయ చతుర్భుజాం॥

శ్లో॥ కిరీట హారకేయూర । కుండలాది విభూషణాం।
ధవళాంకుశ సంయుక్తా । పద్మాసన నిషేవితాం॥

శ్లో॥ తులస్యమృత జన్మాసి సదాత్వం కేశవప్రియే।
కేశవార్చన యోగ్యేమే వరదా భవ సర్వదా॥

శ్రీ తులసీ దేవ్యైనమః ధ్యాయామి
అని పూజను ప్రారంభించవలయును.

## ఆవాహనము

శ్లో॥ దేవి త్రైలోక్య జనని । సర్వ లోకైక పావని।
ఆగచ్ఛ వరదేమాతః । ప్రసీద తులసీ ప్రియే॥
శ్రీం హ్రీం క్లీం ఐం బృందావనై స్వాహా ఆవాహయామి.

శ్లో॥ సర్వ దేవ మయే దేవి । సర్వదా విష్ణు వల్లభే।
దేవీ స్వర్ణమయం దివ్యం । గృహాణాసన మవ్యయే॥
శ్రీం..........స్వాహా. నవరత్నఖచిత సింహాసనం సమర్పయామి.

శ్లో॥ సర్వే దేవాయథాస్వర్గే । తథాత్వంభువి సర్వదా।
దత్తం పాద్యం గృహాణేదం । తులసీత్వం ప్రసీదమే॥
శ్రీం............స్వాహా. పాదయోః పాద్యం సమర్పయామి.

శ్లో॥ గంధ పుష్పసమా యుక్తం । సర్వేషాం ప్రీతి దాయకమ్।
అర్ఘ్యం గృహాణత్వం దేవిదైత్యాంత కరుణప్రియే॥
శ్రీం............స్వాహా. హస్తయోరర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ కర్పూర వాసితం తోయం, సువర్ణ కలశేస్థితమ్।
దత్తమాచ మనీయంచ। గృహాణ హరి వల్లభే॥
శ్రీం............స్వాహా. శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో॥ స్వర్ణ పాత్రే సమానీతం దధిఖండ మధుప్లుతం।
మధుపర్కం గృహాణేదం, మయాదత్తం సురేశ్వరి॥
శ్రీం............స్వాహా. మధుపర్కం సమర్పయామి.

శ్లో॥ పంచామృతం మయానీతం, పయోదధి ఘృతం మధు।
శర్కరా సంహితందేవిస్నానార్థం ప్రతి గృహ్యతామ్॥
శ్రీం............స్వాహా. పంచామృత స్నానం సమర్పయామి.

పంచామృతమనగానేమియో కొద్దిగా చూతము. పెరుగు, నెయ్యి. ఈ రెండు పాలునుండి ఉత్పన్నమగుటచే పాలు, పెరుగు. నెయ్యి ఈ మూడు ఒకే పదార్థముగా పరిగణించి, దీనిజతకు తేనె, చక్కెర, అరటిపండు, కొబ్బరినీరు ఈ నాలుగు పదార్థములు చేర్చుటచే పంచామృతమగును. ఇది క్యాన్సర్‌వ్యాధికి మంచిమందు వివరాలకు చూడుము 'ఆచారాలు - శాస్త్రీయత' అను గ్రంథమును.

శ్లో॥ గంగా గోదావరీ కృష్ణా। కావేర్యా ద్యాపగా స్తదా।
అయాన్తు తాస్సదా దేవ్యా। స్తులసీ స్నాన కర్మణి॥
శ్రీం............స్వాహా, మాలాపకర్షణ స్నానం సమర్పయామి.

శ్లో॥ గంగా సరస్వతీ రేవా। పయోష్ణీ నర్మదా జలైః।
స్నాపితాఽసియథా దేవి। తథా శాంతిం కురుష్వమే॥
శ్రీం............స్వాహా. శుద్ధోదక స్నానం సమర్పయామి.

శ్లో॥ క్షీరోదమథనో ద్భూతే। చంద్రలక్ష్మీ సహోదరీ।
గృహ్యతాం పరిధా నార్థం। ఇదం క్షామాంబరం శుభే॥
శ్రీం............స్వాహా. వస్త్రం సమర్పయామి.

శ్లో॥ కంచుకం చోప వస్త్రంచ। నానారత్నై స్సమన్వితమ్।
గృహాణత్వం మయాదత్తం। తులసీ భవ హారిణి॥
శ్రీం............స్వాహా. కంచుకీ ముపవస్త్రం సమర్పయామి.

శ్లో॥ స్వచ్ఛం నిర్మల మత్యంతం పురతస్తే కృతం శుభం।
కంఠ సూత్రం గృహాణత్వం దదామ్యా భరణానిచ॥
శ్రీం............స్వాహా. ఆభరణాని సమర్పయామి.

శ్లో॥ కేసరా గరు సంయుక్తం చందనాది సమన్వితం।
కస్తూరికాసమాయుక్తం కుంకుమం ప్రతి గృహ్యతామ్॥
శ్రీం............స్వాహా. కుంకుమం సమర్పయామి.

శ్లో॥ అక్షతాంశ్చ మహాదేవి। తులసీ భాగ్యదాయికే।
అర్పయామి సదా భక్త్యా। సుఖ సంతతి లబ్ధయే॥
శ్రీం............స్వాహా. అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ హరిద్రాం కుంకుమం చైవ సింధూరం కజ్జలాన్వితం।
మయా నివేదితం భక్త్యా గృహాణ పరమేశ్వరి॥
శ్రీం............స్వాహా. మంగళ ద్రవ్యాణి సమర్పయామి.

శ్లో॥ మాల్యాదీని సుగంధీని మాలాత్యా దీని సత్తమే।
మయా హృతాని పూజార్థం పుష్పాణి ప్రతి గృహ్యతామ్॥
శ్రీం............స్వాహా. పుష్పాణి సమర్పయామి.

# తులసి పూజ

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వ దేవతాః।
యదగ్రే సర్వవేదాశ్చ తులసి త్వాం నమామ్యహం॥

అని పఠించుచు నమస్కరించి తులసి మొక్కపై శుద్ధోదకమును ప్రోక్షించి-

శుద్ధోదక స్నానం సమర్పయామి॥ అని చెప్పవలయును.

హరిద్రాం లేపయామి॥ తులసికి పసుపును పూయవలయును.

కుంకుమం ధారయామి॥ కుంకుమ ఉంచవలయును.

పుష్పం పూజయామి॥ పుష్పములుంచవలయును.

ఈ క్రింది మంత్రముల పఠించుచు పూలచే తులసి దేవిని పూజించ వలయును.

బృందాయైనమః, బృదావన్యైనమః. విశ్వపూజితాయైనమః, విశ్వపావన్యైనమః, పుష్పధారాయైనమః, ఆనందిన్యైనమః, తులస్యైనమః, కృష్ణ జీవ న్యైనమః, నానావిధ పరిమళ పత్ర పుష్పాణి పూజయామి.

పుష్పములు తులసిపై వుంచవలయును.

ధూపమాఘ్రాపయామి॥ అగరువత్తి ధూపమును తులసికి చూపవలెను.

దీపం సందర్శయామి॥ దీపమును ఆమెకు చూపవలెను.

నైవేద్యం సమర్పయామి॥ పండ్లు, బెల్లపుముక్క మొదలగువాటిలో నీకు దొరికినది, యున్నది, దేవునికి నైవేద్యముగా ఉంచదలచిన పదార్థములపై నీరు ప్రోక్షించ వలయును. తర్వాత చేతితో తులసికి చూపవలయును. అనంతరం

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ।
తాని సర్వాణి నశ్యన్తి ప్రదక్షిణ పదే పదే॥

అను శ్లోకమును పఠించుచు మూడుసార్లు కనిష్ఠము ప్రదక్షిణములు చేయవలెను. శక్తి గలవారు అదనంగా 108 సార్లవరకు ప్రదక్షిణములు సల్పవచ్చును. తదనంతరము తులసీ మహామంత్రమును యథావిధముగా జపించవలయును.

---

లోపాలు లేకుండా మానవుడు పుట్టడు, తక్కువ లోపాలున్నవాడు ఉత్తముడు

## పూ జా వి ధా న ము

శ్రీ గణపతిని ధ్యానించి ఆచమనము గావించి సంకల్పము చెప్పవలెను.

సంకల్పము :

అద్యనస్సర్వాభీష్ట సిద్ధ్యర్థం। జ్ఞానప్రాప్తిద్వారా మోక్షఫలా వాప్త్యర్థంచ॥ భర్త్రాసహ అఖండ సుఖ సౌభాగ్య సంతతాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి ద్వారా, తులసీ దేవతా ప్రీత్యర్థంచ। బృందావనే తులసీ పూజాం కరిష్యే.

ఉదకమును స్పృశించి కలశము, గంధము, పుష్పములు మొదలగువానిచే తులసిని పూజించి దీపమును వెలిగించి దీప ధ్యానముచే తులసిని పూజించవలయును.

శ్లో॥ దీపస్త్వం బ్రహ్మరూపోఽసిజ్యోతిషాం ప్రభురవ్యయః।
సౌభాగ్యం దేహి పుత్రాంశ్చ సర్వా న్కామాంశ్చ దేహిమే॥

దీపమునకు పసుపు, కుంకుమ, పూలు వుంచి పై శ్లోకముతో ప్రార్థించవలెను.

## శ్రీ తులసీ అష్టోత్తర శతనామావళి

(ప్రతి పదమునకు మొదట "ఓం" చివర "నమః"ను చేర్చి చెప్పవలయును)

ఓం శ్రీ తులసీ దేవ్యైనమః
శ్రీ సఖ్యై
శ్రీ భద్రాయై
శ్రీ మనోజ్ఞాన వల్లభాయై
పురందరసతీ పూజ్యాయై
పుణ్యదాయై
పుణ్యరూపిణ్యై
జ్ఞానవిజ్ఞానజనన్యై
తత్త్వజ్ఞాన స్వరూపిణ్యై
జానకీ దుఃఖశమన్యై 10

ఓం జనార్థనప్రియాయైనమః
సర్వకల్మష సంహార్త్యై
స్మరకోటిసమప్రభాయై
పాంచాలీ పూజ్యచరణాయై
పాపారణ్యదవానలాయై
కామితార్థప్రదాయై
గౌరీశారదా సంసేవితాయై
వందారు జనమందారాయై
నిలింపాభరణాసక్తాయై
లక్ష్మీచంద్రసహోదర్యై 20

ఓం సనకాది మునిధ్యేయాయైనమః
కృష్ణానంద జనయిత్ర్యై
చిదానంద స్వరూపిణ్యై
నారాయణ్యై
సత్యరూపాయై
మాయాతీతాయై
మహేశ్వర్యై
శుభప్రదాయై
వదనచ్ఛ వినిర్ధూతరాకాపూర్ణ నిశాకరాయై
రోచనాపంక తిలకల సన్నిటల భాసురాయై 30
ఓం శుద్ధాయైనమః
పల్లవోష్ఠ్యై
పద్మముఖ్యై
పుల్లపద్మదళేక్షణాయై
చాంపేయకలికాకారనాసాదండ విరాజితాయై
మందస్మితాయై
మంజులాంగ్యై
మాధవప్రియభామిన్యై
మాణిక్య కంకణకరాయై
మణికుండలమండితాయై 40
ఓం ఇంద్రసంపత్కర్యైనమః
శక్త్యై
ఇంద్రగోపనిభాంశుకాయై

ఓం క్షీరాబ్ధితనయాయైనమః
క్షీరసాగరసంభవాయై
శాంతికాంతి గుణోపేతాయై
బృందానుగుణసంపత్త్యై
పూతాత్మికాయై
పూతనాది స్వరూపిణ్యై
యోగిధ్యేయాయై 50
ఓం యోగానంద విధాయైనమః
చతుర్వర్గ ప్రదారామాయై
చతుర్వర్ణక పావనాయై
త్రిలోకజనన్యై
గృహమేధిసమారాధ్యాయై
సదనాంగణ పావనాయై
మునీంద్రహృదయావాసాయై
మూలప్రకృతిసంజ్ఞికాయై
బ్రహ్మరూపిణ్యై
పరంజ్యోతిషే 60
ఓం అవాఙ్మానసగోచరాయైనమః
పంచభూతాత్మికాయై
పంచకాలాత్మికాయై
యోగాచ్యుతాయై
యజ్ఞరూపిణ్యై
సంసార దుఃఖశమన్యై
సృష్టిస్థిత్యంతకారిణ్యై
సర్వప్రపంచనిర్మాత్ర్యై
వైష్ణవ్యై
మధురస్వరాయై 70

ఓం నిరీశ్వరాయైనమః
నిర్గుణాయై
నిత్యాయై
నిరాటంకాయై
దీనజనపాల తత్పరాయై
రణత్కింకిణీజాలరత్నకాంచీల
సత్కాన్త్యై
చలన్మంజీర చరణాయై
చతురానన సేవితాయై
అహోరాత్రకారిణ్యై
ముక్తాహారభరాక్రాంతాయై 80
ఓం ముద్రికారత్నభాసురాయైనమః
సిద్ధిప్రదాయై
అమలాయై
కమలాయై
లోకసుందర్యై
హేమకుంభకుచద్వయాయై
హరిద్రాకుంకుమాసక్తాయై
చంచలాయై
లక్ష్మ్యై
శ్రీకృష్ణప్రియాయై 90
ఓం శ్రీరామప్రియాయైనమః
శ్రీవిష్ణుప్రియాయై
శంకర్యై
శివశంకర్యై
శ్రీతులస్యై
కుందకుట్మలరదనాయై
పక్వబింబోష్ఠ్యై
శరచ్చంద్రికాయై
చాంపేయనాసికాయై
కంబుసుందరగళాయై 100
ఓం తటిల్లతాంగ్యైనమః
మత్తభంభరకుంతలాయై
నక్షత్రనిభనఖాయై
రంభానిభోరుయుగ్మాయై
సైకతశ్రోణ్యై
కంఠీరవేంద్రమధ్యాయై
కీరవాణ్యై
ఓం శ్రీమహాతులస్యైనమః 108

అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.

శ్లో॥ చందనాగరు కర్పూర ఘృత గుగ్గుల సం యుతం।
గృహాణ ధూపం తులసి వందేఽహం భక్తవత్సలే॥
శ్రీ తులసీ దేవ్యైనమః ధూపం అఘ్రాపయామి.

శ్లో॥ ఘృతవర్తి షు దీప్తం తే మయార్పిత మిదం శుభే।
గృహాణ మంగళం దీపం సర్వైశ్వర్య ప్రదాయిని॥
శ్రీ తులసీ దేవ్యైనమః దీపం దర్శయామి.

శ్లో॥ అన్నం చతుర్విధం స్వాధు రసైః షడ్భిస్సమన్వితం।
నైవేద్యం గృహ్యతాం దేవి, తులసీ మాధవ ప్రియే॥
శ్రీ తులసి దేవ్యైనమః నైవేద్యం సమర్పయామి.

శ్లో॥ సర్వలోక ప్రియేదేవి, గంధద్రవ్య సమన్వితం।
పానీయం తేమయా దత్తం సంగృహాణ సురేశ్వరి॥
శ్రీ తులసీదేవ్యైనమః పానీయం సమర్పయామి

శ్లో॥ అమృతార్ణవ సంభూతే। భక్త వాంఛితదాయికే।
హస్తౌ ప్రక్షాళనం దేవి, కురుసర్వాఘ నాశిని॥
శ్రీ తులసీదేవ్యైనమః హస్తప్రక్షాళనం సమర్పయామి.

శ్లో॥ ఇదం ఫలం మయాదేవి, స్థాపితం పురతస్తవ।
తేన మే సుఫలా వాప్తిః భవేజ్జన్మని జన్మని॥
శ్రీ తులస్యైనమః ఫలం సమర్పయామి.

శ్లో॥ పూగీఫలం మహద్దివ్యం నాగవల్లీ దళైర్యుతం।
కర్పూరైలాసమాయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతామ్॥
శ్రీ తులస్యైనమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ నీరాజయామి సతతం హరివల్లభేఽద్య
కర్పూరవర్తి భిరలం సుఖదాయకే త్వాం
పాదౌ భజామ్య విరతం తవదేవి మాయే
వంశాయ సౌఖ్యమపి దేహి బలంచ పూర్ణమ్॥
శ్రీ తులస్యైనమః కర్పూర నీరాజనం దర్శయామి.

శ్లో॥ పద్మనాభ ప్రియే నిత్యం పద్మోద్భవ సమర్పితే।
పద్మపత్ర విశాలాక్షి వరదా భవ శోభనే॥

శ్లో॥ ఉపచారేషు యన్న్యూనం పూజా కాలేచయత్కృతం।
సర్వం సంపూర్ణతాం యాతి మంత్ర పుష్ప ప్రదానతః
విష్ణుప్రియ కరేదేవి తులసి సుఖదాయికే।
పుష్పాంజలిం ప్రయచ్ఛామి పతేరాయుష్య వర్ధనీ॥
శ్రీ తులస్యైనమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ ప్రదక్షిణం కరోమి త్వాం జగన్నాథే మహేశ్వరి।
పదేపదేచ సౌభాగ్యం మమదేహి వరాననే॥
నమ స్తేదేవి కల్యాణి నమస్తులసి సర్వగే।
నమో వేదమయే దేవి నమ స్తే హరి వల్లభే॥
శ్రీ తులస్యైనమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.
(ఈ శ్లోకమును చెప్పుచూ మూడుమార్లు అర్ఘ్యము ఈయవలెను)

శ్లో॥ గంధ ప్రసూన సంయుక్తం ఫలముద్రాది శోభితం।
అర్ఘ్యం దదామి తులసి తవప్రీత్యై నమోనమః॥
శ్రీ తులస్యైనమః అర్ఘ్యత్రయం సమర్పయామి

శ్లో॥ సౌభాగ్యం సంతతిం దేవి, ధనం ధాన్యం చమేసదా।
ఆరోగ్యం శోక శమనం కురు మే మాధవ ప్రియే॥

శ్లో॥ ప్రసీదమే త్వం సర్వత్ర కృపయా పరయా ముదా।
అభీష్ట ఫల సంసిద్ధిం కురుమే మాధవప్రియే॥

శ్లో॥ నమస్కరోమి దేవి త్వాం విష్ణు వక్షఃస్థలే స్థితాం
ప్రణతార్తి హరే నిత్యం అభీష్ట ఫలదా భవ॥
శ్రీ తులస్యైనమః ప్రార్థనాం సమర్పయామి
(పిదప చేతియందు అక్షతలు. పుష్పములు ఉంచుకొని)

అనయా యథాశక్తి మయాకృత పూజయా శ్రీ తులసీ దేవతా ప్రీయతామ్.
(అని నీటితోపాటు అర్ఘ్యపాత్రలో వదలవలెను) తరువాత
"సర్వం శ్రీ తులసీదేవ్యర్పణమస్తు"

అనవలెను. ఈ తరువాత తులసీప్రదక్షణములు స్త్రీలు తమశక్తి కొలది 108 వరకు చేయవచ్చును.

ఇది శ్రీ తులసీ నిత్యపూజావిధి స్సమాప్తః

## తు ల సీ స్తో త్ర ం

శ్లో॥ 1. జగద్ధాత్రి నమస్తుభ్యం। విష్ణోశ్చ ప్రియ వల్లభే।
యతో బ్రహ్మ దయోదేవాః సృష్టి స్థిత్యంత కారిణి॥

2. నమస్తులసి కల్యాణి, నమోవిష్ణు ప్రియే శుభే।
నమో మోక్ష ప్రదేదేవి, నమః సంపత్ప్రదాయికే॥

3. తులసీ పాతుమాం నిత్యం, సర్వాపద్భ్యోఽపి సర్వదా।
కీర్తితావాపి స్మృతావాపి పవిత్రయతి మానవమ్॥

4. నమామి శిరసాదేవీం, తులసీం విలసత్తమాం।
యాం దృష్ట్వా పాపినో మర్త్యో ముచ్యంతే సర్వకిల్బిషాత్॥

5. తులస్యా రక్షితం సర్వం జగదేతచ్చ రాచరం।
యావినశ్యన్తి పాపాని, దృష్ట్వావా పాపిభిర్నరైః॥

6. నమస్తులస్యతి తరాం యస్యై బద్ధాంజలిం కథా।
కలయంతి సుఖం సర్వం స్త్రీయో వైశ్యాస్తథాపరే॥

7. తులస్యానా పరంకించి ద్దైవతం జగతీ తలే।
యయాపవిత్రితో లోకో విష్ణు సంగేన వైష్ణవః॥

8. తులస్యాం పల్లవం విష్ణో శ్శిరస్యా రోపితం కలౌ।
ఆరోపయతి సర్వాణీ శ్రేయాంసి వరమస్తకే॥

9. తులస్యాం సకలదేవా వసంతి సతతం యతః।
అతస్తా మర్చ యల్లోకే సర్వస్థే వాన్స మర్చయేత్॥

10. నమస్తులసి సర్వజ్ఞే, పురుషోత్తమ వల్లభే॥
పాహిమాం సర్వపాపేభ్య, సర్వసంపత్ప్ర దాయికే॥

తులసీ స్తవము : శ్రీ భగవానువాచ.

బృందా రూపాశ్చ కృష్ణాశ్చ యద్యైకత్ర భవంతిచ।
విదుర్బుధాస్తేన బృందాం మత్ప్రియాం తాం భజామ్యహమ్॥

పురా బభూవ యా దేవీ త్వాదౌ బృందావనేవనే।
కేన బృందావనాఖ్యాతం సౌభాగ్యాం తాం భుజామ్యహమ్॥

అసంఖ్యేషు చ విశ్వేషు పూజితాయా నిరంతరమ్।
తేన విశ్వపూజితాఖ్యా పూజితాం చ భజామ్యహమ్॥

అసంఖ్యానిచ విశ్వాని పవిత్రాని త్వయా సదా।
తాం విశ్వపావనీం దేవీం విరహేన స్మరామ్యహమ్।

దేవానతుష్టాః పుష్పాణాం సమూహేన మయాచినా।
తాం పుష్పసారాం శ్రద్ధాం చ ద్రష్టు మిచ్ఛామి శోకతః॥

విశ్వేయత్ ప్రాప్తిమాత్రేన భక్తానంద భవేద్ధ్రువమ్।
నందినీ తేన విఖ్యాతా సాప్రీతాభవతాదిహా॥

యస్యాదేవ్యాస్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషు చ।
తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియామ్॥

కృష్ణ జీవన రూపాసా శశ్వత్ ప్రియతమా సతీ।
తేన కృష్ణ జీవనీసా సామే రక్షతు జీవనమ్॥



# ఫ ల శ్రు తి

శ్లో॥ 1. ఇతి స్తోత్రం పురాగీతం, పుండరీకేణ ధీమతా।
విష్ణు మర్చయతా నిత్యం, శోభనై స్తులసీదళైః॥

2. తులసీ శ్రీమహాలక్ష్మీర్విద్యా విద్యా యశస్వినీ।
ధర్మ్యాధర్మసనాదేవి దేవదేవి మనః ప్రియా॥

3. లక్ష్మీప్రియ సఖీ దేవీ ద్యౌర్భూమి రచలాచలా।
షోడశైతాని నామాని తులస్యాః కీర్తియన్నరః॥

4. లభతే సుతరాం భక్తి మన్తే విష్ణు పదం లభేత్।
తులసీ భూర్మహాలక్ష్మీః పద్మినీ శ్రీర్హరి ప్రియా॥

5. తులసి శ్రీసఖి శుభే! పాపహారిణి! పుణ్యదే।
నమస్తే నారద నుతే! నారాయణ మనః ప్రియే॥

## తు ల సీ క వ చ ము

అస్యశ్రీ తులసీ కవచస్తోత్ర మంత్రస్య శ్రీ మహాదేవఋషిః అనుష్టుప్ ఛందః శ్రీ తులసీదేవతా ఈప్సితకామనా సిద్ధ్యర్థే జపే వినియోగః॥

శ్లో॥ 1. తులసి శ్రీ మహాదేవి నమః పంకజధారిణి।
శిరోమే తులసీపాతు, ఫాలంపాతు యశస్వినీ॥

2. దృశౌమే పద్మనయనా శ్రీసఖీ శ్రవణేమమ।
ఘ్రాణం పాతు సుగంధా మేముఖంచ సుముఖీమమ॥

3. జిహ్వాంమే పాతు శుభదాకంఠం విద్యమయీమమ।
స్కంధౌకల్హారిణీ పాతు హృదయం విష్ణువల్లభా॥

4. పుణ్యదామే పాతు మధ్యం నాభిం సౌభాగ్యదాయినీ।
కటిం కుండలినీ పాతు ఊరుం నారద వందితా॥

5. జననీ జానునీ పాతు జంఘే సకలవందితా।
నారాయణప్రియా పాదౌ సర్వాంగం సర్వరక్షిణీ॥

6. సంకటే విషయేదుర్గే భయే బాధే మహాహవే।
నిత్యంహి సంధ్యయోః పాతు తులసీ సర్వతః సదా॥

7. అధీతం పరమం గుహ్యం తులస్యాః కవచామృతం।
మర్త్యానామ మృతార్థాయ భీతానా మభయా యచ॥

8. మోక్షాయచ ముముక్షూణాం ధ్యాయినాం ధ్యానయోగకృత్।
వశ్యాయ వశ్యకామానాం విద్యాయై వేదవిదినామ్॥

9. ద్రవిణాయ దరిద్రాణాం పాపినాం పాపశాంతయే।
అన్నాయాకులితానాంచ స్వర్గాయ స్వర్గమిచ్ఛతామ్॥

10. పశవ్యం పశు కామానాం పుత్రదం పుత్ర కాంక్షిణామ్।
రాజ్యాయభ్రష్ట రాజ్యనామ శాంతానాంచ శాంతయే॥

11. భక్త్యర్థం విష్ణు భక్తానాం విష్ణు స్సర్వాంతరాత్మకః।
జాప్యం త్రివర్గ సిద్ధ్యర్థం గృహస్థేన విశేషతః॥

12. ఉద్యం తం చండకిరణ ముపాస్థాయ కృతాంజలిః।
తులసీకాననే తిష్టన్నాసీనో వాజపే దిదమ్॥

13. సర్వాన్కా మానవాప్నోతి యాతి దైవత సన్నిధిమ్।
మమ ప్రియకరం నిత్యం హరిభక్తి వివర్ధనమ్॥

14. యస్మాన్మృప్రజానారీ తస్యా అంగం ప్రమార్జయేత్।
సాపుత్రం లభతే దీర్ఘ జీవినం చాప్య రోగిణం॥

15. వంధ్యాయా మార్జయే దంగం కుశైర్మం త్రేణలాభకం।
సాపిసంవత్సరా దేవ గర్భం దత్తే మనోహరమ్॥

16. అశ్వత్థేరాజ వశ్యార్థీ జపేదగ్రే సరూపధాక్।
పలాశమూలే విద్యార్థీ తేజోర్యభిముఃఖో భవేత్॥

17. కన్యార్థీ చండికా గేహే శత్రు హ త్రై గృహే మమ।
శ్రీ కామో విష్ణు గేహేచ ఉద్యానే స్త్రీ వశాభవేత్॥

18. కిమత్రబహునో క్తేన శృణుసై నేశ్యత త్త్వతః।
యం యం కామ మధ్యాయే త్తం తంప్రాపోన్నత్య సంశయమ్॥

19. మమ గేహే గత స్త్వంతు తారకస్య వధేచ్ఛయా।
జపన్స్తోత్రంచ కవచం తులసీగత మానవః॥
మండలాత్తారకం హర్తా భవిష్యసిన సంశయః॥

ఇతి శ్రీ బ్రహ్మాండ పురాణే తులసీ
మహాత్మ్యే తులసీ కవచం
సంపూర్ణమ్.

శ్రీ త్యాగరాజస్వామి తులసినిగూర్చి యీ క్రిందివిధముగా కీర్తించినారు.

తులసి, జగజ్జననీ, దురితాపహారిణీ ॥తులసీ॥

నిలవరమగు నీసరివేల్పులు లేరట బ్రోవమికను ॥తులసి॥

చరణయుగంబులు నదులకు పరమవైకుంఠమట

సరసీరుహాక్షి, నీమధ్యము సకల సురావాసమట

శిరముననై గమకోటులు చెలగుచునున్నారట

సరస త్యాగ రాజాదివర భక్తులు పాడేరట ॥తులసి॥

(సావేరీరాగము - రూపకతాళము)

# తులసి వివాహము

"వివాహం సంప్రవక్ష్యామి తులస్యాస్య యథావిధి।
యథోక్తం పంచరాత్రే వై బ్రహ్మణా భాషితం పురా॥
అదావేవ వనేవాప్య తులసీం స్వగృహేఽపివా।
వర్షత్రయేణ పూర్ణేన తతో యజన మారభేత్॥
సౌమ్యాయనే ప్రకర్తవ్యం గురు శుక్రోదయే తథా।
అథవా కార్తీకేమాసి భీష్మపంచ దినే షుచ॥
వైవాహికేషు ఋక్షేషు పూర్ణిమాయాం విశేషతః।
మండపం కారయేత్తత్రకుండ వేదీం తథాపునః॥

– హరిభక్తి విలాస ధృత విష్ణు యామళము

పూర్వము బ్రహ్మ పాంచ రాత్రమున దేనిని చెప్పియుండెనో, యా తులసి యొక్క యథావిధి వివాహమును జెప్పుచున్నాను. ప్రథమమున వనములోగాని తన గృహమునందుగాని తులసిని వేసి మూడేండ్లు నిండిన తర్వాత యజన మారంభింప వలెను. గురు శుక్రోదయమయిన సౌమ్యాయనమునగానీ లేదా కార్తీకమాసమున భీష్మపంచకమున వివాహ నక్షత్రమున విశేషించి పూర్ణిమనాడు మండపము కుండవేది యేర్పాటు చేయవలెను.

శాంతికంచ ప్రకర్తవ్యం మాతౄణాం స్థాపనం తథా।
మాతృశ్రాద్ధాదికం సర్వం వివాహం చ సమాచరేత్॥
బ్రాహ్మణాంశ్చ శుచి స్నాతాన్ వేద వేదాంగ పారగాన్।
బ్రహ్మాచ దేశకశ్చైవ చత్వారశ్చ తథా ర్త్విజాః॥

శాంతిని మాతృగణమును స్థాపింపవలెను. వివాహములో వలెనె మాతృ శ్రాద్ధాదికము చేయవలెను. శుచి స్నాతులు, వేద వేదాంగ పారగులునగు బ్రాహ్మణు లను, బ్రహ్మ, ఆచార్యుడు, నలుగురు ఋత్త్విజులను వరించవలెను.

వైష్ణవేన విధానేన వర్ధనీకలశం యజేత్।
మండపంకారయేత్తత్ర లక్ష్మీనారాయణం శుభమ్॥
గ్రహయజ్ఞం పురఃకృత్వా మాతౄణాం యజనాం తథా।
కృత్వానాందీముఖం శ్రాద్ధం సౌవర్ణం స్థాపయేద్ధరిమ్॥



కాల ప్రభావాన్ని కాదనలేము

కృత్వారోపాచ తులసీం లగ్నేత్వ స్తమితేరవౌ।
వాసఃశతేన మంత్రేణ వస్త్ర యుగ్మేన వేష్టయేత్॥

యథాబధ్నేతి మంత్రేణ కంకణం పాణిపల్లవే।
కోదాదితి చ మంత్రేణ పాణిగ్రాహో విధీయతే॥

తతః కుండేసమాగత్య ఆచార్యః సహసాద్విజైః।
ఆచార్యో విదికాకుండే ముహుయాచ్చనవాహుతీః॥

వివాహ కర్మవత్ సర్వం వైష్ణవం దేశికో త్తమైః।
కర్తవ్యశ్చ తతో హోమ విశేషా ద్విధి పూర్వకమ్॥

వైష్ణవ విధానము ననుసరించి వర్ధనీకలశము నర్చన చేయవలెను. లక్ష్మీ నారాయణ శుభమండప మాస్థానమున జేయింపవలెను. ప్రథమమున గ్రహయజ్ఞ (పూజ) మొనరించి మాతృకా గణపూజ నాందీముఖ శ్రాద్ధము గావించి సువర్ణమయ హరి విగ్రహమునందు స్థాపింపవలెను. సూర్యుడ స్తమించిన పిమ్మట సులగ్నమున తులసి నారోపణ మొనరించి, 'వాసః శతేన' యను మంత్రముతో వస్త్రయుగ్మమును జుట్టవలెను. 'యథాబధ్నేతి' మంత్రముతో పాణిపల్లవమున కంకణము కట్టవలెను. 'కోదాదితి' మంత్రముచేత పాణిగ్రహణము చేయింపవలెను. తదనంతరము ఆచార్యుడు బ్రాహ్మణులతో కుండముదగ్గరకుబోయి. వేదికాకుండమున తొమ్మిది ఆహుతులు చేయవలెను. వైష్ణవ వివాహకర్మమువలె సమస్త కర్మము లుత్తమ గురు వనుష్ఠింపవలెను. దానిపిమ్మట విధిపూర్వకముగ విశేషహోమము చేయవలెను.

ఓం నమో భగవతే కేశవాయనమః స్వాహా
ఓం నమో భగవతే నారాయణాయ స్వాహా
ఓం నమో భగవతే మాధవాయ స్వాహా
ఓం నమో భగవతే గోవిందాయ స్వాహా
ఓం నమో భగవతే విష్ణవే స్వాహా
ఓం నమో భగవతే మధుసూదనాయ స్వాహా
ఓం నమో భగవతే త్రివిక్రమాయ స్వాహా
ఓం నమో భగవతే వామనాయ స్వాహా
ఓం నమో భగవతే శ్రీధరాయ స్వాహా

ఓం నమో భగవతే హృషీకేశాయ స్వాహా
ఓం నమో భగవతే పద్మనాభాయ స్వాహా
ఓం నమో భగవతే దామోదరాయ స్వాహా
ఓం నమో భగవతే ఉపేంద్రాయ స్వాహా
ఓం నమో భగవతే అనిరుద్ధాయ స్వాహా
ఓం నమో భగవతే అచ్యుతాయ స్వాహా
ఓం నమో భగవతే అనంతాయ స్వాహా
ఓం నమో భగవతే గదినే స్వాహా
ఓం నమో భగవతే చక్రిణే స్వాహా
ఓం నమో భగవతే విష్వక్సేనాయ స్వాహా
ఓం నమో భగవతే వైకుంఠాయ స్వాహా
ఓం నమో భగవతే జనార్దనాయ స్వాహా
ఓం నమో భగవతే ముకుందాయ స్వాహా
ఓం నమో భగవతే అధోక్షజాయ స్వాహా

వీనిని పత్యేక మాహుతి యిచ్చి, హోమశేషము గావింపవలెను.

యజమానః సపత్నీకోహ్యస్యయే గోత్ర బాంధవాః।
ప్రదక్షిణాశ్చ కర్తవ్యాశ్చత్వారో విష్ణు నా సహ॥
తులస్యా పాణిగ్రహణే వేదికాయాం విభావసోః।
శతకుంభం జపేత్ సూక్తం పావమానీం విశేషతః॥
తథైవ శాంతికాధ్యాయం నవసూక్తం తథైవచ।
జీవసూక్తం పునర్జప్త్వా తథా వైష్ణవ సంహితామ్॥
శంఖఝల్లరి నిర్ఘోషైర్భేరీ తూర్యస్య నిస్వనైః।
గాయంతే మంగళా నార్యా మాంగల్యం విధిమాచరేత్॥
దాస్యాత్ పూర్ణాహుతిం పశ్చా దభిషేక విధిం తతః।
బ్రాహ్మణే వృషభం దద్యాదాచార్యం పరిధాప్యచ॥
గాం పటంచ తథా శయ్యా మాచార్యాయ ప్రదాపయేత్।
ఋత్విగ్భ్యో దాపయే ద్వస్త్రాణ్యేషాం దద్యాచ్చ దక్షిణామ్॥

---

మీరు తృణీకరించవలసినవి మూడు; లోభత్వం, క్రూరత్వం, అల్పత్వం

పత్నీయుతుదయి సగోత్రులతో జుట్టపక్కాలతో విష్ణువుతోసహా నాలుగు ప్రదక్షిణములు చేయవలయును. తులసీ పాణిగ్రహణమున శతకుంభసూక్తమును, విశేషించి పావమానీ సూక్తమును, శాంతికాధ్యాయమును, జీవసూక్తమును కారణాంతరమున వైష్ణవసంహితను అగ్నికుండ వేదికయందు జపింపవలెను. శంఖము, ఝల్లరి, భేరీ, తూర్యధ్వనులు చేయవలెను. నారీగణము మంగళములు పాడుచుండగ మాంగల్య విధి నాచరింపవలెను. పూర్ణాహుతియైన పిమ్మట నభిషేకము చేయవలెను. బ్రాహ్మణునకు వృషభదానము యవలెను. వస్త్రపరివేష్టితమగు గోవును ఆచార్యునకీయవలెను. ఋత్విక్కులకు వస్త్రములిచ్చి దక్షిణ లొసగవలెను,

ఏవం ప్రతిష్ఠితాం దేవీం విష్ణునా చ సమర్చయేత్।
ఆజన్మోపార్జితం పాతం దర్శనేన ప్రణశ్యతి॥
రోపయేత్ తులసీం యస్తు సేచయేచ్చ ప్రయత్నతః।
ప్రతిష్ఠాప్యయధోక్తేన విష్ణునా సహ మానవః।
సమోక్షం లభతే జంతుర్విష్ణులోకం తథా క్షయమ్॥
ప్రాప్నోతి విపులాన్ భోగాన్, విష్ణునా సహమోదతే।
ప్రతిష్ఠా శ్రీ తులస్యాస్తు లిఖితా విష్ణుయామళే॥

- హరిభక్తి విలాసము 20

ఈ విధముగా ప్రతిష్ఠచేసి, విష్ణు సహితముగా దేవిని లెస్సగా నర్చింపవలెను. ఆ జన్మము నార్జించిన పాపము దర్శనము చేతనే నశించును. ఏ మానవుడు తులసిని నాటి, ప్రయత్నపూర్వకముగా నీరు పోయుచు యథావిధిగా విష్ణు సహితముగా ప్రతిష్ఠ చేయునో, వాడు మోక్షమునుబొందును. అక్షయసుఖము విష్ణువుతో ననుభవించును. విష్ణు యామళమందు తులసీ ప్రతిష్ఠావిధి యీ విధముగా జెప్పబడినది.

(దాసశేషులవారి శ్రీ తులసీమహిమామృతమునుంచి)

తులసి చెట్టుకూ ఉసిరిక కొమ్మకూ పెళ్ళిచేస్తారు.

తులసి మహాదేవిని వెనుక తెలిపిన విధాలుగా ఆరాధించిన భక్తులకు కలుగు పరమపదమును గురించి మహానారాయణోపనిషత్ నందు తెలుపబడిన విషయములను సమంత్రకముగా వివరించుచూ ఇంతటితో ఈ గ్రంథమును ముగిస్తున్నాను.

భక్తుడు బ్రహ్మవిద్యా వైకుంఠమును ప్రవేశించిన, అచ్చటి బ్రహ్మవిద్యా సామ్రాజ్య దేవతను దర్శించి ప్రదక్షిణ నమస్కారములుచేసి ఆమె అనుజ్ఞ గైకొని ఇంకను పైపైకి వెళ్ళి బోధానందమయములైన అనంత సముద్రములను అతిక్రమించి, బ్రహ్మవనములందు పరమమంగళ అచలశ్రేణులందు వెళ్ళివెళ్ళి, తర్వాత తులసీ వైకుంఠపురము చేరెను. ఆ పురము

మం. శ్లో॥ పరమ కల్యాణ మనంతవిభవమ్, అమిత తేజో రాశ్యాకారమ్, అనంతబ్రహ్మతేజోరాశి సమష్ట్యాకారమ్, చిదానందమయానేక ప్రాకారవిశేషైః పరివేష్టితం అమిత బోధానందాచలో పరిస్థితమ్, బోధానంద తరంగిణ్యాః ప్రవాహై రతిమంగళమ్, నిరతిశయానందై రనంత బృందావనై రభిశోభితమ్, అఖిలపవిత్రాణాం పరమపవిత్రమ్, చిద్రూపైరనంత నిత్యముక్తై రత్యభివ్యాప్తమ్, ఆనందమయానంత విమానజాలై రలంకృతమ్, అమిత తేజోరాశ్యంతర్గత దివ్యతేజోరాశి విశేషమ్, ఉపాసకస్త్వేవమాకారం తులసీ వైకుంఠం ప్రవిశ్యతదంతర్గత దివ్యవిమానో పరిస్థితామ్ సర్వపరిపూర్ణస్య మహావిష్ణో స్సర్వాంగేషు విహారిణీమ్, నిరతిశయ సౌందర్య లావణ్యాధి దేవతామ్, బోధానందమయై రనంతనిత్యపరిజనైఃపరిసేవితామ్.

తా॥ :- పరమ కల్యాణము, అనంత విభవము, అమిత తేజోరాశ్యాకారము, అనంత బ్రహ్మ తేజోరాశి సమష్ట్యాకారము. చిదానందమయమైన అనేక ప్రాకార విశేషములచే పరివేష్టితము, అమిత బోధానందాచలముపైనున్నది, బోధానంద తరంగిణియొక్క ప్రవాహములచే అతిమంగళము, నిరతిశయానందములైన అనంత బృందావనములచే శోభితమైనది, అఖిల పవిత్రములలోను పరమపవిత్రము, అనంత నిత్యముక్తులైన చిద్రూపులచే వ్యాప్తమైనది, ఆనందమయమైన అనంత విమానజాలములచే అలంకరింపబడినది, అమిత తేజోరాశ్యంతర్గతమైన దివ్య తేజోరాశి విశేషముకలది, ఇట్టి ఆకారముగల శ్రీ తులసీవైకుంఠమును ఉపాసకుడు ప్రవేశించి దానిలోపలనున్న దివ్య విమానముపై నున్న, సర్వపరిపూర్ణుడైన మహావిష్ణువుయొక్క సర్వాంగములందు విహరించునట్టి నిరతిశయ సౌందర్యలావణ్య దేవతను శ్రీ తులసీమాత సంపూర్ణ అనుగ్రహమునకు పాత్రులగుదురు.

ఓం శ్శాంతి, శ్శాంతి, శ్శాంతిః.

# శ్రీ తులసిదేవికి మంగళహారతులు

1. శ్రీ తులసీ ప్రియతులసీ జయమునీయవే జయమునీయవే;
సతతము నిను సేవింతుము సత్కృపగనవే సత్కృపగనవే ॥శ్రీ॥
లక్ష్మీ పార్వతి వాణీ అంశల వెలసీ
భక్తజనుల పాలించే మహిమ నలరుచూ ॥శ్రీ॥
కొల్లగ శాఖలువేసీ, పెల్లుదళములు విరిసీ
శుభకర పరిమళములతో, పెరటి వేల్పువై వెలసీ ॥శ్రీ॥
దళమున కొక విష్ణువుగా విష్ణుతులసివే - శ్రీకృష్ణ తులసివే
జయహారతి గైకొనవే మంగళశోభవతివై ॥శ్రీ॥

(గుణసుందరికథ నుంచి)

2. అమ్మా శ్రీ తులసి దయారాశివమ్మా
మాయమ్మా శ్రీ తులసి దయారాశివమ్మా ॥అమ్మా॥
నీపదమే తారకమే దేవి
కోరెద సన్నిధీ బాధలలా పెన్నిధీ
నీవేకావేదేవి ॥అమ్మా॥
మా స్త్రీజాతికి పరమా ధర్మము
ఇల స్త్రీజాతికి పరమాధర్మము
నీ గుణమే తల్లి
రూపమగని సౌశీల్యము నీలో
కలువహారిణీ, దేవీ
ఈ భవజలధీ, నీవే వారధీ
ఇహపర సౌఖ్యప్రదాయి, సరాయీ ॥అమ్మా॥
సమ్మతి మదిలో భవభయ హారిణీ
సాధవ నీ నామస్మరణే దేవీ ॥అమ్మా॥

(సంసారం నుంచి)

---

3. తల్లీ తులసీ దయగనుమమ్మా
కొల్లగ నిన్నే కొలిచెదమమ్మా ॥తల్లి॥

ఎల్ల జగంబుల అలరించును నీ
చల్లని చూపులు జల్లులు కాదే
ఉల్లమువన్ నిను నమ్మినవారికి
ఎల్లసిరులు అరచేతివి కావె ॥తల్లి॥

సిరి తానై మును - హరిని వరించే
హరి తానై నిను - అక్కున జేర్చె
పరమ కృపామయి - పావని మోచని
శరణమిదే నను - చేకొని బ్రోవుము ॥తల్లి॥

(శ్రీకృష్ణ తులాభారం నుంచి)

4. తులసీ మంగళ కలశీ - లక్ష్మీతులసీ
మా యింట వెలిసిన యిలవేల్పువే మాతా లక్ష్మి
నిను కొలిచినవారికి - సకల సంపదలు
కలసి వచ్చునట - కల్యాణ కలశీ ॥తులసి॥

పెరటిలోని సురకల్పక మీరె
సిరి విహరించి పూతోట
కమ్మని దళముల గాలి
నీ యిల్లాలి తాళికే సౌభాగ్యమాలి ॥తులసీ॥

(చిన్నమ్మకథ నుంచి)

5. పావన తులసీమాతా మా పాలిటి కల్పలతా
హరిగళమాలా కరుణాలవాలా
సిరిగల జవరాలా సేవాలోలా

తిరముగ మా యింట దీపము నీవై
నిరతము వెల్గుము నీరాజన మిదిగో ॥పావన॥
మగువల మనసున మాధుర్యమీవే
మంగళధాత్రివి దేవి నీవే
జగముల జనయిత్రి నీకిదే హారతి
అగపడు దైవము నీవేనని వేడితి ॥పావన॥
(శ్రీకృష్ణ కుచేల నుంచి)

6. తల్లి తులసీ! ఓ కల్పవల్లి!
ఏ యింటిలో నిను పాదు కొలిచినా
మనసారగ నిన్నెవరు కొలిచినా
సిరిసంపద లొనగూర్చెదవమ్మా ॥తల్లి॥
స్త్రీ జాతికి నీ వాదర్శముగా
చిరకాలము విలసిల్లితివమ్మా!
జలజనాభు హృదయాలయమున నే
అలంకరించిన దేవతవమ్మా ॥తల్లి॥
ముల్లోకాలకు కన్నతల్లివని
ఎల్లపుడూ సేవించెదమమ్మా
సుఖదాయకమూ శోభాకరమూ
నిను పూజించుటే నిత్యమంగళమూ ॥తల్లి॥
(వదినగారి గాజులు నుంచి)



తులసీ గాయత్రి : ఓం శ్రీ తులస్యై విద్మహే
విష్ణు ప్రియాయై ధీమహి
తన్నోబృందా ప్రచోదయాత్.

# అభిప్రాయములు

**Prof. Dr. RAMNIVAS SARMA**
Dy. Director
Dept. of Indian Medicine & Homeopathy
(Govt. of A.P.)
Superintendent, Govt. Ayurvedic Hospital,
HYDERABAD

శ్రీ పాటీల్ నారాయణరెడ్డిగారు వ్రాసిన "శతమానం భవతి" పుస్తకం చూచాను. సామాన్యునికికూడా అర్థమగురీతిలో ఆయుర్వేద స్వస్థవృత్తాది ఆరోగ్య సూత్రములన్నియూ ఒకచోట చేర్చి ప్రచురించారు. ఈ సూత్రాలను పాటించిన "శతమానం భవతి" అనుటలో అతిశయోక్తి లేదు.

దీనితోపాటు ప్రస్తుత కాలమున వాదగ్రస్తమైన స్వమూత్ర చికిత్సకు సంబంధించిన డామర తంత్రంకూడా చేర్చారు. "నా నౌషధీనాం భూతం జగత్ కించిత్" అనునవి నేను నమ్ముతాను, ప్రపంచంలో ఔషధముకాని పదార్థమంటూ ఏదీలేదు. ప్రజాదరణ పొందని అనేక ఓషధులు ఆయుర్వేదంలో చెప్పబడియున్నాయి. కానీ అవి అత్యాశ్చర్యకరమైన గుణముల నివ్వగలవని మాత్రం తెలుసుకోవాలి, మూఢనమ్మకాలు వదలాలి, శ్రీ రెడ్డిగారి ఈ ప్రయత్నం సఫలమై "శతమానం భవతి" ప్రజాదరణ పొందగలదని ఆశిస్తున్నాను.

Date 24-3-81 — Dr. Ramnivas Sarma

  

**Dr. M. SARABHAYYA SARMA, L.I.M,**
Ayurvedacharya
Professor & Incharge Principal
Dr. N R.S. Govt. Ayurvedic College,
VIJAYAWADA

ధర్మార్థ కామ మోక్షములనే చతుర్విధ పురుషార్థాలను సాధించటానికి మానవులకు మానసిక, శారీరక స్వస్థత అవసరం, స్వాస్థ్యాన్ని కాపాడుకోవడానికీ, రోగ నివారణకూ, వ్యాధుల చికిత్సకు, అనాదికాలంనుంచి మన దేశంలో ఆయుర్వేదశాస్త్రం

ఉపయోగపడుతూఉంది. బ్రహ్మనుంచి ఆరంభమైన ఆయుర్వేదం దైవ, ఋషి పరం పరలద్వారా వ్యాప్తిచెంది ప్రచారంలోకి వచ్చింది. ఆయుర్వేద వైద్యులు, వైద్య విద్యార్థులకే కాక ప్రతి మనిషికీ ఆరోగ్య పరిరక్షణ విషయంలో పఠనీయమైనది.

ప్రధానమైన ఆయుర్వేద గ్రంథాలన్నీ చాలాకాలంవరకు సంస్కృతంలోను, ఇటీవలికాలంలో దేశభాషలలోను, ఆధునిక కాలంలో ఇంగ్లీషు మొదలయిన పాశ్చాత్య భాషలలోనూ రచింపబడినాయి. అయినా విద్యావంతుడయిన సామాన్యుడు ఆయుర్వే దంలో వుండే విశేషాలు తెలుసుకోగోరితే అందుకు తగిన గ్రంథాలు ఇంచుమించుగా లేవనే చెప్పాలి. మన తెలుగు భాషలో ముఖ్యంగా మరీ తక్కువ. ఏ కొద్దిగానో వున్నాకూడా ఔషధాల నిర్మాణం, చికిత్సా పద్ధతులు వర్ణించబడ్డాయేకాని శాస్త్రీయమైన స్వస్థవృత్త, సద్వృత్త విషయాలు వివరించబడలేదు. "వైద్యశ్రీ పాటీల్ నారాయణ రెడ్డిగారు" వ్రాసిన "శతమానం భవతి" అనే చిన్న పుస్తకం ఈ లోపాన్ని చాలా వరకు తీరుస్తుందనే అనుకోవచ్చు.

పుస్తకంపేరు సూచిస్తున్నట్లుగానే పూర్ణాయువై నూరేండ్లు జీవించటానికి ఆచర ణోపాయాలైన శాస్త్రోక్తదినచర్య, రాత్రిచర్య, ఋతుచర్య, సద్వృత్తాది విషయాలన్నీ సాకల్యంగా ఈ కాలపు ప్రజలకుకూడా అనుకూలంగా ఉండేవిధంగా వివరించబడినవి. వివాదాస్పదమైన మూత్రపాన చికిత్సను గూర్చిన సశాస్త్రీయ వివరణకూడ ఈ పుస్త కంలో చేర్చబడింది. ముఖ్యంగా భోజన క్రమము, సంభోగాది విషయాలలో సామా న్యులకు కలిగే అనేక సందేహాలు తొలిగిపోయే విధంగా చాలా వివరంగా తెలుప బడ్డాయి. కేవలం నీతిసూత్రాలుగా వల్లించబడుతుండే సద్వృత్త విషయాలు ఎంతో ఆసక్తిదాయకంగా తెలుపబడ్డాయి. ఇటువంటి పుస్తకాలు వైద్యవృత్తిలోవారే కాకుండా ఆరోగ్యాభిలాషియైన ప్రతివ్యక్తి తప్పక చదవతగినది.

డాక్టర్ నారాయణరెడ్డిగారు గత ముప్పది సంవత్సరాలుగా వైద్యవృత్తిలో రోగులకు సేవచేస్తూ ప్రభుత్వంవారిచే అనేక హోదాలలో గౌరవింపబడుతూ గ్రంథ రచనచేస్తూ పేరుపొందినారు. ఇటువంటి గ్రంథాలు ఇకముందుకూడా అనేకం రచించి ఆయుర్వేద ప్రచారానికి, ఉన్నతికి ఇతోధిక సేవచేస్తారని అందుకు శ్రీ ధన్వంతరి భగవానుని కృపవారికి కలగాలని కోరుకుంటున్నాను.

Date 29-3-81

Dr. M. Sarabhayya Sarma

Respected Dr. Patil Narayana Reddy Garu,

Namaste, your book "SATAMANAM BHAVATI" is gone through. It is a very interesting and very useful with correlation and compilation of Ayurveda Principles which when adopted can help a man to live not less than hundred years or more. I am confident that this book will find wide appreciation of all in and out and honest efforts of the author will be widely appreciated.

Dr. M. SANKARA SASTRY
Principal, Govt. Ayurvedic College,
HYDERABAD

Date :
3-4-81

  

Sir,

Sub : Openion on the book 'SATAMANAM BHAVATHI' Regarding.

I have gone through all the topics of this book. The presentation is nice, with quotations from various authors and authorities. Some more care is to be taken to present it in a more scientific manner.

The 'DAMARA TANTRAM' is also interesting to read. I congratulate the author for taking pains in presenting this book.

I hope this can be made useful as one of reference books for Swastavruttam.

With best wishes.

Yours Sincerely
V. KRISHNA MURTHY
Principal, A.L. Govt. Ayurvedic College,
WARANGAL - 2

Date :
29-4-81

# "ఆచారాలు-శాస్త్రీయత" - సమీక్షలు

శాస్త్రీయ విజ్ఞానం బాగా వృద్ధిపొందిన సైన్సుయుగం ఇది. ప్రతి విషయాన్ని శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించటం, విశ్లేషించటం అలవాటయిన కాలం. అయితే ఈ సైన్సంతటినీ లోగడ మన ఆచారాల్లోనే అంతర్లీనంగా పొందుపరచటం జరిగిందంటారు రచయిత. తన వాదానికి బలంగా మూడు భాగాలుకల "ఆచారాలు - శాస్త్రీయత" అనే ఈ చక్కని పుస్తకాన్ని రాశారు. గ్రంథం చదివినవారికి మన ఆచారాలు ఎంత దూరాలోచనతో సృష్టించబడినవో, వీటివల్ల ఎంత ప్రయోజనం ఒన గూడుతోందో కడు చక్కగా విశదమౌతుంది. అటువంటి సదాచారాల్ని మనం ఎలా నిర్లక్ష్యంచేస్తున్నామో కదా అనే ఆలోచనతో ఒకింతబాధకూడా కలుగుతుంది. లేబరేటరీలకు పరిమితంకాని, అందని మహాజగత్తు ఇంకెంతో ఉంది. భారతీయ ఋషివర్యులు ఆ జగత్తును గురించిన విజ్ఞానాన్నికూడా అతీంద్రియ జ్ఞానంతో సాధించి - ఆప్రభావంతో సామాన్య జనం అనుసరించటానికి సులభ సాధ్యమయిన ఆచారాలతో ఒక ఉదాత్తమయిన సంస్కృతిని మనకు అందించారు. ఆ సంస్కృతిలోని పరమార్థాన్ని ఈ గ్రంథంలో చక్కగా వివరించారు.

ఉపనయనం, సంధ్యావందనం వగైరా ప్రక్రియలలోని అంతరార్థాన్నికూడా ఈ గ్రంథంలో తేటతెల్లంచేశారు. తాంబూల సేవనం వంటి సామాన్య విషయాలను గురించికూడా చర్చించి వాటివల్ల కలిగే మేలును విశదపరిచారు. ఏ పండగొచ్చినా పబ్బమొచ్చినా ఇంట్లో ఏ శుభకార్యం తటస్థపడ్డా గుమ్మానికి మామిడి తోరణం కట్టుకుంటాం. అలా మామిడితోరణాన్ని ఎందుకు కట్టుకోవాలి అనే సందేహం వచ్చిన వారికి "మొదటిది పచ్చని ఆకు బొగ్గుపులుసు గాలిని పీల్చి ప్రాణవాయువును విడుచును. అందువలన వాతావరణము శుద్ధి కాబడును. రెండు - ఎండు మామిడి ఆకులను కాల్చి భస్మముచేసి సద్యోవ్రణములపై ఆబూడిదను చల్లిన కాని కొబ్బరినూనెలో కలిపి రాసిననుగాని ఆ వ్రణములు నగ్గిపోవును." అంటూ వివరిస్తారు రచయిత. ఇంకా పసిపిల్లల తలపై కొట్టకూడదు అంటారు. ఎందుకు కొట్టకూడదో తెలుసుకోవాలన్నా, పొద్దున్నే లేచినపుడు చాలామంది తమ అరిచేతిలోనే శ్రీ అనో ఓం అనో రాపి దాన్ని కళ్ళకద్దుకుని మరీ లేస్తారు. అలా ఎందుకు చేయాలో ప్రాతఃకాలంలో కరదర్శనంవల్ల కలిగే లాభాలేమిటో తెలుసుకోవాలన్నా ఈ గ్రంథాన్ని చదివి తెలుసు

కోవాల్సిందే. ఇవేకాదు, ఇటువంటి ఆచారాల వెనకవున్న అసలు అర్థాలను ఎన్నిటినో ఈ గ్రంథకర్త సులభశైలిలో వివరించారు. వీరి కృషి ప్రశంసనీయం. పుస్తకాల ముద్రణా, గెటప్ బాగున్నాయి. మన సంస్కృతిపట్ల అభిమానం వుండి ఆచారాల అసలు అర్థాన్ని తెలుసుకోవాలని కుతూహలం వున్నవారందరూ తప్పక చదవవలసిన గ్రంథం ఇది!

(ఆచారాలు - శాస్త్రీయత 1, 2, 3 భాగములు. రచయిత : భిషజ్మణి పాటీల్ నారాయణరెడ్డి. ఒక్కొక్క భాగం వెల : రు. 30/- మూడు భాగాల బైండు వెల : రు. 120/-. ప్రతులకు : డా॥ పాటీల్ నారాయణరెడ్డి, నాగార్జున నిలయం, ఎమ్ ఐ.జి. - 96, హౌసింగ్‌బోర్డు కాలనీ, అనంతపురం - 515 001)

(ఈనాడు, ఆదివారం 21 జులై 1991)

- స. రా.

  

(ఆచారాలు - శాస్త్రీయత, రచన - డా॥ పాటీల్ నారాయణరెడ్డి, డెమ్మీ 1/8 పుటలు-880 + 34 + 22, మూల్యము-రు. 120/- ప్రాప్తిస్థానము-పాటీల్ నారాయణ రెడ్డి, M.I.G -96, హౌసింగ్‌బోర్డు కాలనీ, అనంతపురం - 515 001)

హిందువులైన మనం ప్రస్తుత పాశ్చాత్య విజ్ఞానం నుండి మేలు పొందుతూ, ప్రపంచానికి ఆధ్యాత్మిక, సాంస్కృతిక మూల్యాలందివ్వాలన్నారు వివేకానందస్వామి. హిందువుడనై జన్మించినందుకు గర్వించు - అన్న ఆయన బోధనను గుర్తించిన మహాసంస్థలు, ఎందరో మహనీయులు విజృంభించి కృషిచేయడం ప్రారంభమైంది. సర్వశక్తులతో ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. అట్టి ప్రయత్నాలలో ఒకటే ఈ పుస్తకం.

హైందవ ఆచారాలలోని శాస్త్రీయతను పరిచయం చేయడమే ఈ గ్రంథకర్త లక్ష్యం. స్వయంగా ఆయుర్వేద వైద్యులయిన ఈ రచయిత పసుపు రాసుకొనడం మొదలు దూరానవున్న సూర్యునికి అర్ఘ్యప్రదానం చేయడంవరకు ఎన్నెన్నో సంప్రదాయాలలోని శాస్త్రీయతను గుర్తు తెలుపడానికి కృషిచేశారు.

ఉపనయనము, యజ్ఞోపవీతధారణ, సంధ్యావందనము, దేవతార్చన, నవగ్రహ శాంతి, అగ్నిహోత్రము మున్నగు విషయములు చర్చింపబడ్డాయి.

ద్వితీయభాగంలో గాయత్రీ మంత్ర వివరణ, గాయత్రీ మంత్రపు అక్షరముల విమర్శ; దేవాలయము-దైవప్రార్థన; స్వామి శరణమయ్యప్ప; సామాన్య ధర్మాలు, అనూచాన ఆచారాలకు వివరణ; నాగప్రతిష్ఠ; నాగపంచమి; ఆరోగ్యసూత్రాలు; శివరాత్రి; హోమమును గురించిన ఆసక్తికరమైన విషయములు వున్నాయి.

తృతీయ భాగంలో విగ్రహారాధనలో మానసికశాస్త్ర రహస్యాలు, ప్రతిమా నిర్మాణములోని సంకేతాలు, వాస్తుశాస్త్రము, శ్రీరామనవమి, ఉగాది, కార్తీక మాసాచరణము, ధనుర్మాస ఆచరణము, మకర సంక్రాంతి, పునర్జన్మ గురించిన ఆసక్తికర విషయాలు ఉల్లేఖించబడ్డాయి.

హిందువులుగా వుంటున్న మనమందరము మన ఆచారాలలోని శాస్త్రీయతను తెలుసుకోవడం మన కర్తవ్యం. అందుకు ఈ గ్రంథం ఎంతైన దోహదం చేస్తుంది,

(శ్రీ రామకృష్ణప్రభ) - ఆనంద



మీ పుస్తకం పూర్తిగా చదివాను. పదిమందిచేత చదివిస్తున్నాను. ఇంతమంచి పుస్తకము ఇప్పటివరకూ చదువలేకపోవటం దురదృష్టమే!

మీరు చేసిన సేవ అసామాన్యమైనది. మీకు పరమేశ్వరుడు ఆయురారోగ్యములు ప్రసాదించుగాక!

ముదిగొండ శివప్రసాద్

ప్రొఫెసర్, తెలుగుశాఖ ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్



భిషజ్మణి శ్రీ పాటీల్ నారాయణరెడ్డిగారికి నమస్కారం.

అయ్యా!

"ఆచారాలు - శాస్త్రీయత" అన్న బృహద్గ్రంథం చాలావరకు చదివినాను.

అనాదిగా మనం పాటిస్తున్న ఆచారాలు, సంప్రదాయాలు మున్నగువాటి వెనుక నున్న శాస్త్రీయమైన వాస్తవాలను, సవివరంగా వెల్లడించి, నేటివారు వేసే ప్రశ్నలకు

సమాధానాలందజేసినారు. శాస్త్రీయాధారాలను పేర్కొన్నారు. మీరు కొన్నేళ్ళుగా సాగించిన కృషి ఈ గ్రంథ రూపంలో వెలువడటం అత్యంత అభినందనీయం.

ప్రతి గ్రంథాలయంలోను ఉండవలసిన గ్రంథమిది. నవలవలె ఒక పట్టున చదువుట భావ్యంకాదు. ప్రతి అధ్యాయం చదివి మననం చేసుకోవటం అవసరం.

- జానుముద్ధి హనుమచ్ఛాస్త్రి
కడప

 

శ్రీ రెడ్డిగారికి నమస్కారములు!

మానవ జీవనరథానికి జ్ఞానం, విజ్ఞానము రెండు చక్రాలవంటివి. జ్ఞానము ఆంతరంగిక ధార్మిక జీవన స్రవంతిని, విజ్ఞానము బాహ్యలౌకిక జీవన స్రవంతిని ప్రతిబింబింపజేసే దర్పణ సూచికలు. రథము పరమ గమ్యాన్ని చేరుటకు ఉభయ చక్రముల పరస్పర గమన సమతులత అత్యంతావశ్యకము. ప్రమాదభరితమైన మానవ జీవనయాత్ర సుఖప్రదంగా సాగుటకు త్రికాలవేత్తలగు మన మహర్షులు చూపిన మార్గాలనే ఆచారాలుగా శాస్త్రాలలో నుల్లేఖింపబడినవి.

హేతువాద బుద్ధి పెరుగుటవలన ఆచారాల విలువలను విస్మరించి అనాచార తమస్సులో మునిగిన నేటి మానవ సమాజమునకు శ్రీ రెడ్డిగారు పూర్వాచారాలకు ఆధునిక వైజ్ఞానిక భాష్యంచెప్పే ఈ గ్రంథాన్ని అందించి ఎంతో సేవజేశారు.

హరప్పా, మొహంజదరో త్రవ్వకాలవల్ల ప్రాచీన సింధునాగరికత వెలుగు చూడగలిగింది. ఈ గ్రంథకర్త కృషి ఫలితంగా అపారమైన ప్రాచీన ఆచారసంపద లోని కొన్ని విజ్ఞాన రత్నాలు నేడు వెలుగు చూడగలుగుచున్నందులకు నేను తోటి వైద్య సహచరునిగా అమితమైన హర్షాన్ని పొందుచున్నాను.

ఈ గ్రంథము ఆచార సంపన్నులకు మణిదీపికగాను, అనాచారులకు ఆనంద భైరవి కలికముగాను, హేతువాదులకు అణుదర్శినిగాను, భావకులకు మంజుల పరిమళ భరిత బంగారుభరణిగా నొప్పారుచున్నది.

కె. ప్రభాకరవర్ధన్, యం.ఏ.,
శ్రీ రామకృష్ణ ఆయుర్వేద ఆశ్రమము, గద్వాల